# ఆమె సౌందర్యవతి...
# ఆమె పాండ్స్‌ను ఉపయోగిస్తుంది



మీ ముఖమును మృదువుగా మరియు
మనోహరముగా ఉంచుకొనుటకు

## పాండ్స్

వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి




తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీము చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణములోనే కనపడకుండాపోతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరును అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.

చర్మమును శుభ్రపరచే క్రీమ్: ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది.

చీస్బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

# నగరంలో నాటక ప్రదర్శనాలు

విద్యార్థులు శెలవులకు ఇళ్ళకుపోవడంతో, 'నాటకీయులు' రంగస్థల పునరుద్ధరణ కార్యక్రమ పథకకల్పనలో మునిగి తేలడంతో, మంత్రులు శెలవికాలంలో ఎందుకైనా మంచిదని రాజధాని నగరం వీడి పోవడంతో—కొన్ని నెలలుగా నాటక ప్రదర్శనలు తక్కువయ్యాయి హైదరాబాదులో.

మంత్రులు తిరిగి వచ్చారు రాజధాని నగరానికి. కాని—శాసనసభల్లోను, పరిషత్తులోను అప్పచెప్పవలసి వచ్చిన డైలాగులోను, మోనోలాగుల్లోను సతమతమౌతున్నారు. ఈ ప్రదర్శనల్లో పాల్గొనడానికి తీరిక లేదు వారికి. అధమం ఒక మంత్రైనా ప్రదర్శనకి అధ్యక్షత వహించకపోతే, నాటకం ఎలా సాగుతుంది? వర్షాలు ఎడతెరపిలేకుండా కురవడంవల్ల, బయటకు పోలేని నాటకీయులు బయటకు రావడం లేదు. నాటకరంగ భవిష్యత్తును గురించి దుస్స్వప్నాలతో ఇళ్ళలోనే ఉండిపోతున్నారు. విద్యార్థులు వచ్చారుగాని, కళాశాలల్లో ప్రవేశం లభించడంవంటి తప్పనిసరి పనుల్లో ఉండిపోయారు

ఇప్పుడు కొంచెం తీరిక లభించింది: ఇక్కడ, అక్కడ, ఇప్పుడు, అప్పుడు నాటకాలువస్తూ ప్రారంభించాయి. సరోజినీదేవి హాలులో (వి) 'చిత్ర' ప్రదర్శనం సంగతి గతవారం ప్రస్తావించాను. అదేహాల్లో ప్రదర్శించబడిన 'రిక్షావాలా,' 'భారతి,' 'అల్లి ముత్తా'; మరోహాల్లో ప్రదర్శించబడిన 'తెరవెనుక,' 'దెయ్యం' ప్రదర్శనల కథ వినండి.

## తెరవెనుక దెయ్యం!

ఒకానొక న్యాయస్థానం: "ఫలానా దేశమనికాదు—ఫలానా ప్రభుత్వమనికాదు—ఎక్కడో ఒక చోట—ఏదో ఒక కాలంలో—ఎవరో ఒకరి అండన—తప్పనిసరిగా పుట్టుకొచ్చే న్యాయస్థానం అది!"

ఉరిశిక్ష విధిస్తాడు జడ్జి ఆ న్యాయస్థానంలో. 'విచారణ'తొందరగా ముగించి, శిక్ష విధించమని తొందరచేస్తాడు 'హిజ్ ఎక్సలెన్సీ' జడ్జిని టెలిఫోనులో పిల్చి. అధికారులు చెప్పిన వార్తలని అధికారులు చెప్పినట్టుగా పత్రికలకు పంపిస్తాడు పత్రికా విలేఖరి. "న్యాయశాస్త్ర పారంగతుడు ఎటువంటి అనన్యాయాధికారి ఖైదీని దోషిగా, ద్రోహిగా అపరాధిగా నిర్ధారణచేసి ఉరిశిక్ష వెయ్యబోతున్నారు. ఏమైనాసరే! న్యాయం జరిగితీరాలి. అన్యాయం అధర్మం మాటు మణిగిపోవాలి" అంటూ ముందే వార్త పంపించేస్తాడు పత్రికా విలేఖరి

ఆలోచన అంటువ్యాధి అని సాక్ష్యం ఇస్తాడు డాక్టర్. నిందితుడు ఉరికంబం ఎక్కేలోగానే అంటువ్యాధి వ్యాపిస్తుంది. డాక్టర్, పబ్లిక్ ప్రాసిక్యూటర్, పోలీస్ జవాన్, రిపోర్టర్, జడ్జి—అందరూ ఈ రోగం అంటే 'మరణిస్తారు'. ఏదో ఒక 'దెయ్యం' మనుష్యుల మనస్సుల్లో, మనస్సుల వెనక, మెరుగుతూ ఈ వ్యాధిని వ్యాపింపచేస్తుంది. దెయ్యం అంటుంది చివర: "నా బాధ్యత నాకుంది. నిరంతరం నిర్విరామంగా ఈ కందిరీగల తుట్టెల్ని, ఈ మన్నుదిన్న పాముల్ని కదిలించి వదలిపెట్టకుండా ఉంటాను. ఏనాటికైనా సభ్య మానవ ప్రపంచం సుస్థిర శాంతియుత సహజీవన సామ్రాజ్యంగా విర్భావించక పోదు."

ఆగస్టు ఎనిమిదవ తేదిరాత్రి సికిందరాబాదు శ్రీ విజయ కళాసమితి ఆధ్వర్యాన, హైదరాబాదు సెంట్ గ్రామర్ స్కూల్ హాల్లో ప్రదర్శించబడిన రెండు నాటికల్లో మొదటిది: "దెయ్యం". నాటకకర్త: శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి. పాత్రధారు: శ్రీయుతులు వరసు, చాట్ల శ్రీరాము



ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారితో అమెరికన్ వ్యాపార,

# ★ రాజధాని కబుర్లు ★

సూర్యనారాయణమూర్తి, కె. శ్రీహరిమూర్తి, పి. ఆర్. నరసింహారావు, బాలప్ప, కె వి. హనుమంతరావు. దర్శకత్వం: శ్రీ శ్రీరాములు. పాత్రధారులందరూ సన్నివేశాలకు తగినట్లు నటించారు. ముఖ్యంగా మూకీగా పాత్రలు అభినయించే దృశ్యాలు చక్కగా ఉన్నాయి.

రచననుబట్టి—ఇదొక పరభాషా రచనకు అనుసరణ అన్నది స్పష్టం. శ్రీ ప్రఖ్య రచనలు 'కాళరాత్రి', 'ఫణి' ఇత్యాదులు చదివినవారు ఈ నాటిక ముందు రచింపబడిందని గ్రహిస్తారు. వాక్య రచనలో ఆ నాటికల్లో కనుపించే శక్తి ఈ నాటికలోని వాక్యాల్లో మృగ్యం. అనుభవంలేని రచనల్లో ప్రధానంగా కనుపించే 'అనుప్రాసలకోసం తృష్ణ' ఈ రచనలో కనుపిస్తుంది. "ముగ్గురు మూర్ఛపోయారు; సెవెన్ మంది సొమ్మసిల్లారు"— వంటివి క్షమించరాని, క్షమించలేని ఉదాహరణలు 'నా విష్ణుః పృథివీపతిః' వంటివి కనపడ్డంవల్ల ఈ రచన అనుసరణలా కనుపించినా, 'క్రూసిఫై చెయ్యడం'; 'ఏథెన్స్', 'పాలెస్టైన్' వంటి ప్రస్తావనలవల్ల ఇది అనువాదమేమో అనిపిస్తుంది.

కాని కొన్ని వాక్యాలు-ఆ వాక్యాలలో దాగివున్న భావాలవల్లనైతేనేం, సందర్భోచితంగా మన మనస్సుల్లో కదలికలవల్లనైతేనేం—చాలా శక్తిమంతంగా ఉన్నాయి. ఉదాహరణకి: "...ఈ మనిషి తనకు తాను స్వతంత్రంగా ఆలోచించడానికి సాహసించాడంటే, ఏమిటీ విపరీతం?...మన మిప్పుడెక్కడున్నాం? తిరిగి పాతరాతియుగంలో ఉన్నామా?" అంటాడు ప్రాసిక్యూటర్. "...స్వతంత్రంగా ఆలోచించడానికి ధైర్యం చేసిన నీ మొండితనమూ—అన్నీ టీకా తాత్పర్యాలతో వివరిద్దామనుకున్నాను. కాని ఇప్పుడు టైం లేదు" అంటాడు జడ్జి! జడ్జి శిక్ష విధిస్తే, ఖైదీ చావనన్నాట్ట. "చావడానికి ఎంతమాత్రం ఒప్పుకోవడం లేదు" అంటాడు పోలీస్ జవాన్. "ఏమిటీ! —చావనంటున్నాడా!...ఇంత ధిక్కారమా!" అంటాడు జడ్జి. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

దయ్యంపాత్రని ఒక స్త్రీపాత్రకి అప్పచెప్పడంలో దర్శకులు వివేకం ప్రదర్శించారు. కాని—దయ్యం పాత్ర ఊహా ప్రధానం కావడంవల్ల, కదలికలో ఇంకా చురుకుదనం ఉండాలి; లయ ఉండాలి; బలం ఉండాలి. వచ్చే ప్రదర్శనల్లో ఈ విషయంలో శ్రద్ధ తీసుకోబడుతుందని ఆశిస్తాం.

ఈ పటిష్టమైన రచనలోని సంభాషణల్లో అక్కడక్కడ కనుపించే లోపాలను రచయిత గ్రహించుకోవాలి.

'తెరవెనుక' నాటిక రచయిత: శ్రీ ఎస్. నారాయణరావు. నటీనటులు: కుమారి ఎం. విజయలక్ష్మి, శ్రీయుతులు సి.హెచ్. నరసింహం, కె. సూర్యనారాయణమూర్తి, సి.హెచ్. జి. రామచంద్రరావు, ఎమ్. రాధాకృష్ణమూర్తి, పి. కొండరాజు, కమలాకాంత్. దర్శకత్వభారం శ్రీ కె సూర్యనారాయణమూర్తి వహించారు. సంభాషణల్లో కొన్ని చప్పగా ఉన్నాయి. కొన్ని సంభాషణల్లో సునిశితమైన హాస్యం ఉంది. కాని నాటిక పరిహద్దులు గమనించకుండా, ప్రపంచంలో ఉన్న సెంటిమెంట్లన్నీ ఈ నాటికలో పొదగాలని యత్నించిన రచయిత విఫలులయ్యారు. నటీనటులు చక్కగానే నటించారు.

## అభ్యుదయ కళాసమితి

నగరంలోని వివిధ కళాశాలలకు చెందిన విద్యార్థులు, విద్యార్థినులు ఒక సాంస్కృతిక సంస్థను స్థాపించుకొని, శ్రీ తాపీ ధర్మారావును అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. ఈ సమితి ఆధ్వర్యాన ఆగస్టు 12 వ తేదీన 'సాంస్కృతిక' ప్రదర్శనలు సరోజినీదేవి హాలులో జరిగాయి. ప్రవేశరుసుము ద్వారా లభించిన మొత్తంలో ఖర్చులుపోను రు 600 లు ప్రధాని సహాయనిధికి పంపబడ్డాయి.

ఈ సంస్థకు కార్యదర్శి శ్రీ [illegible] వెంకటేశ్వరరావు. ఉపాధ్యక్షురాలు: శ్రీమతి విజయలక్ష్మి; సహాయ కార్యదర్శిని: కుమారి ఝాన్సీరాణి. కోశాధిపతి: శ్రీ జగన్మోహన్. సాంస్కృతిక కార్యక్రమాల దర్శకత్వభారం శ్రీ జతిన్ బెనర్జీది. కార్యవర్గ సభ్యులుగా కుమారికలు అంజాల్, దుర్గాభవాని, యం. నిర్మల; శ్రీయుతులు ఏ. మురళీధరరావు, బి. నారాయణ, భానుప్రకాశ్ ఎన్నుకోబడ్డారు.

వరదబాధితుల సహాయార్థం నిధి సేకరణ కృషి ఉత్తమమైనదని, విద్యార్థినీ విద్యార్థులు అభినందనీయులు అని వేరే చెప్పాలా? కాని—ఈ మొత్తాన్ని విరాళాలుగా సేకరిస్తే, ఇంతో అంతో కోటివారికి సహాయపడ్డా మనసే తృప్తి దాతలకు ఉంటుంది. ఉభయ స్థాయి ప్రదర్శనలు దాతలకు మరో విధమైన తృప్తిని కలుగజేసేవి. ఈ రెంటిలో ఏ తృప్తి లేకపోతే డబ్బిచ్చినవారు రెండు గడ్డి (వాముల/మేట్ల) మధ్య నిలబడి, ఏ గడ్డి కొరకలేని ఎద్దుబాధననుభవిస్తారు, ప్రేక్షకులు. కాని ఎద్దు ఓపికకి, ఒగ్గుకి చిహ్నంకదా?

ఆనాటి సాంస్కృతిక ప్రదర్శనల్లో, మూడు ప్రధానమైన అంశాలు: 'అల్లిముత్తా' 'భారతి', రిక్షావాలా ప్రదర్శనలు. 'రిక్షావాలా' నాటికనుగురించి చెప్పాలంటే—ఒక్కటెండి! ఆనాటికకు ఆంధ్రనాటక కళా పరిషత్తు ఒకనాడు బహుమానం ఇచ్చింది! ఏమన్నా అంటే పాపం వస్తుంది. పాపం వస్తుందని కూడా భయం లేకుంటే అనేవాణ్ణి: "కన్నీళ్ళపై ఆధారపడి, ట్రాజెడీలనుకుని మెలోడ్రామాలను సృష్టించిన నాటకీయుల ప్రదర్శన అది" అని. "సహజంగా సంభాషణ లెలా ఉంటాయో తెలియక, యతిమీద ప్రాసమీద, అనుప్రాసమీద, రసాభాసమీద ఆధారపడి రచించిన నాటకం అది" అని ఇంకా, ఇంకా.

ఈ 'రిక్షావాలా' నాటిక ఎన్నో [illegible] ప్రదర్శనలు పొందబడ్డాయి. రచయిత ఏకపాత్రాభినయంలా ఉంటుంది. ఈ నాటిక, కాని నటీనటులు తమ పాత్రలను ఉచితంగా నటించారు. ముఖ్యంగా రిక్షావాలా పాత్రధారి శ్రీ బెనర్జీని పేర్కొనాలి. ఈ వాక్యాలు 'అల్లిముత్తా' విషయంలో రాయలేనందుకు విచారిస్తున్నాను. భారతి నాటిక కాదు. దాన్ని నాటికగా పరిగణించి విమర్శించడం అన్యాయం.

ఈ సంస్థ కార్యకర్తల్లో మితిలేని ఉత్సాహం కనుపిస్తోంది. ఈ ఉత్సాహం ఈ ప్రదర్శనల్లో వెల్లివిరిసింది. ఈ ఉత్సాహానికి తగిన అనుభవం కొందరు కార్యకర్తల్లో ద్యోతకమౌతుంది. అనుభవజ్ఞులు శ్రీ ధర్మారావును అధ్యక్షులుగా ఎన్నుకోడంలో వివేకం గోచరమౌతుంది. ఈ సంస్థకు 'సచిత్ర వారపత్రిక' శుభాకాంక్షలు.

## అమెరికానుంచి అతిథులు

ఈ వారంలో అమెరికన్ వాణిజ్య ప్రముఖులు కొందరు దక్షిణ భారతదేశ పర్యటనలో భాగంగా హైదరాబాదు వచ్చారు. రిట్జ్ హోటల్లో ఆంధ్రప్రదేశ్ వాణిజ్య పరిశ్రమల సమాఖ్య ప్రతినిధుల్తో సమాలోచనల్లో పాల్గొన్నారు.

ఆగస్టు 14 వ తేదీ సాయంత్రం రిట్జ్ హోటల్లో సమాఖ్య ఈ ప్రముఖుల గౌర

మార్గం తేనీటి విందు ఏర్పాటుచేసింది. ఆ రోజునే ఫోరమ్ ఆఫ్ ఫ్రీ ఎంటర్ ప్రైజ్ అధ్యక్షులు శ్రీ ఏ. డి. ష్రాఫ్ కూడా ఈ సమావేశాలకు వచ్చారు. ఈ తేనీటి విందులోనే వారిని కూడా ప్రధాన అతిథిగా పేర్కొంది సమాఖ్య.

* * *

శ్రీ ష్రాఫ్ స్వచ్ఛమైన ఇంగ్లీషులో నలభై నిమిషాలు దాదాపు ప్రసంగించారు. ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలతో మనం అంగీకరించక పోవచ్చు. కాని ఆ అభిప్రాయాల వ్యక్తీకరణలో సొగసు ఉంది. కొన్ని వారాల క్రితం శ్రీ చింతామణీ దేశ్ ముఖ్ ఉపన్యాసాన్ని - ఉపన్యాస సారాంశాన్ని 'రాజధాని కబుర్లు' లో అందిచ్చాను. ఈ వారం క్లుప్తంగా శ్రీ ష్రాఫ్ ఉపన్యాస భాగాలను ఇస్తాను.

అన్నారు శ్రీ ష్రాఫ్ ఈ విధంగా : ప్రభుత్వ విధానాల పరిణామా లేవిధంగా ఉంటాయో గమనించకుండా, విధానాలను నిర్ణయించుకొంటోంది నెహ్రూ ప్రభుత్వం. ప్రభుత్వం విజాతీయమైె ఎట్టి సహకారం లభించని కాలంలో పారిశ్రామికులు కృషి చేసి పరిశ్రమలు స్థాపించారు. ఆ రోజుల్లో ప్రభుత్వం కలుగజేసుకుంటే బాగున్ననిపించింది. కాని ప్రభుత్వం ఇప్పుడు వ్యక్తి స్వామ్య రంగంలో ఎంత కలగజేసుకుంటూం దంటే—జోక్యం లేకుంటేనే బాగుంటుం దనిపిస్తోంది. పన్నులు నూటికి నూరు పాళ్లుంటున్నాయి. ఒకప్పుడు ఇంకా ఎక్కువుంటున్నాయి. ప్రభుత్వం విధించే నియమాలు, నిబంధనలు దేశంలో జీవితాన్ని అరలు అరలుగా విభజింపజేసే ప్రమాదం ఏర్పడుతోంది.

కాని నెహ్రూ ప్రభుత్వాన్ని విమర్శించడం వల్ల ప్రయోజనం లేదు. వారేవో ఆదర్శాలు పట్టుకు వేలాడుతున్నారు. వారి స్వార్థరహితస్ఫూర్తిని మనం శంకించలేం. కాని అధికారుల సంఖ్య విపరీతంగా పెరిగిపోతూంది. ఛోటా రాజకీయ నాయకులు ఉత్పన్నమౌతున్నారు. ప్రజాస్వామ్యం, వ్యక్తిస్వామ్య రంగంలో స్వాతంత్ర్యం— ఈ రెంటిలో ఒకటుంటేనే రెండోది వుంటుంది. డబ్బున్నవారిని పేదవారిని చేయడం వల్ల పేదవారు ధనవంతులౌతారనే అభిప్రాయం ప్రభుత్వ విధానాలు చేస్తున్న వైరీతలలకు నిదర్శనం.

రిజర్వు బేంకు అధీనంలో విపరీతమైన అధికారాలు చలాయించబడ్డాయి. లాభం కోసం వ్యాపారం చేయడం నీతిసూత్రాలకు విరుద్ధమనే అభిప్రాయం ఒకటి ప్రచారంలోనికి కొనిరాబడింది. కాని ప్రభుత్వ వ్యవస్థ ఒకటి ఈ మధ్య రక్షణ కోట్ల రూపాయలు లాభం గడించిందని సంతోషంగా ప్రకటించారు ఒకరు. వారి అభిప్రాయమేమిటో వారికే తెలియని స్థితిలో ఉన్నారు.

ప్రభుత్వం వ్యాపారంలోకి దిగడం చాల ప్రమాదకరమైన పరిణామాలకు దారితీస్తుంది. లక్షలాది చిన్న వ్యాపారస్థులు రేపు తమ జీవనభృతికై ప్రభుత్వ వ్యవస్థలపై ఆధారపడాలన్నమాట. ఈ విధంగా లక్షలకొలది ఓటర్లను తన చేతుల్లో పెట్టుకొంటోంది ప్రభుత్వం. కాని ఈ పరిస్థితి ఐదారు సంవత్సరాలకంటె ఎక్కువుండదని మీకు హామీ ఇస్తున్నాను.

* * *

శ్రీ ష్రాఫ్ ఉపన్యాసంలో మధ్యమధ్య స్వతంత్రపక్షం నిర్మాణానికి ప్రస్తావనలున్నాయి. అది బహుశః సహజమే! శ్రీ ష్రాఫ్‌కి భారత పౌరుడుగా ప్రభుత్వ విధానాలను నిశిత విమర్శకు గురిచేయడానికి హక్కు ఉంది: ఇది కాదనలేము. కాని ఈ విమర్శ విదేశీ పౌరులముందు - ముఖ్యంగా వాణిజ్య ప్రముఖులముందు చేయడంలో ఔచిత్యం కనపడదు. మనదేశంలో పన్నుల భారాన్ని గురించి ఇతర దేశాల్లోగల అపోహలను తొలగించడానికి రాయబారులు ఒకపక్క యత్నిస్తూంటే, పరస్పర వాణిజ్య సంబంధాలకోసం వచ్చిన విదేశీయులముందు మనవారు ఇటి ఉపన్యాసాలు చేయడం సమంజసం కాదేమో!

* * *

ఆగస్టు పదిహేనవ తేదీ ఉదయం ఈ వాణిజ్య ప్రముఖుల సంహోదారు శ్రీ రాయిడన్ జి డెరిక్, మెస్సర్స్ బి. శంకర లాల్ అండ్ కంపెనీ వారి కొత్త షోరూమ్ దర్శించారు. ఈ సందర్భంలో శంకర్‌లాల్ సంస్థ చిన్న తేనీటివిందు ఏర్పరిచారు. ఈ సంస్థ సనత్ నగర్ పారిశ్రామిక ఎస్టేట్‌లో చిన్నతరహా పారిశ్రామిక సంస్థగా ప్రారంభించబడింది. అనుపత్రి సామానులతో బాటు, రోజుకి నూరుకుర్చీల చొ॥న తయారుచేస్తూంది. రోజుకి రెండువందల కుర్చీలవరకు తయారు చేయాలని ఆశయమట.



గతవారం "శ్రీ. కృ. జ. స్థా"కథలో
షోకేలా వహీదా

భారతదేశంలో కార్మిక వేతనాలు తక్కువని, వ్యర్థం కాకుండా ఉపయోగించుకుంటే ఇటువంటి వ్యాపారస్థులు అనతి కాలంలోనే అమెరికావంటి దేశాలకు ఎగుమతి చేయగల్గుతారని శ్రీ డెరిక్ అన్నారు.

శ్రీ బి. శంకర లాల్ గుప్త, సేల్స్ మేనేజర్ శ్రీ వల్లభజోస్యుల సూర్యనారాయణ శాస్త్రి, తదితరులు అతిథికి షోరూమ్‌లో ఉన్న వస్తువులను చూపి, అవి తయారుచేసే విధానం వివరించారు.

## 'వేదికల గారగంప'

**'రద్దీరహదార్లు':** కింగ్ కోఠిరోడ్డు అబిడ్ రోడ్డుతో కలిసేచోట ట్రాఫిక్ దీపాలు వెలిశాయి. మంచిదే! కాని రాకపోకల రద్దీ ఆ జంక్షన్‌లోకంటె అక్కడినుంచి ఆజాద్ కార్నర్ వరకూ ఉంటుంది. ఆ రోడ్డుపై పదేసిగజాలకొక పోలీస్ జవాన్ నిలబడి నిద్రపోతూంటాడు. తిలక్ రోడ్డు మెయిన్‌రోడ్‌తో కలిసే చోట ఈ రద్దీ ప్రమాదాలకు దారితీసేటట్టు ఉంటుంది. గన్‌ఫౌండ్రీ దిశనుంచి వచ్చేవాహనాలను చేరుతి ఆపే జవానుకు-అబిడ్సునుంచివచ్చి తిలక్ రోడ్డుకు పోయేవాహనాలు, తిలక్‌రోడ్డుపైనుంచి వచ్చి గన్‌ఫౌండ్రీ దిశ పోయే వాహనాలు రెండూ ఒకదానిలో ఒకటి చొచ్చుకుపోయే ప్రమాదాన్ని గుర్తించడంలేదు. ఇక్కడ ఇంతవరకూ రోడ్డు ప్రమాదాలు జరగనందుకు మాకు ఉమ్మడిగా దేవుడికి కొబ్బరికాయల కొట్టించే ఏర్పాట్లు చేయించాలి.

**'కుంభకర్ణుడి పునర్జన్మ':** ట్రూప్ బజార్ నుంచి హనుమాన్ టెక్డీ దిశ పోయే రోడ్డంతా గోతులుగా త్రవ్వి వేయబడింది. ఆ సందు బాగుచేస్తున్నందుకు సంతోషం. కాని అటూ ఇటూ 'రోడ్ క్లోజ్' వంటి బోర్డులు తగిలించడం న్యాయం. ఎర్రజెండాల వంటివి తగిలించడం సమంజసం. ఇదే విధంగా, సుల్తాన్ బజార్ (కందస్వామి మార్కెట్) ప్రాంతం నుంచి బడీచావడి వద్దకు పోయే రోడ్డుపై కూడా. పొరపాటున ఆ దారిన పోయే కార్లకు వెనుతిరగడానికి కూడా చోటులేదు. నెలలకొద్దీ రోడ్లు బాగుచేసే నగరపాలక సంఘం ఈ మాత్రమైనా చేయక పోతే ఎలా ?

(48 వ పేజి చూడండి)

# [illegible]

స్టేషన్‌నుంచి బస్టాండ్ వద్దకు చేరేటప్పటికి బస్సు అసలు రాలేదని తెలిసింది. సుబ్రహ్మణ్యం ఈ మాత్రానికేనా ఇంత తొందరపడి వచ్చినదని విసుక్కుంటూ ఒక చిన్న కిళ్ళీకొట్టుదగ్గరకు వెళ్ళాడు. నేను కూడా అతన్ని అనుసరించాను. మేమిద్దరమూ అతని ఊరికి వెళుతున్నాము. ఇద్దరం టి. ఎస్. సి. పరీక్షలు వ్రాసి ఫలితాలకోసం ఎదురు చూస్తున్నాం. ఆ ఊరికి వెళ్ళటం నాకదే మొదటిసారి అతనుకూడా కొన్ని సంవత్సరాలుగా వెళ్ళటం మానివేశాడు, వాళ్ళవాళ్ళంతా ఇక్కడికి వచ్చేయటంవల్ల. ఆ ఊరు వెళ్ళాలంటే ముందు రైలులో కొంత దూరం వెళ్ళి, అక్కడినుంచి బస్సులో ప్రయాణం చెయ్యాలి. [కొన్ని కారణాలవల్ల ఊరిపేరు ఇక్కడ చెప్పటానికి వీలులేదు.]

కిళ్ళీ షాపువాడిని రెండు పొడాలు కట్టమని చెప్పాడు సుబ్రహ్మణ్యం. అతను సుబ్రహ్మణ్యంవైపు శ్రద్ధగా చూసి,

"నన్ను మర్చిపోయినట్లున్నారే, సుబ్రహ్మణ్యంగారూ!" అన్నాడు

ఇతను కొంచెం తికమకపడినతర్వాత గుర్తుపట్టాడు.

"నువ్వా, రామలింగం! ఎవరో అనుకున్నాను! ఎప్పటినుంచి? రామనాథంగారి దగ్గర మానేశావా? ఏమిటి?" అని గబగబ అడిగాడు. రామలింగం పొడా కట్టి అందిస్తూ.

"రెండు సంవత్సరాలయిందండీ" అన్నాడు. పోడా పొంత తగ్గేవరకూ ఆగాడు.

"అసలు రావడమే మానేశారేమండీ సుబ్రహ్మణ్యంగారూ?" అని రామలింగం అడిగాడు.

"అవునయ్యా! మా వాళ్ళంతా ఇక్కడికి వచ్చేశారుగా! మరి నువ్వు ఇక్కడే ఉంటున్నావా?" అన్నాడు సుబ్రహ్మణ్యం. వీరిద్దరి సంభాషణ నాకు కొంచెం విసుగు పుట్టించింది. ప్రక్కకి జరిగి బస్‌స్టాండ్ వైపు చూస్తూ నుంచున్నాను. రామలింగం సెలవలో సుబ్రహ్మణ్యాన్ని అడిగి తెలుసుకుంటున్నాడు. ఒక చిన్న హోటల్ లో నుంచి కొంచెం అల్లరి బయలుదేరింది. ఇంతలో గట్టిగా అరుస్తూ ఇద్దరు బయటికి వచ్చారు. వారిలో ఒకతను హోటల్ లో పనిచేసేమనిషి అని తెలుస్తోంది. రెండో వ్యక్తి లావుగా, ఖాకీనిక్కరుతో, గుండీలేని వగల్ పొట్టిగా చేయించిన చొక్కాతో రౌడీ అనిపిస్తున్నాడు. కళ్ళుకూడా ఎర్రగా ఉన్నాయేమోనని నాకు అనిపించింది.

"పోవయ్యా! అర్ధణేగా తక్కువయింది! మళ్ళీ పారేస్తాలే!" అని కసురుకుంటున్నాడు. జనం చుట్టూ పోగయ్యారు.

"మా[illegible] సుబ్రహ్మణ్యంగారూ! వాడెవడో తెలుసా? సుబ్బయ్య!" అని

ఎ. పుల్లయ్య

రామలింగం అనటం విన్నాను

"ఏమిటి? సుబ్బయ్యా? అతనేదో బస్ సర్వీస్ నడుపుతున్నాడని విన్నానే!" అని సుబ్రహ్మణ్యం ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎన్నాళ్లోలేండి!" అని రామలింగం ఏదో చెప్పబోతూ, సిగరెట్లకోసం వచ్చిన వారి కెవరికో సిగరెట్లు అందించాడు. అంతా తాగి చెడగొట్టుకాడండి. ఇప్పుడు డ్రైవింగ్ లైసెన్సుకూడా క్యాన్సిల్ చేశారు."

"ఏమిటోయ్ సుబ్రహ్మణ్యం!" అని నేను అడిగాను.

"సుబ్బయ్య, బాగా డ్రైవర్‌గా చేరి చివరికి బస్సర్వీస్‌కూడా నడిపాడు. మా ఊరే. లైసెన్స్ ఎందుకు క్యాన్సిల్ చేశారయ్యా రామలింగం?"

"చివరికి తాగుడెక్కువయిపోయి ఊరికే ఏక్సిడెంట్స్ చేయటం మొదలు పెట్టాడు. ఇక్కడి ఇన్‌స్పెక్టర్ గారు కేసు పెట్టించి లైసెన్స్ క్యాన్సిల్ చేశారండీ. అయినా దంపేస్తానని సుబ్బయ్య కొన్ని రోజులు గల్లంతుకూడా చేశాడండీ."

సుబ్బయ్య పోట్లాట ఇంకా ఎక్కువయినట్లుంది. జనం బాగా మూగిపోయారు. అరుపులు, దుంపలింపులు, తిట్లు వినిపిస్తున్నాయి. మేముకూడా అటువెళ్ళాం. సుబ్బయ్యను చూస్తే అక్కడివారికి కొంచెం భయమేమో ననిపించింది. హఠాత్తుగా జనం గోల తగ్గిపోయింది. ఒక సబ్-ఇన్‌స్పెక్టరూ, కానిస్టేబిలూ జనాన్ని అదిలిస్తూ లోపలికి తోసుకొని వస్తున్నారు.

"ఏమిట్రా గొడవ?" అని గట్టిగా అరిచాడు సబ్-ఇన్‌స్పెక్టర్. అతనుకూడా లావుగా, బలంగా ఉన్నాడు. ఖాకీనిక్కర్ ఇస్త్రీ ముడత అట్లాగ నుంచునివుంది. సుబ్బయ్యను జబ్బపుచ్చుకుని మళ్ళీ అడిగాడు. సుబ్బయ్య




ఇంతలో గట్టిగా అరుస్తూ ఇద్దరు బయటికి వచ్చారు.

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## కథా రచయితలకు మహదవకాశం

ఆంధ్ర సచిత్ర వారపత్రిక **1-11-59** తేదీకి దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సంచికకు ముఖ్యాకర్షణగా కథలపోటీ నిర్వహిస్తున్నాము.

## మొదటి బహుమతి రూ. 75/-

పోటీ నిబంధనలు:

1. పోటీకి ప్రవేశ రుసుము లేదు. ఎవరైనా పాల్గొనవచ్చును.
2. కథలు వారపత్రికలో 5 పేజీలకు మించరాదు.
3. రచనలు స్వతంత్రమైనవై ఉండాలి. ఏవిషయం మీదనైనా కథ వ్రాయవచ్చును.
4. 3-10-59 తరవాతవచ్చేకథలను పోటీకి స్వీకరించము.
5. నిరాకరించిన కథలు తిప్పి పంపగోరువారు తగిన స్టాంపులు కథతోపాటె పంపాలి.
6. కథలు కాగితానికి ఒకవైపునే వ్రాసి పంపాలి.
7. పోటీలో నెగ్గని కథ లేవైనా ప్రచురణార్హమని తోస్తే మామూలు సంచికలలో ప్రచురిస్తూ ఉంటాము.

## అక్టోబరు 3లోగా కథలు మాకు చేరాలి.


తిరగబడతాడేమో ననుకున్నాను కాని బిడిలించుకుని మాత్రం అవతలికి వెళ్ళిపోయాడు. సబ్-ఇన్స్పెక్టర్ హోటల్ వాడికి ఏదో నచ్చచెప్తున్నాడు.

"ఆయనేనండి ఇన్స్పెక్టర్ ప్రసాద్ గారు" (రామలింగం చెప్పిన పేరు ఇది కాదు; ఇక్కడ మార్చివేశాను) అని మావెంటనే వచ్చిన రామలింగం మెల్లిగా చెప్పాడు.

"సుబ్బయ్యా! లాకప్ లో పెట్టిస్తా జాగ్రత్త! పోనీ అనుకుంటే...!" సబ్ ఇన్స్పెక్టర్ అరిచాడు. కానిస్టేబిల్ జనాన్ని మందలిస్తూ ఉండగా బస్సు పెద్దచప్పుడుతో వచ్చింది. రామలింగం మాతోబాటువచ్చి సామాను ఎక్కించడానికి సాయపడ్డాడు.

"కొట్టు చూసుకోవయ్యా" అంటేకూడా వినలేదు. సుబ్రహ్మణ్యం టిక్కెట్లుకొంటూ ఉంటె నేను రామలింగానికి సోడా డబ్బులిచ్చాను. సుబ్బయ్యగొడవ బాగా తగ్గిపోయింది. పోలీసువారిద్దరూ బస్ వైపే వస్తున్నారు.

"చాలా 'స్ట్రిక్ట్' అండీ ప్రసాద్ గారు. ఈ చుట్టుపక్కల ఆయనంటే హడల్ అందరికీ—ఈయనే లేకపోతే సుబ్బయ్య ఏం చేసేవాడో" అన్నాడు రామలింగం తొందరగా. సుబ్రహ్మణ్యం కూడా వచ్చాక మేము ముగ్గురం రామలింగం కొట్టువైపుకు వెళ్లాము.

"ఇప్పుడేం చేస్తున్నాడోయ్ అతను రామలింగం?" సుబ్రహ్మణ్యం అడిగాడు. సుబ్బయ్య భార్య మేము వెళ్ళే ఊరుదగ్గర తనలాగే చిన్న కిళ్ళీదుకాణాన్ని నడుపుతున్నదని రామలింగం చెప్పాడు.

కొంతసేపయినతర్వాత రామలింగంతో చెప్పి మేమిద్దరం బస్సు ఎక్కడానికని వెళ్ళాము. సుబ్బయ్య త్వరత్వరగా మావైపు వచ్చి సుబ్రహ్మణ్యానికి నమస్కారం చేశాడు. "జ్ఞాపకముందండీ?" అని బొంగురు గొంతుకతో సుబ్రహ్మణ్యాన్ని పలకరించాడు. సుబ్రహ్మణ్యం కొంచెం ఖంగారుపడ్డా చిరునవ్వు తెచ్చుకుని "క్షేమం" అన్నాడు.

"మన ఊరికేనా?" అని సుబ్బయ్య అడిగాడు.

"అవును."

"నాక్కూడా ఒక టికెట్ కొనివ్వండయ్యా! మన ఊరికతల దిగిపోతాను"

ఒకక్షణం అనుమానించి "సరే"నన్నాడు సుబ్రహ్మణ్యం. సుబ్బయ్య నావైపోకసారి చూసి డ్రైవర్ సీటుదగ్గరకు చరచర నడిచి వెళ్లాడు: సబ్ ఇన్స్పెక్టర్ మావైపు రావటం వల్ల నేనని గ్రహించాను. కాని ప్రసాద్ కండక్టర్ తో తను కూడా వస్తున్నట్లు చెప్పి టిక్కెట్ కొనబోతున్నాడు. కండక్టర్ వద్దన్నా వినకుండా, టికెట్ డబ్బు ఇచ్చాడు

# ★ పాత బస్సు ★

"మన సీటు ముందర. రారా!" సుబ్రహ్మణ్యం పిలిచాడు. కాని మేము వెళ్ళేటప్పటికి సుబ్బయ్యా సీట్‌లో ఉన్నాడు.

సుబ్బయ్యా జంకుతూ, "సుబ్రహ్మణ్యం గారూ! బస్‌లో ప్రసాద్ గారొస్తున్నారు. నేనిక్కడే కూర్చుంటానండీ," అన్నాడు. నాకూడా లోపలే కూర్చుందామనిపించి సుబ్రహ్మణ్యంతో చెప్పాను. ఏమనుకున్నాడో సుబ్రహ్మణ్యం వెంటనే ఒప్పుకున్నాడు. సుబ్బయ్యా నావైపు చూసి చిరునవ్వు నవ్వాడు. డ్రైవర్ సీటుకి ఆనుకుని ఉన్నదానికి ఎదురుగా ఉండే సీటులో నేనూ సుబ్రహ్మణ్యం కూర్చున్నాము. మాకు ఎదురుగా ఉన్న సీట్‌లో చివరగా, కిటికీదగ్గర సబ్ ఇన్‌స్పెక్టర్ ప్రసాద్ కూర్చుని ఒక పక్క పొట్లాన్ని జాగ్రత్తగా విప్పుతున్నాడు. బయట కానిస్టేబిల్ నుంచుని ఉన్నాడు.

బస్ నిండగానే కండక్టర్ ఈలవేశాడు. పాతబస్సు కాబట్టి వెంటనే స్టార్ట్ అవలేదు. సుబ్రహ్మణ్యం పక్కన ఒక ముసలాయన కూర్చుని ఉన్నాడు.

"ఘాట్ సెక్షన్ అన్నావు, ఈ బస్సు కొండలమీద వెళ్తేట్లుందంటావా?" అని సుబ్రహ్మణ్యాన్ని అడిగాను.

"ఈ 'రూట్' లో ఇంకా కొన్ని పాతబస్సులే నడుస్తున్నాయి. అయినా ఇరవై ముప్ఫైమైళ్ళు తప్ప రోడ్డు పెద్ద ఘాట్‌సెక్షన్‌లో లేదులే" సుబ్రహ్మణ్యం బస్సుమోతపైన వినబడేందుకు కొంచెం గట్టిగా చెప్పాడు.

రెండుమూడు చోట్ల ఆగిన తర్వాత ఘాట్ సెక్షన్‌లోకి వచ్చాము; డ్రైవర్ గియర్ మార్చడంచేత అసలే ఎక్కువగా ఉన్న ఇంజన్ శబ్దం మరింత పైస్థాయిలోకి వెళ్ళింది. బస్సు కుదుపుమీద సుబ్రహ్మణ్యం విసుక్కున్నాడు. నేను 'ఊ' కొడుతూ కిటికీలోనుంచి క్రమంగా దూరమైపోతున్న బయలుప్రదేశాన్ని, లోయలను చూస్తూ ఉన్నాను. ఆ రోడ్డులో అట్టే వంపులు లేవు. బస్‌లోవాళ్ళంతా ఏవేవో మాట్లాడుకుంటున్నారు. సబ్ ఇన్‌స్పెక్టర్ గారు కునుకు తీయడం చూసి నాకూడా నిద్రవచ్చింది.

ముందుకు పడినట్టయి మెలకువవచ్చింది.

"ఇక రోడ్ కిందకి దిగుతుంది. మళ్ళీ అవతల కొండమీదకి వెళ్ళినతర్వాత పైకి వెళ్తుంది. చూడు" అని సుబ్రహ్మణ్యం చూపిస్తున్నాడు. "వాటి రెండింటిమధ్యా చిన్న బ్రిడ్జి ఉంది. అక్కడ్నుంచి మంచి 'వ్యూ' చూడొచ్చు."

కొందరు ప్రయాణీకులు మేమున్న ఎత్తును గురించీ, క్రింది లోయలనుగురించీ మాట్లాడుకుంటున్నారు. రోడ్డుకు ఒకవైపు చెక్కి వేయబడిన కొండచరియ, మరొకవైపు అగాథం; బస్సు వేగం చాలా ఎక్కువగా ఉన్నదేమోనని అనిపించింది నాకు. సబ్ ఇన్‌స్పెక్టర్ గారుకూడా వెనక్కి తిరిగి డ్రైవర్‌తో వేగం తగ్గించమని చెప్పారు. అతను తల ఊపాడుకాని వేగం తగ్గలేదు. కొంచెం ఎక్కువ అయినట్లుకూడా ఉన్నది. కొంచెం ఖంగారుగా డ్రైవర్ వైపు చూస్తున్నారు ప్రసాద్ గారు. నేను ముందుకు వంగిచూశాను. డ్రైవర్ ఊరికే నొక్కుతున్నాడుగాని "బ్రేక్" పడటంలేదు! బస్ వేగం మరింత ఎక్కువఅయింది.

"హాండ్ బ్రేక్ వెయ్యవయ్యా" అని ప్రసాద్ గారు గట్టిగా చెప్పారు.

"అదికూడా పనిచెయ్యడం లేదండీ" సుబ్బయ్య జవాబిచ్చాడు. ప్రయాణీకులలో కొంచెం అస్థిమితం ఏర్పడింది. ఏమిటని కొందరు అడిగారు. కొందరు గోలచెయ్యడం మొదలుపెట్టారు. డ్రైవర్ ముందు అద్దంలోనుంచి రోడ్డు మావైపు రావడంచూస్తే నాకుకూడా భయంవేసింది. 'స్పీడ్' నలభై దాటిపోయింది

"సెకండ్ గియర్‌లోకి మార్చవయ్యా" అని సుబ్బయ్య అరవటం నాకు వినబడింది! గియర్ కడ్డీని గట్టిగా లాగాడు డ్రైవర్. అది ఊడిపోయి చేతిలోకి వచ్చింది! సుబ్బయ్య దాన్ని లాక్కుని బయటికి విసరివేశాడు. డ్రైవర్ భయపడినా రోడ్డువంపుల నెలాగో తిప్పివేస్తున్నాడు. ప్రతి వంపుదగ్గరా టైర్లు పెద్ద చప్పుడు చేయటం, బస్సులో మేమందరం సీట్లమీద నుంచి జారిపడిపోయినంతపని జరగడం—పడిపోకుండా పట్టుకుని కూర్చున్నాం.

సబ్ ఇన్‌స్పెక్టర్ డ్రైవర్‌తో ఏదో

కొట్టి ఆపమని చెప్పాడని తర్వాత తెలిసింది. కాని డ్రైవర్ వినేస్థితిలో లేదు. అదికాక ఆ వేగంలో చరియకు గుద్దిసే ఎదురుగానున్న లోయలోకి దొర్లిపోయే వాళ్ళమేమో. ఇంజన్‌మోతతో ప్రయాణీకుల గోలకూడా కలిసిపోయింది.

"సుబ్బయ్యా!" అని ప్రసాద్ పిలవడం మాత్రం వినిపించింది. అతనితో ఏమి చెప్పాడో తెలియలేదు. సుబ్బయ్య విన్న తర్వాత, కాదన్నట్లు తల అడ్డంగా ఆడించాడు, భయంగా, ఆశ్చర్యంగా. ప్రసాద్ ముఖం కందిపోయింది. ఇంకా అరవడం మొదలుపెట్టాడు. సుబ్బయ్య సరేనన్నట్లు తలను ఆడించి డ్రైవర్ చెవిలో ఏదో అరిచాడు. ఇతనిలాగా మొదట కాదన్నా తర్వాత ఒప్పుకున్నట్లు కనిపెట్టాను. తలుపు తీసి ఫుట్ బోర్డు మీదకు దిగనుంచున్నాడు. అతను దిగుతూ ఉండగానే సుబ్బయ్య స్టీరింగ్ తీసుకున్నాడు.

కొందరు ప్రయాణీకులు బయటికి దూకుతామని ఏడ్వడం మొదలుపెట్టారు. కండక్టర్ వారిని కష్టంతో వారిస్తున్నాడు. మాపక్క సీటులో ఆయన, "ఆ సుబ్బయ్య కిచ్చారేమిటి" అని అరవడం, మరి కొందరు అదే విధంగా అడగడం జరిగింది.

"ఎవరన్నా మాట్లాడితే చంపేస్తాను!" అని సబ్ ఇన్‌స్పెక్టరుగారు గర్జించారు. "ఏ.....న్నా కదిత్తే తల పగలగొట్టాను! ...స్తాను, జాగ్రత్త!" ఆయన ముఖం కందిపోయింది. ఈ అరుపుతో వాళ్ళ గొడవ బాగా తగ్గిపోయింది.

"ఈ బస్సు మామూలుగా ఆగదు. అవతలి కొండకీ..." అంటూ ఉంటే బస్సు టైర్లు మోతతో తిరిగి ఆయన క్రిందపడిపోయినంత పని అయింది. "...అవతలకొండకీ మనకొండకీ మధ్య 'బ్రిడ్జ్' ని దాటగలిగితే రోడ్డు పైకి వెళ్తుంది కాబట్టి అదే ఆగిపోతుంది," అని ఎలాగో అరిచాడు. నేనూ సుబ్రహ్మణ్యం ఒకళ్ళముఖాన్ని ఒకళ్లం చూసుకున్నాం. సుబ్రహ్మణ్యం ఏదో చెప్పాడుగాని, గాలి హోరులో, ఇంజన్ మోతలో నాకు వినపడలేదు.

ప్రతి మలుపుదగ్గరా బస్సు విరిగిపోయేటంత కుదుపు కలుగుతూనే ఉన్నది. వంతెన దూరంగా తెల్లగా కనిపించింది. ఇంకొక మైలుదూరం ఉండి వుండవచ్చు. అప్పుడే అస్పష్టంగా మరొక బస్ హారన్ వినబడింది. ప్రసాద్ కూడా అదిరిపోయి అవతలి కొండ వైపు చూశాడు. రోడ్డు వంతెన దాటగానే కొంచెం దూరం వెళ్లి తర్వాత కొండనుచుట్టి అవతలవైపు అదృశ్యమైపోయింది. మళ్ళీ హారన్ వినబడింది. మాకందరికీ అదే ఆలోచన కలిగింది. 'మాకంటే అవతలి కొండ

(55-వ పేజీ చూడండి)

మన్నికగల
అశోకా/వివేక్
కలములనే
వాడండి.
అశోకా,
పెన్ వర్క్సు
తెనాలి



# న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# తలోరీతిగా ప్రజాస్వామ్యానికి భాష్యం

ప్రజాస్వామ్యం!

ఈ వారం కూడా 'ప్రజాస్వామ్యం' ప్రదర్శనశాలలో ప్రత్యేక వస్తువులాగా ప్రకాశిస్తున్నది. ప్రజాదృష్టిపథంలో ప్రవాశిసున్నది.

ముఖ్యంగా భారతప్రధాని దృష్టిలో అది ఒక రాజకీయ 'మతం,' అంటే అనేక విశ్వాస పాత్రమైన వ్యవస్థ. ఇంతెందుకు? ప్రధాని మాటలే చూడండి.

"ప్రజాస్వామ్యం కేవలం రాజకీయ, ఆర్థిక విషయాలకు సంబంధించినదే కాదు. మానసికమైనదికూడా. రాజకీయ ఆర్థిక రంగాలలో అందరికీ సమానావకాశాలు కల్పించడం దాని లక్ష్యం వ్యక్తి స్వేచ్ఛను కాపాడి, వైయక్తిక శక్తి సామర్థ్యాలు అభివృద్ధి కావడానికి ప్రజాస్వామ్యం దోహదం చేస్తుంది. స్వకీయులనేగాక పరకీయులను, తనతో భేదించే పరభావధోరణులను సహించి సానుభూతి చూపడం దానికి సహజం, సత్యాన్వేషణా నిరతి ప్రజాస్వామ్య సిద్ధాంతంలో ఉన్నది. మన రాజకీయ ఆర్థిక సమస్యలను ప్రజాస్వామ్యంలో ఒక మానసిక భావధోరణిలో అర్థం చేసుకుని తీర్చుకోవచ్చును."

ఇక కమ్యూనిస్టులు. వీరి దృష్టిలో ప్రజాస్వామ్యం ఒక రాజకీయ విధానం. మన దేశంలో బలప్రయోగంతో అధికారం హస్తగతం చేసుకోవడం అసాధ్యమని గ్రహించారు వీరు. ఇటీవల అమృతసర్‌లో జరిగిన మహాసభలో కమ్యూనిస్టులు కొత్త కార్యక్రమం ఒకటి రూపొందించుకున్నారుకూడా. ప్రజాస్వామ్య పద్ధతులద్వారా అధికారపీఠంపై తిష్ఠవేయడానికి తగిన విధానాలు వీరి నూతన కార్యక్రమావళిలో సిద్ధపరచారు. ప్రణాళికాబద్ధమైన పాలనా వ్యవహారమంటూ వారికి తెలీనేలేదు. చట్టసంబంధమైన పరిపాలనగానీ, సర్వవ్యక్తి సమానత్వంగానీ వారికి 'కొరకబడని కొతికబియ్యమే!' వారి 'ప్రజాస్వామ్యా'నికి అర్థం వేరు. అది కమ్యూనిస్టుల 'కొరకు, యొక్క, చేత' ప్రభుత్వం. మొన్న లోక్‌సభలో ప్రధాని చాలా సముచితంగా పేర్కొన్నట్లు 'తండ్రిని చంపిన కొడుకు అనాథశిశువునని ప్రభుత్వ రక్షణ కోరడమే' వీరి ప్రజాస్వామ్యం! కేరళ విషయం ప్రస్తావిస్తూ ప్రధాని పై విధంగా అభివర్ణించారు.

'మనుషులు పోయినా మాటలు మిగులుతాయంటారు. ఒక్కొకరు చేసిన దుష్కృత్యాలు వారు పోయిన తర్వాతకూడా అలా నిలచిపోతాయి. కేరళ సక్రమ పురోగతికి కమ్యూనిస్టుపాలనవల్ల వాటిల్లిన నష్టం ఇంతటితో తీరేది కాదు. ఏళ్ళూ పూళ్ళూ కాకపోయినా కనీసం కొన్ని నెలలయినా పడుతుంది ఈ నష్టం తీరడానికి. కేరళలో కమ్యూనిస్టుపాలన చూసిఅయినా ఇప్పటికయినా మనదేశంలోని ఇతర ప్రాంతాలు మేల్కొంటాయా అనేది పెద్ద ప్రశ్న! రైల్వే, తంతి తపాలాశాఖ, బ్యాంకులు మొదలయిన ముఖ్య సంస్థలలో దినదినం పెరిగిపోతున్న కమ్యూనిస్టు పలుకుబడిని తగ్గించడానికి ఈ గుణపాఠం ఉపయుక్తం కాగలదా?

ప్రజాస్వామ్యపద్ధతులలో ప్రమాణాలు చేసి అధికారపీఠం అధిష్ఠిస్తున్న కాంగ్రెస్ వారు మాత్రం ఏంచేస్తున్నారు? శిష్టమైన ప్రజాస్వామ్య మూలసిద్ధాంతాలనే నిర్లక్ష్యంగా త్రోసిరాజంటున్నారు! ఉత్తరప్రదేశ్‌లో చూడండి ఒక్కసారి—నాకొకొలు, అవిశ్వాస తీర్మానాలు లేకుండానే పార్టీ నాయకునిపై అవిశ్వాసం ప్రకటిస్తున్నారు బహిరంగంగా. తనపక్షంలో మెజారిటీ వర్గం తనపై అవిశ్వాసం ప్రకటించినదని తెలిసికూడా పార్టీ నాయకుడు మిన్నకున్నాడు! సిద్ధాంతరీత్యా చేయవలసినట్లు—తానై రాజీనామా సమర్పించనే లేదు! అనూచానంగా వస్తున్న రాజకీయ తంత్రం 'విభజించి మాత్రం ప్రవేశపెట్టాడాయన.

ఇహపోతే కాంగ్రెస్ హైకమాండ్ వారు అటు బయటికి వచ్చినవారిపై క్రమశిక్షణచర్య తీసుకునే విషయమై ఆలోచించనూలేరు—ఎందుకు తీసుకోరాదో విచారించనూలేరు—శాసనసభను అదుపులో పెట్టడమో, రాజీనామా చేయడమో తేల్చమని ముఖ్యమంత్రినీ ఆదేశించలేరు. మళ్ళీ ఇక్కడకూడా (హరే) కృష్ణ (మెహతాబ్) లీలలు అవసరమని, అవశ్యమని వారు భావిస్తున్నట్లున్నది. ప్రతిపక్షాన్ని బలహీనం చేయడానికి పదవివ్యామోహితులను పిలచి మంత్రివర్గం నిర్మించడం వీరి యెత్తు! అప్పుడే మొత్తంమీద యిద్దరు కేంద్రమంత్రులు లక్నోకు పరుగులు పెట్టారు. అందులో పండిట్ మాలవీయ అప్పుడే 'లక్నోటీ, వార్తలేవో పాత్రికేయులకు అందించారు కూడా!

ప్రజాస్వామ్య వ్యవస్థ పడుతున్న అవస్థలలో ఇదొక కోణం. రెండోది మొన్న లోక్‌సభలో లేడీహార్డింజ్ బిల్లు చర్చలో జరిగింది. ఈ బిల్లుపై తుదినిర్ణయం తీసుకోడానికి ఎన్ని నెలలో పట్టింది. సామాన్యంగా చర్చకు పెట్టేముందే బిల్లులన్నీ కేంద్రమంత్రిమండలి ఆమోదించి ఉంటుందని అభ్యూహ. అలాగే లేడీహార్డింజ్ కాలేజి బిల్లుకూడా మంత్రిమండలి ఆమోదించి ఉంటుందని లోక్‌సభికులు భావించారు. బిల్లుపై చర్చ జరుగుతున్నప్పుడు బిల్లును ఉపసంహరించమని ఆరోగ్యమంత్రి శ్రీ కర్మర్కర్‌కు 'హైకట్టిన' కూడా పంపబడింది. మళ్ళీ మంత్రిమండలి సమావేశం ఇందు



ఆగస్టు 22 వ తేదీన తమ 78 వ ఏట కీర్తిశేషులైన అస్సాం గవర్నరు శ్రీ సయ్యద్ ఫజల్ అలీ.

# సిక్కిం లాటరి

(సిక్కిం గవర్నమెంటు వారివల్లను ఇండియా గవర్నమెంటువారి వల్లను అనుమతింపబడినది.)

రూ. 150,000 లు గ్యారంటీ ప్రయిజులు

మొదటి ప్రయిజు రూ 75,000. ఇంకా 786 యితర ప్రయిజులు.

ముగింపు తేదీ 30-9-59 డ్రా తేదీ 14-10-59

టిక్కట్టు వెల రూ 1-15 న. పై.

7 టిక్కట్లు రూ 6-25 న. పై. 16 టిక్కట్లు రూ 12-50 న. పై.

# కళ్లికోట కాలేజీ లాటరి

(ఒరిస్సా గవర్నమెంటువారి అంగీకారము పొందినది)

రూ. 1,70,000 లు పైగా ప్రయిజులు

మొదటి ప్రయిజు రూ 85,000 లు. రెండవ ప్రయిజు రూ 30,000 లు

ఇంకా 820 యితర ప్రయిజులు.

ముగింపు తేదీ 30-9-59. డ్రా తేదీ 18-10-59

టిక్కట్టు వెల రూ 1-15 న. పై.

7 టిక్కట్లు రూ 6-25 న. పై. 16 టిక్కట్లు రూ 12-50 న. పై.

# సెంటు పాల్సు ఛారిటీస్ ఫండు

(మైసూరు గవర్నమెంటువారి అనుమతి పొందినది)

రూ. 33,1[illegible] ప్రయిజులు

మొదటి ప్రయిజు రూ 18,500 లు. రెండవ ప్రయిజు రూ. 7000 లు.

మూడవ ప్రయిజు రూ 4500 లు. ఇంకా 144 ప్రయిజులు.

4 టిక్కట్లు వెల రూ 1-15 న. పై. 28 టిక్కట్లు రూ 6-25 న. పై.

64 టిక్కట్లు రు. 12-50 న. పై.

ముగింపు తేది 15-10-59. డ్రా తేది 19-11-59.

మా వద్ద టిక్కట్లు కొని అనేకమంది ప్రయిజులు పొందియున్నారు. మీ అదృష్టాన్ని పరీక్షించుకొనుటకై మీరుకూడా నేడే మాకు M. O. పంపి పై మూడు రకాల టిక్కట్లు పొందండి మీరు M. O. లు ఎంత తొందరగా పంపితే అలక్ష్యం - ఆలస్యంగా లేకుండా అంత తొందరగా మీకు టిక్కట్లు అందును.

సాళం కామరాజు,

కాశీశ్వరరావు మార్కెట్టు, విజయవాడ-1.





# న్యూఢిల్లీ లేఖ

నిమిత్తం ఏర్పాటైందనో తెలియదు.

మరి ఉండనే ఉంది తృతీయ కోణం. రహదారులకు, రైల్వేలకు మధ్య కొన్ని గొడవలున్నాయి. రెండుశాఖలు ఇద్దరు సమర్థులూ బలవంతులైన మంత్రులు–శ్రీ ఎస్. కె. పాటిల్, శ్రీ జగ్‌జీవన్‌రామ్‌ల చేతుల్లో ఉన్నాయి.

ప్రయాణీకులకు మరింత ఆకర్షణీయంగా హాయిగా సుఖంగా ఉండేటట్లు రైల్వేల ప్రయాణ వసతులను అభివృద్ధి చేయడానికి శ్రీ జగ్‌జీవన్‌రామ్ నిరాకరిస్తున్నారు. రహదారి బట్వాడాలు పెరిగిపోతాయంటారు ఆయన. అప్పుడు దక్కన్నా యిర్వే హాయిగా ఉండకుండా చేస్తాయి! పోటాపోటీలో రహదారి వసతులు సమగ్రంగా అభివృద్ధి పరచాలంటారు శ్రీ ఎస్. కె. పాటిల్. జాతీయ రవాణా విధానం ఒకటి సమగ్రంగా రూపొందించడానికి ఇటీవలనే ఒక కమిటీ నియమించబడింది — కమిటీకి అనధికార చైర్మన్‌గా శ్రీ కె. సి. నియోగిని నియోగించారు శ్రీ పాటిల్. శ్రీ నియోగి ప్రస్తుతం ప్రభుత్వశాఖలలో ఎక్కడాలేని అనధికార ప్రముఖుడు. ఇక్కడే ఉంది తమాషా అంతా.

కాంగ్రెస్ వారితోపాటు అనధికారులంతా రహదారుల అభివృద్ధిని కోరుతూ రైల్వేలను విమర్శిస్తున్నారు. శ్రీ ఎస్. కె. పాటిల్ అనధికార ప్రముఖులను సమాలోచిస్తున్నారు. శ్రీ జగ్‌జీవన్‌రామ్ కమిటీని రైల్వే హితైషులయిన అధికార ప్రముఖులతో నింపివేశారు. సమస్య జటిలం అయింది.

ప్రజాస్వామ్యవ్యవస్థ నడుస్తున్న అవస్థలలో పాలంగడి–షెకోటా విమానాలు సర్వీసునుంచి తొలగించాలనేగాని. భారతదేశంలో AVRO రకం విమానాల తయారీకి ఒక ప్రసిద్ధ బ్రిటిష్ సంస్థతో రక్షణ మంత్రి గత జూలై మాసారంభంలో ఒప్పందం కుదుర్చుకున్నారు ఇంకా దీనిని విమాన సర్వీసు (Air Force) వారు ఆమోదించాల్సి ఉంది. ఈ విమానాల తయారీవల్ల ఉన్న పెద్ద ప్రయోజనం ఏమిటంటే వైకౌంట్ విమానభాగాలలో నూటికి ఎనభై వంతులు వీటికి పనికిరావటం. పరస్పరం మార్చుకోవచ్చు. ఈ బ్రిటిష్ సంస్థవారు ఇంతవరకు ఈ ప్రయాణీకుల విమానాలు తయారు చేయనేలేదట. బయట విమానాల నిర్మాణాభివృద్ధికి మన రక్షణ మంత్రిత్వశాఖ బాగా తోడ్పడుతున్నదన్నమాట! రష్యన్ జెట్ విమానాలూ, అమెరికాలో బోయింగ్స్, కామెట్లు ప్రయాణాలకు

# ఋణానందలహరి

సినిమాలో చీకట్లో అప్పారావు, పక్కవాడి చెవిలో జోరీగలా పోరి పోరి డాక్యుమెంటరీ అయే వేళకు వాణ్ణి హోరెత్తించేశాడు. అసలే ఇంగ్లీషు పిక్చరు. అందులో పక్కవాడి ఋణఋణ ధ్వని. ఇక కథ తెలిపెంచస్తుందని దిగులుపడి అతను లొంగిపోయాడు.

చీకట్లో నా మొహం మీకు కనబట్టం లేదు గాని, మీరు నన్నెరుగుదురు. నేను మిమ్మల్నెరుగుదురును ఇప్పుడు కాదన్నారంటే అనక వెలుగులో నన్ను గుర్తుపట్టాక నాలిక్కొరికేసుకుని భోరున ఏడిచేస్తారు. నాకేం అన్నాడు అప్పారావు.

ఏందయ్యా నీగోల అన్నాడాయన

నా లక్కు! మీరూ తెలుగు పీపులేనన్న మాట, ప్రాణం లేచొచ్చింది. తెలుగుమాట మాట వినగానే. మెడ్రాసులో తెలుగూస్ లేరన్న గూస్ ఎవడూ? ఇంతమందితో ఇలా కిక్కిరిసి పోతోంటేనూ! వాడి పేరూ ఎడ్రసూ చెప్పండి చెబుతా ... మీకు తెలీదా? డోంట్ వరీ శ్రమపడకండి. హాయిగా సినిమా చూడండి. చూసి ఆనందించండి. ఈలోగా జస్ట్ టూ రుపీస్ పారేసుకోండి. అవి మళ్ళీ రేపు తెల్లారేసరికి మీ గుమ్మానికి వచ్చి తలుపుకొట్టి, పలకరించి ఎత్తుకోమని, జేబులోకెక్కి కూర్చుంటాయి. అగ్ఛతం తెండి ... యస్సార్ మై నేమ్ జ్ అప్పారావ్ ...థాంక్యూ...శేప్పొద్దున్న టుమారో మార్నింగ్ ... పదవోయ్ గుర్నాధం కమాన్ అంటూ తను లేచి గుర్నాధాన్ని వెంటబెట్టు బయటపడి రూపాయ పత్నాలు గణాలకి టిక్కెట్టు మార్చేశాడు అప్పారావు.

గుర్నాధం అతుణాన ఈ లోకంలో లేడు. అప్పారావు హడావుడి చూసి కళ్ళు తిరిగిపోయి విభ్రాంతుడై ఉన్నాడు. టిక్కెట్ల మార్పిడి అయ్యేవరకు మేలుకొని, ఎవర్రా.అది? నీకు అప్పిచ్చినాయన ఎవరూ? అన్నాడు. మెల్లగా.

అప్పారావు ఉలిక్కిపడ్డాడు. అరెరె. పొరబాటై పోయింది. పేరూ అదీ కనుక్కోలేదే. సారీ...అన్నాడు.

గు[illegible]ధం తెల్లబోయాడు. మొహా[illegible] ఎరగనివాడిదగ్గిర అప్పు చేశావా! అన్నాడు.

ఆ, దాందేముందిలే - ఇదివరకెరక్కపోతే ఇప్పుడు తెలుసుకుంటాం. పరిచయాలు స్నేహాలూ అంతర్జాతీయ సంబంధాలూ ఎలా పుట్టి పెరిగి విరుగుతాయనీ! అప్పుల మూలాన్నేకదా! అప్పడక్కపోతే నాడెవడో మనమెవడో. డోంట్ వరీ. నాకూ నీతీ గట్రా ఉందిలే. సప్త సముద్రాలూ గాలించైనా—

ఏమీ అక్కర్లేదు రూపాయి పావలా క్లాసులోకి మళ్ళీ వెళ్ళి ఇందాక మనం కూచున్న చోటు వెతుకుదాం. అక్కడే వుంటాడు. క్షమాపణ చెప్పుకుని, కాళ్ళు పట్టుకుని హాస్టలుకు లాక్కురా. నేనుకూడా నీమూలాన వాడి కాళ్ళమీద పడతాను. ఎంత అపరదిష్టా! సిగ్గులేదురా. ఆమధ్య ఉండేదనే వాడివి! అనంతా ఏం చేశావురా? అన్నాడు గుర్నాధం మండిపడుతూ.

బావుంది ఇంకెక్కడుందోయ్! సిగ్గు విడిచి రెండేసిసార్లు అడిగితే తప్ప వీరప్పలివ్వరు. ఎప్పుడో నిండుకుంది కాబోలు అన్నాడు అప్పారావు.

ఛప్. ముందెళ్లి ఆ పెద్దమనిషిని వెతికి కాళ్ళమీద పడు...ఇదంతా మా నాన్నకి తెలిస్తే—

అప్పారావు అర్జెంటుగా లోపలికెళ్ళి, తొలిసారిగ్గి చెదులు డబ్బులా వెంటనే తంగున తిరిగి వతలికొచ్చేశాడు హడావుడిగా.

## ముళ్ళపూడి వెంకటరమణ

మళ్ళీ ఎందుకొచ్చావు వెళ్లు. అని గదమాయించాడు గుర్నాధం. ఈసారి మెల్లిగా లోనికెళ్ళి అప్పిచ్చిన పెద్దమనిషి పక్కన కూర్చుని సార్. క్షమించాలి అన్నాడు వినయంగా.

మళ్ళీ వచ్చా? ఎవడ్రానువ్వు. ఇందాక నా చేతిలోంచి రెండు రూపాయలు లాక్కున్నది నువ్వేనా.

అఫ్కోర్సు. నేనేనండి. నేను అబద్ధమాడను. అది చేతనైతే—

నాయనా నీకూ నీ పెద్దలకీ ఓ దండం. ఇక్కణ్ణుంచి పోరాదూ!

నో సార్. తమ్ముఖ ఒక్కసారి మా హాస్టలుకి దయచేస్తే మా గుర్నాధం ఒక్కసారి మీ కాళ్ళమీదపడాలని మహాయిదవుతున్నాడండి.

ఆయన చీకట్లోనే తెల్లబోయాడు. వాడెవడు? వాడికదేంబుద్ధి అన్నాడు. తెలీదండి. కాని, ఒకటి గుర్తుంచుకోండి, మా గుర్నాధానికిదేం హాబీ కాదు. ఇలా అందర్నీ హాస్టలుకి పిలిచి వాళ్ల కాళ్ళమీద పడడం. ఏదో ఈసారి సరదా పుట్టింది. ఉన్నవాటిలో మిమ్మల్నిచెప్పని ఎన్నికచేసి ఉంటాడు. నా ఒపినియన్ అడిగితే. భానుమతి పాటాలు పజెస్సు చేసేవాణ్ణి. శామలపాకుల్లా...

పెద్దాయనకి సంగతి బోధపడింది. అప్పారావుకేసి ఆ చీకట్లోనే జాలిగా చూశాడు. ఆయన గుండె తరుక్కుపోయింది.

ఓ నేను. అవే మెరుగు. నేనూ చూశాను. ఆమాట నిజమే. బయటపద. మీ—వాడి పేరేంటన్నావు - వాడితో చెబుదాం—దామ్మ...దా అంటూ అప్పారావును వెంటబెట్టుకు ఇవతలికొచ్చాడు.

అల్లంత దూరాన్నించే వాళ్ళిద్దర్నీ చూసిన గుర్నాధం గుండె గుభేలుమంది.

అమ్మబాబోయ్ అనేందుకుకూడా వ్యవధి చాలక, స్తంభంచాటుకు తప్పుకుని వారిద్దరినీ సంస్మరించి అలా చాటునుండే గేటు వైపు సాగి, అక్కడ ముగుచుకుని, అవతలపడి దీపాల ప్రపంచంలో కలిసిపోయి హాస్టలు కెళ్ళిపోయి బనీనుకూడా మార్చేసి తలపోగా చుట్టుకుని పడుకున్నాడు గుర్నా[illegible].

అరగంట తరవాత అప్పారావు వచ్చాడు ఉత్సాహంగా.

తానొక్కడే వచ్చాడని, కాళ్ళాయన, (గుర్నాధం, కాళ్ళమీద పడదామనుకున్నాయన — అంటే గుర్నాధం కాళ్ళమీద కాదు) రాలేదని ఒట్టు సత్యాలు పెట్టాక తలుపుతీశాడు.

కాని అప్పారావు ఒక్కడూ రాలేదు. అతనితో పెద్ద ముప్పొకటొచ్చిపడింది.

ఆయన కాళ్ళమీదపడే ధాన్ని ప్రస్తుతానికి వాయిదాపడింది. కాని బాధపడకు నిరాశతో నిస్పృహతో కుంగి కుమిలిపోకు. తప్పకుండా నీకా అవకాశం కలుగుతుందని ఆయన గారంటీ ఇచ్చాడు. అసలు నీకలాటి ఊహరావడమే ఎంతో అద్భుతంగా ఉందనీ, శుభసూచన అనీ, ఆనందం కలిగించిందనీ ఆయన అన్నాడు. ఇదీ రూపాయలు పట్టాడుకూడా పాపం. మళ్ళీ ఇటిస్తానంటే, వద్దు దంపేస్తానన్నాడు. అంతగా అయితే ఏడాదికో పదేళ్ళకో ఈ అక్క చివరకో, [illegible]నా దగ్గిర [illegible] డబ్బు మరీ ఎక్కువ అయిపోయి దానధర్మాలూ గట్రా చేసినప్పుడు కావాలంటే ఓ నోటు తనమీద పారెయ్యొచ్చున్నాడు. ఇలాటివాడు—ఇంతమంచి మాక గారు మనకెక్కడ దొరుకుతారు? ఇల[illegible] ఉదాగుడు, దానశీలి—శిబి దధీచి[illegible] కర్ణా? అన్నాడు అప్పారావు.

* * *

## కార్టూన్ పోటీలో గెలిచిన చిత్రం [బహుమతి రూ. 12/-]




చిత్రకారిణి: వి. జానకి — మద్రాసు.

# ఋణానందలహరి

ఈ విధంగా ఆరున్నరనుండి ఏడున్నర వరకు అప్పారావు చేసిన ఋణప్రసంగంలో, కత్తి చిదారం వేరు చేసి దాన్నే పోగేసి చూసుకునేసరికి గుర్నాథం గుండె గంటన్నర సేపులోనూ రెండోసారి గుభేల్ మంది.

"బాబోయ్! భానుమతెలా? ఆ పిల్లని తప్ప ఇంకోళ్ళని చచ్చినా చేసుకోను. రామయ్యగారి [illegible]ంటి యాకర్సు పొలమూ వద్దు, వాళ్ళ అన్నపూర్ణ అంతకన్నా వద్దు. చచ్చైనా పోతానుగాని చచ్చినా చేసుకోను అన్నాడు గుర్నాథం.

రామయ్యగారిని గనక నువ్వు అవమానిస్తే మీ నాన్న తక్షణం టెలిగ్రాంమీద నీ డొక్క చింపించి డోలుకట్టించి దానిమీద తండ్రిమాట వినని పుత్రుడి గాథ ఏమైందో టముకు వేయించేస్తాడు. మిగతా డొక్కతోటే డోళ్ళు, బుర్రలూ చేయించి, బుర్ర కథలు చెప్పిస్తాడు. అన్నాడు అప్పారావు.

చెయ్యనీ చూదాం.

చూదాం కాదు విందాము. వినడానికూడా నువ్వుండవుగా.

భవ్ నోర్మయ్ హిస్టరీ లెక్చరర్లా చవట విట్లూ నువ్వూను. చేసినవే వేస్తూ నవ్వడానికి విసుగు లేదూ?

హిస్టరీ లెక్చరరు విట్లు నేనెప్పుడూ రెండోసారి వినలేదుగా విలాగా. హిస్టరీ లెక్చరరు. విట్లుకన్నా చాలా బావుండని 'విట్లు,' మీ కాబోయే మామయ్య రామయ్యగారు, రేపు తెల్లారి ఎనిమిది ఘడియలకి రెండోసారి నీకు తటస్థపడతారు. అది చూడు ముందర. అన్నాడు అప్పారావు.

గుర్నాథం తలవంచుకున్నాడు మాటాడకుండా. అతనికేం పాలుపోలేదు. వాళ్ళ నాన్న పంపిన అన్నపూర్ణ ఫోటోవంక చూస్తూ దిగలుపడిపోయాడు.

అప్పారావు తేలుకుట్టినట్టులేచి కిటికీదాకా వెళ్ళి మళ్ళీవచ్చి, పద విచారించకు. సినిమాకిపోదాం అన్నాడు...ఈ సారి నిజంగా డబ్బుందిలే. హోలుదగ్గిర అప్పు చెయ్యను అని ధైర్యం చెప్పాడు.

ఎక్కడిదీ ఆయన ఇచ్చిందేనా అన్నాడు గుర్నాథం ఆ బాధలోనే. కాదు ఇప్పుడు

(54-వ పేజీ చూడండి)

# స్వర్ణలక్ష్మి

గంటి సూర్య ప్రకాశరావు

రింగ్ రింగ్ మనే అలారం చప్పుడికి సుబ్బారావు ఉలిక్కిపడి లేచి లైటు వెలిగించాడు. అప్పుడే అయిదు అయింది. బద్ధకంగా ఒళ్ళు విరుచుకొంటూ ప్రక్కకేసి చూశాడు తాను ఊహించిన మనిషి అక్కడ లేదు. ఏదో జ్ఞాపకం వచ్చినట్లుంది. తొందరగా క్రిందకు దిగి బాత్‌రూమ్‌లోకి ప్రవేశించాడు. వంటింట్లో నీళ్ళు కాస్తున్న సుజాత బాత్‌రూమ్‌లోనుంచి వస్తున్న చప్పుడికి కొంచెము ఇవతలకి వచ్చి చూసింది. ముఖము కడుక్కొని సుబ్బారావు మేడమీదికి వెళ్ళాడు.

"పొద్దున్నే ఏమంత రాచకార్యం మునిగిపోయిందని పెందరాళే లేచారు?" అని దీర్ఘంతీస్తూ సుజాత మేడమీద గదిలోకి ప్రవేశించింది. సుబ్బారావు ఆమెవైపొకసారి ప్రశ్నార్థకంగా చూసి, "రేస్ కోర్సుకి వెళ్ళాలి. నా స్నేహితుడొకడు అర్జంటుగా పనుందని రమ్మన్నాడు," అన్నాడు. వెంటనే సుజాతముఖంలో కొంచెము విషాదచ్ఛాయలు అలుముకున్నాయి. "ఈ అలవాటు మీరింకా ఎప్పుడు మానుకుంటారండీ? అని అడిగింది. దానికి సుబ్బారావేమీ సమాధానం ఇవ్వలేదు. తొందరగా డ్రెస్సు వేసుకొని క్రిందకి దిగి, తలుపు వేసుకోమని సుజాతకి చెప్పి బయటకి వెళ్ళాడు.

సుబ్బారావు లజ్ కేసి నడక సాగించాడు. అక్కడక్కడ ఇళ్ళముందర పని మనుష్యులు వీధి గుమ్మాల దగ్గిర నీళ్ళు చల్లి ముగ్గులు పెడుతున్నారు. ఆవులు, గేదెల డెక్కల చప్పుడు మినహాయించి అంతా ప్రశాంతంగా ఉంది. ఒక టాక్సీని పిలిచి గిండీ రేస్‌కోర్సుకి వెళ్ళమన్నాడు. టాక్సీలో కూర్చున్న సుబ్బారావు ఆలోచనలు పరిపరి విధాలుగా పోయాయి. పాపం సుజాత! ఆమె అడిగిన ప్రశ్నకు జవాబియ్యకుండానే వచ్చేశాడు. తను ఆమెకు అన్యాయం చేస్తున్నానా అని అనుకున్నాడు.

సుబ్బారావుకి పెళ్ళయి నాలుగేండ్లయింది. పెళ్ళికాని క్రితం తనూ, తన స్నేహితులు రేస్‌కోర్సులకు ఎలా తిరిగేవాళ్ళో, పెళ్ళయిన మొదటి రోజుల్లో కూడా, వాటిని వదల్చుకోలేక పోతున్నాడు. ఏమిటో సుజాతను చూసినప్పుడల్లా ఆమెతో కులాసాగా గడపాలని అనుకుంటూ ఉండేవాడు. కాని ఎవరో స్నేహితులు పిలవగానే వాళ్ళ వెంట వెళ్ళిపోయేవా . అలా అని ఆమె అంటే తనకు అయిష్టం కాదు. క్రమంగా ఏమయినాసరే ఇంటిపట్టునే ఉండాలని గట్టిగా నిశ్చయించుకొన్నాడు. కొన్ని నెలలుగా మానివేసాడుకూడా. ఇప్పుడుమాత్రము తన ముఖ్య స్నేహితుడు ముత్తుస్వామి క్రితం రోజు ఫోను చేసి తన గుఱ్ఱంఒకటి తెల్లారకనే 'ట్రాక్ వర్క్'కి వెళ్ళుతుందని అది ఎలా వుందో చూడాలని తన్ని తప్పకుండా రమ్మన్నాడు. అది అవగానే తను ఇంక రేసులకు స్వస్తి చెప్పాలని తీర్మానించుకొన్నాడు.

టాక్సీ రేస్‌కోర్సుదగ్గఱకి వచ్చి ఆగింది. సుబ్బారావు టాక్సీవాడిని తను తిరిగి వచ్చేదాక అక్కడే ఉండమని చెప్పి లోపలకి వెళ్లాడు. రేస్‌కోర్సు ఆవరణఅంతా నిర్మానుష్యంగా ఉంది. గుఱ్ఱాలు పరిగెత్తే మైదానం వైపుకి వెళ్ళాడు. అక్కడే "రైలింగ్స్" దగ్గఱగా వెళ్ళి నిల్చున్నాడు. ఇంకా బాగా తెల్లవారలేదు. మంచు కురియడంచేత గడ్డిపోచలమీద ముత్యాల్లా మెరుస్తున్నాయి. అక్కడక్కడ గుఱ్ఱపుడెక్కలుపడి కొంచెం చెదిరిఉన్నాయి. ఒక "సైజు" కుర్రాడు, అంటే గుఱ్ఱాన్ని కాపలాకాసే పనివాడు తనవైపుకే వచ్చి నిల్చున్నాడు. వాడు తనకు బాగా తెలుసు. ముత్తుస్వామి గుఱ్ఱాన్ని కాపలా కాసేవాడు. ముత్తుస్వామి జ్ఞాపకం రాగానే "అయ్యా వందారా?" అని అరవంలో అడిగాడు. "ఇన్నుం వర్‌లే సార్" అని కుఱ్ఱాడు జవాబిచ్చాడు. వాడికో బేడ చిల్లరడబ్బులిచ్చాడు. కుఱ్ఱాడు సంతోషంతో వెళ్ళిపోయాడు.

ముత్తుస్వామి గుఱ్ఱం తన ప్రక్కనుంచే మెల్లగా వెళ్ళసాగింది. సుబ్బారావు, దాన్ని స్వారిచేస్తున్న జాకిని "దీని పేరేమిటోయ్, మర్చిపోయానని" అడిగాడు. 'స్వర్ణలక్ష్మి' అని చెప్పాడు. మూడో ఫర్లాంగ్ గేటువైపుకి మెల్లిగా నడిపించసాగాడు జాకీ. ముత్తుస్వామి బాగా డబ్బున్నవాడు. ఎలా కలిసిందో తమ కిద్దరికీ స్నేహంకలిసింది. ముత్తుస్వామికి రేసులంటే బాగా పిచ్చి. తను వద్దంటున్నా ప్రతి రేస్‌కి బలవంతంగా లాక్కొనిపోయేవాడు. తనకు రేస్‌లో వచ్చిందేమీ లేదు. కాని అంతగా ఎప్పుడు నష్టం కలగలేదు.

ఇంతలో ముత్తుస్వామి బూట్లు టకటకమని చప్పుడుచేసుకొంటూ సుబ్బారావు దగ్గఱికివచ్చాడు. వస్తూనే "మన గుఱ్ఱం టైమింగ్ కాయడం అయిపోయిందా?" అని అడిగాడు. "లేదు. ఇప్పుడే మూడో ఫర్లాంగ్ గేటుదగ్గఱకి వెళ్లిందని సుబ్బారావు" అన్నాడు. ఇంతలో బయలుదేరబోతుందన్నట్లు ఓ తెల్ల కర్చీఫు జాకి ఊపాడు. ముత్తుస్వామి ఒక "స్టాప్ వాచ్" పైకి తీసి సరిచూసుకొన్నాడు. మొదట గుఱ్ఱపు డెక్కల మోత దూరంగా అస్పష్టంగా వినిపించింది. గుఱ్ఱం దగ్గఱగా వచ్చేసరికి మరి స్పష్టంగా వినిపించింది. తృటిలో వీళ్ళను దాటి వెళ్ళిపోయింది. ముత్తుస్వామి టైం చూసి, "చాలా మంచి టైమింగ్" అని అన్నాడు. తర్వాత స్వర్ణలక్ష్మి గుఱ్ఱపుసాలకి వెళ్లింది. అది అసలే నల్ల గుఱ్ఱం. దాని మీద చెమట బాగా పట్టిందేమో, మిలమిల మెరిసిపోతోంది. నోట్లోంచి నురగలుకూడ గ్రక్కసాగింది. ముత్తుస్వామి తన గుఱ్ఱంకేసి గర్వంగా ఒకసారి చూసి, సుబ్బారావు వైపుకి తిరిగి—

"నేను యివాళ అర్జంటుగా హైద్రాబాదు వెళ్ళుతున్నాను. రేపటి రేసులో మన గుఱ్ఱం పరుగెత్తుతుంది. దాని మీద ఓ వెయ్యి రూపాయలు కట్టాలి." అని అంటూ జేబులోంచి రూపాయలకట్ట తీసి పదినోట్లులెక్కపెట్టి యిచ్చాడు. సుబ్బారావు ఏదో సమాధానం చెప్పేలోపునే—"రేపు సాయంకాలం మళ్ళీ రేస్‌కోర్సులో నే కలుసుకొంటా" నంటూ ముత్తుస్వామి చకచకా వెళ్ళిపోయాడు. సుబ్బారావు చేతిలోని నోట్లవైపు చూస్తూ ఉండిపోయాడు.

అప్పటికే బాగా తెల్లవారింది. రేస్‌కోర్సు ఆవరణలో మనుష్యులు తిరుగుతున్నారు. సుబ్బారావు బయటకివచ్చి తన టాక్సీలో ఎక్కి తిరిగి తన యింటికి చేరుకున్నాడు. ఇంట్లో అడుగు పెట్టేసరికి, సుజాత గుమ్మం దగ్గఱ ఆహ్వానించింది.

"మీకోసం కాఫీ కాచాను. త్రాగకుండ వెళ్ళిపోయారే, ఉండండి తీసుకొనివస్తాను" అని అంటూ వంటింట్లోకి వెళ్లింది. సుబ్బారావు మేడమీదికి వెళ్ళి తన గదిలోకి ప్రవేశించాడు. మెల్లిగా తను కట్టుకొన్న బట్టలు విప్పి, స్టాండ్‌కి తగిలించాడు. డాబా దగ్గఱ కుర్చీ వేసుకొని కూర్చున్నాడు. సుజాత కాఫీ కప్పుతో ప్రత్యక్షమైంది. చిరునవ్వుతో, ఆ కప్పుతీసుకొని కొంచెం చప్పరించి ఆమె వైపుకి చూసాడు. "ఏం, కాఫీలో పంచదార చాలదా?" అని ప్రశ్నించింది. "కాదు, కాఫీ త్రాగేటప్పుడు సిగరెట్లు కావాలి కదా; అది కొంచెం తీసుకొచ్చి ఇస్తావేమోనని చూస్తున్నాను." అని అన్నాడు. వెంటనే సుజాత తగిలించిన పాంటు జేబులో సిగరెట్టు పాకెట్టు తీస్తుండగ, వందరూపాయలనోటు క్రింద పడింది. అది జాగ్రత్తగాతీసి పర్సులో పెట్టి,

సిగరెట్లు ఇచ్చేటప్పుడు—"ఏమండీ! ఎక్కడిదండీ అంతడబ్బు. జేబులో ఉంది?" అని అమాయకంగా అడిగింది. దానికి సుబ్బారావు—"అదంతా నీకు తెలియదులే. తర్వాత చెప్తాను" "ఎంతఉందో లెక్క పెట్టి పర్సులో పెట్టావా! అని అడిగాడు. "ఓ! అయిదు వందలుంది" అని సుజాత సమాధానమిచ్చింది. "అరె! వెయ్యి ఉండాలే!' అని సుబ్బారావు గదిలోకివెళ్లి తానోసారి లెక్క చూసుకొన్నాడు.



రెండూ ఏది గెలుస్తుందో చెప్పలేనంతగా సమానంగా పరిగెత్తసాగాయి.

అయిదువందలే ఉంది. సుబ్బారావుకి ముచ్చెమటలు పోశాయి. "ఒకవేళ టాక్సీలోగాని జారిపోలేదుకదా! అరే! టాక్సీనెంబరు కూడ తనకు తెలియదాయె. ఏమిటీ కర్తవ్యం. ఒక్కటా! రెండా? అయిదువందలు.! అసలు ఎలా పోగొట్టుకొన్నాడో, తనకు తెలియదు. రేపు రేస్‌లో ముత్తుస్వామిగుఱ్ఱం స్వర్ణలత గెలిస్తే వాడికి లెక్క అప్ప చెప్పాలి." అని విచారించసాగాడు. పోనీ నిజం ఒప్పేసుకుంటే? అమ్మో! ఇంకేమన్నా ఉంది? ఎక్కడేనా బావ గాని, వంగతోట దగ్గఱ బావ కాదన్నట్లు. ముత్తుస్వామి డబ్బుదగ్గఱ మహా నిక్కచ్చి. పరిపరివిధాల ఆలోచనలో సతమతమవుతుండగా, సుజాత విధేయపూర్వకంగా "ఏమయిందండీ, అంత కంగారుగా ఉన్నారు.?" అని అడిగింది.—"ఏమిలేదు, సాయంకాలం నీకంతా చెప్తాను. త్వరగా భోంచేసి ఆఫీసుకుపోవాలి"! అని అన్నాడు. ఆఫీసుకు వెళ్లాడన్నమాటేగాని, మనసు నిలకడగా లేదు. తను టైపుచేసిన కాగితం అంతా తప్పులే.

ఆ రాత్రి సుబ్బారావు భోజనం ముగించి, ఆఫీసునుంచి వచ్చేటప్పుడు, కొన్న రేస్ బుక్కుని తీసుకొని ప్రక్కమీద నడుం వాల్చి పేజీలు తిరగేయసాగాడు. ఇప్పుడు ముత్తుస్వామి యివ్వవలసినడబ్బు రాబట్టాలంటే రేపు తన అదృష్టం అంతా పరీక్షించుకోవాలి. ఒకసారి సుజాత మల్లెపూవుల ఘుమ ఘుమలతో గదిలోకి ప్రవేశించింది. వస్తూనే "అప్పుడే పుస్తకం కొన్నారు. ఇంక ఇవ్వాళ తెల్లారినట్టే? విసురుగా అద్దందగ్గఱకి నడిచి వయ్యారంగా నిల్చుని జడ సవరించుకోసాగింది. సుబ్బారావు ఆమె వైపు ఒకసారి చూసి ఒక కాగితంపై రెండు నెంబర్లు వ్రాసి సుజాతను పిల్చాడు. "ఇదుగో! ఇందులో ఒక కాగితం తియ్యాని" అడిగాడు. "ఎందుకో చెప్తేగాని తియ్యను" అని అంది సుజాత. మన అదృష్టం అంతా యిందులో యిమిడిఉన్నది. ఇవ్వాళ నా స్నేహితుడు ఒక గుఱ్ఱంమీద కట్టమని వెయ్యి రూపాయలిస్తే, అయిదువందల రూపాయలు పోగొట్టుకొన్నాను. అయిదువందలతో నీ చేతులారా తీసిన నంబరుపైకట్టి ముత్తుస్వామికి బదులు చెప్పకోవాలి." అని అనగానే సుజాత "అమ్మ బాబోయి! అయిదువందల్లే తీరా నే తీసిన నెంబరు రాకపోతే? అబ్బ! నా వల్ల కాదు." అని కొంచెము బింకం చేయసాగింది. "నేనప్పుడే చెప్పాను. మళ్లీ ఈ రేసులు మొదలెట్టద్దని. వింటేగా!" అని విసుక్కుంది. సుబ్బారావు కొంచెం బుజ్జగించినతర్వాత, ఒకసారి గౌరిదేవిని స్మరించి ఒక కాగితం తీసింది. అందులో మూడో రేసులో నాల్గవనెంబరు అని ఉంది. సుబ్బా

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి

# రోజంతా నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి!



ఎందు చేతననగా: ఒకసారి తోముకుంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 వంతుల వరకు దంతక్షయము లేకుండా చేసి, దుర్వాసన పోగొడుతుంది.**

భోజనం చెయ్యగానే కాల్గేటును ఉపయోగించి బ్రష్‌తో పళ్ళు తోముకొన్నట్లయితే అనేకమందికి దంతక్షయం కావడం ఆగిపోతుందనీ, దంత వ్యాధుల చరిత్రలో ఇది అపూర్వ విషయమనీ, శాస్త్రీయ పరిశోధన వల్ల ఋజువైంది. అంతేకాదు. నోటినుంచి దుర్వాసన వచ్చేవారు దీనిని వాడినట్లయితే 10 మందిలో 7 మందికైనా వెంటనే గుణమిస్తుందనికూడా ఋజువైంది. ఒక్క కాల్గేట్ విషయంలోనే ఇవి ఋజువైనవి.

కాల్గేట్‌నుంచి నురనురమంటూ వచ్చేనురగ పళ్ళ సందుల్లోకి లోపలికంటా చొచ్చుకువెళ్ళి, అక్కడ కుళ్ళిపోయి ఉండే ఆహార పదార్థాల నలుసులను బయటికి గిలా వేస్తుంది పళ్ళు చాలా చెడిపోడానికి, దుర్వాసన రావడానికి కారణం ఆ నలుసులే.

కాల్గేట్‌తో పళ్ళు తోముకోవడమంటే పిల్లలకు చాలా సరదా; ఎందుకంటే దానినుంచి వచ్చి చాలా పేపు ఉండే పిప్పరమెంటు వాసనంటే వారు చెవి కోసుకుంటారు




మీకు పళ్ళపొడి అలవాటైతే, కాల్గేట్ పళ్ళపొడివల్లకూడా ఇన్ని లాభాలూ ఉన్నాయి ........ఒక డబ్బా కొన్ని నెలలు వస్తుంది.

కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతక్షయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం....ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

DCG. 2907 T



త్వరితంగా నివారించ బడినది
గొంతు నొప్పి, రొమ్ము పడిశెము దగ్గులు, జలుబులు, గొంతు మరియు గుండె బిళ్లలైన పెప్స్‌తో త్వరితంగా నివారణ యగును. పెప్స్‌ను చప్పరించి, నొప్పిని నివారించి క్రిములను నిర్మూలించే దర్యాను జరుపునట్టి .. అందరికమనకర అవిరులను ఆస్వాదించండి.



పెప్స్
గొంతు మరియు
గుండె బిళ్లలు
మందుల వ్యాపారు
లందరి వద్దనూ
దొరకును

ఏ. ఇ. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

FPY-56-TEL

సోల్ ఏజెంట్లు: దాగా & కంపెనీ, 86, నైనప్ప నాయక్ వీధి, మద్రాసు-1.

# ★ స్వర్ణలక్ష్మి ★

రావు—"దీని తస్సదియ్యా! ముత్తుస్వామి, స్వర్ణలక్ష్మిలో నే పోటీగుఱ్ఱం నెంబరే వచ్చిందే! దానినెంబరు రెండు! ఆశ్చర్యంగానే ఉంది. మన అదృష్టం ఎలా పరిణమిస్తుందో!" అని అనుకున్నాడు. సుజాత "రేపయినతర్వాత యింక రేసులకి వెళ్ళకండే!" చేతులో చేయి వేయించుకొంది. సుబ్బారావు మర్నాడు జరగబోయే రేసునుగూర్చి ఆలోచిస్తూ ఉండిపోయాడు.

## 2

ఆరోజు ఆదివారం. సుజాతతో "ఇవ్వాళ సాయంకాలము మనం తప్పకుండ సినిమాకి వెళ్దాం. నేను ఆరింటికల్లా వచ్చేస్తాను" అని చెప్పి సుబ్బారావు రేస్ కోర్సుకి వెళ్ళాడు. అప్పటికే రేస్ కోర్సు బయట కార్లు కిక్కిరిసి ఉన్నాయి. సుబ్బారావు జనాన్ని తోసుకుంటూ రేస్ కోర్సు ఆవరణలోకి అడుగు పెట్టాడు. తనకు పరిచయమైన ముఖాలు ఏమున్నా కనిపిస్తాయేమో" అని చుట్టూ కలయచూశాడు. ఎవరి గొడవల్లో వారున్నారు.

మొదట రేస్ ప్రారంభించబోతున్నట్టుగా, గంట మ్రోగడం వినిపించింది. జనం తొందర తొందరగా కౌంటరాఫీసుకు పరిగెత్తి టిక్కెట్లు కొనుక్కోసాగారు. మన అదృష్టఫలితం మూడో రేస్‌లోకదా తెలిసేది. ఇప్పటినుంచీ ఎందుకు తాపత్రయం అని సుబ్బారావు ఒకమూల బెంచి మీద కూర్చున్నాడు.

"అరే కమాన్ లాస్ట్ సిల్లా," అరె కమాన్ రెబెక్కా;" అని జనంచేసే నినాదాలు. మధ్య సుబ్బారావు రెక్కలుమోతతో త్రుటికాలంలో తను ఎగరునుంచి వెళ్ళిపోయిన గుఱ్ఱాలను చూశాడు. అంతా ఒకటే కోలాహలం.

మూడో రేస్ ప్రారంభిస్తారనగా సుబ్బారావు కౌంటరు దగ్గరకు వెళ్ళి నాలుగో నెంబరుకి 500 రూపాయల టిక్కెట్లు ఇమ్మన్నాడు. డబ్బు ఇచ్చేటప్పుడు కొంచెం చేతులు వణకసాగాయి. టిక్కెట్టు కొన్న తర్వాత తిరిగి తను కూర్చున్న స్థలం దగ్గరకి వెళ్ళిపోదామనుకున్నాడు. తనకు తెలియకుండానే గుఱ్ఱాల్ని తిప్పి చూపించే "పాడాక్" దగ్గరకి నడక సాగించాడు. అక్కడ ఎవరికి తోచినట్లు వాళ్ళు గుర్రాలను అవి ఎలాపరిగెత్తగలవో చర్చిస్తున్నారు. సుబ్బారావు తనకు పరిచయముఖాలు కనిపిస్తాయేమో అని ఒకసారి చుట్టూ కలయచూశాడు. ఒకచేత్తో అద్దకత్తెరతో పచ్చి [illegible] లుచేసు గుఱ్ఱాలను పరిశీలిస్తున్న, కలవాడిలా కనిపిస్తాడు. తనకి జాకీలు, గుఱ్ఱాల యజమానులు, చాలమంది తెలుసన్నట్టు గొప్పలు కొడుతూ ఉంటాడు. సుబ్బారావుకి, రంగనాథం అయ్యారిని తను కట్టిన గుఱ్ఱాన్ని గురించి అతని అభిప్రాయం అడగాలని అనిపించింది. అయినా ఎందుకో ఒకసారి తటపటాయించాడు. తర్వాత ఉండబట్టలేక రంగనాథం అయ్యరుని సమీపించి తనుకట్టిన గుఱ్ఱాన్ని గురించి అతని అభిప్రాయం అడిగాడు. రంగనాథం అయ్యరు ఒకసారి కనుబొమలు ఎగరేసి "ఆ గుఱ్ఱం ఇవ్వాళ గెలవదు! ఎందుకంటే ఆ గుఱ్ఱపు యజమాని నాకు బాగా తెలుసు. అతను ఊళ్లో లేడు. వాళ్ళు ఇవాళ రేసులో గెలవాలని ప్రయత్నించడం లేదు" అని చెప్పాడు. సుబ్బారావు ఈ సమాధానం వినగానే చాలా నిరుత్సాహపడిపోయాడు. "అలాని అడగకుండా ఉన్నా బాగుండును! కొంచెం మనస్సు స్థిమితం అయినా ఉండేది" అని ఒకసారి అనుకొని త్వరగా తనుకూర్చున్న చోటుకి వచ్చేశాడు.

త్వరలో గుఱ్ఱాలు స్టార్టింగ్ ప్లేస్‌కి వెళ్ళున్నాయి. స్వర్ణలక్ష్మి స్వారిచేస్తున్న జాకీ, ఆరంజ్ కలర్ చొక్కా, టోపీ వేసుకొన్నాడు. తను కట్టిన గుఱ్ఱాన్ని నడిపే జాకీ, పసుపుపచ్చమీద నల్లని చారలుగల చొక్కా తొడుక్కున్నాడు. కొంచెం సేపటికి అన్ని గుఱ్ఱాలు స్టార్టింగ్ ప్లేస్‌కి చేరుకొన్నాయి. స్టార్టర్ టేప్ క్రిందికి దింపేశాడని తన ప్రక్కనేఉన్న ఒకతను బైనాకులర్ లోంచి చూస్తూ అన్నాడు.

"దే ఆర్ ఆఫ్" అన్నవెంటనే, ఆ అగపుకు ఏదో ఆలోచిస్తున్న సుబ్బారావు ఈ లోకంలోకి ఊడిపడ్డాడు. తన ప్రక్కన బైనాకులర్ లోంచి చూస్తూ ఏదో చెప్తూనే ఉన్నాడు. అది వింటూంటే ఒకసారి బైనాకులర్ని అడిగి చూడాలనిపించింది. అయినా నిగ్రహించుకొన్నాడు క్షణకాలంలో గుఱ్ఱాలు మలుపు తిరిగాయి. ఆ వెంటనే వాళ్లుకట్టిన గుఱ్ఱాలుకోసం ఎలుగెత్తి అరవసాగారు. సుబ్బారావు దృష్టిఅంతా తను కట్టిన గుఱ్ఱంపైనే ఉన్నది. అదీ స్వర్ణలక్ష్మి తక్కిన గుఱ్ఱాలనుంచి ముందుకు వచ్చింది. రెండింట్లలో ఏది గెలుస్తుందో చెప్పలేనంతగా సమానంగా పరిగెత్తసాగాయి. ఇద్దరి జాకీలుకూడా కొరడాలతో ఝుళిపిస్తూ చాలా ఉత్సాహంగా ముందుకు పోవడానికి ప్రయత్నిస్తున్నారు. చివరికి ఏది గెల్చిందోకూడ జడ్జీలు చెప్పలేకపోయారు. జనం ఏది గెల్చిందో తెలిసికోడానికి జడ్జి బాక్సువైపుకు చూసారు. సుబ్బారావుకూడా ఆందోళన


Swastik
స్వస్తిక్ పర్‌ఫ్యూమ్డ్
కాస్టర్ ఆయిల్

స్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్, బొంబాయి



పోవడంవల్ల "ఫోటో ఫినిష్‌కి" పంపించామన్నట్లు ప్రకటించారు. సుబ్బారావు పని గోడమీద పిల్లి లా అయింది ఫోటోఫినిష్‌లో ఏమవుతుందో. కంటికెదురుగా ఉన్న గుఱ్ఱం స్వర్ణలక్ష్మి, తనుకట్టిన గుఱ్ఱం అరకాల ఉంది. సుబ్బారావు తనుకూర్చున్న చోటునుండి బయటికి వచ్చేశాడు.

రేస్ కోర్సు ఆవరణలో కొంతమంది ఫోటో ఫినిష్‌లో ఏది నిలుస్తుందో వాదించుకొంటున్నారు. ఇంతలో కొంతమంది నాలవ నెంబరు గెలిచింది. అన్నట్లు అరుస్తూ, దాని మీద కట్టిన వాళ్లు కాబోలు, డబ్బు వసూలు చేసుకొందుకు పరిగెత్తసాగారు. సుబ్బారావు కూడా ఆతురతగా, జడ్జి బాక్సుకి పరిగెత్తి వాళ్ళు చెప్పినది నిజమే అని నిర్ధారణ చేసుకొని, తనుకూడా పేమెంటు కౌంటరికి వెళ్లాడు. అదృష్ట వశాత్తు అక్కడ 'క్యూ' అంత పెద్దదిగా లేదు. ముందు డబ్బు ఎంత ఇస్తుంది అని క్యూలో జనం అనుకొంటున్నారు. కౌంటర్ దగ్గర కిటికీ తలుపులపై కూలీ 10 రూపాయలకి 30 రూ "డివిడెండ్" అని వ్రాసారు.

సుబ్బారావు తన టిక్కెట్లు ఇచ్చి డబ్బు తీసుకొని ఒక్కసారి పెద్దనిట్టూర్పు వదిలాడు. తలమీదనుంచి ఎంతో బరువు లేచినట్లయింది. ఒకసారి వాచీకేసి చూసుకొన్నాడు. అయిదు కావస్తోంది. ముత్తుస్వామి వచ్చే వేళయింది. అని గేటువైపుకి చూస్తూ నిల్చున్నాడు.

నాల్గో రేస్‌కి జనం అప్పుడే టిక్కెట్లు కొనుక్కోడానికి ఎగబడుతున్నారు. ఇంతలో ముత్తుస్వామి బూట్లు చకచకలాడించుకొంటూ గేటులోకి అడుగు పెట్టాడు. అక్కడ ఒకమనిషితో ఏదో పలకరించాడు. ఆమనిషి ఏదో సమాధానం చెప్పాడు. ముత్తుస్వామి కొంచెం నిరుత్సాహపడ్డవాడిలా కనుపించాడు. ఇదంతా చూస్తున్న సుబ్బారావు ముత్తుస్వామి దగ్గరకివెళ్ళి భుజంమీద చేయి వేసాడు. ముత్తుస్వాయి వెనక్కి తిరిగి చూసి" అరెనువ్వా! మనగుఱ్ఱం గెలవలేదుటగా! ఇదిగో ఈమనిషి ఇప్పుడే చెప్పాడు నాకు అన్నాడు. సుబ్బారావు "మనకేం పర్వాలేదు. నువ్వేమి బెంగ పెట్టుకోకు. నీతో చాలాపనుంది. అలా కాంటీన్ వైపుకి వెళ్దాం" అన్నాడు.

కాంటీన్‌లో ప్రవేశించి కాఫీకి ఆర్డరిచ్చి సుబ్బారావు ముత్తుస్వాయితో "నేను నీ గుఱ్ఱం మీద డబ్బు కట్టలేదు. ఇదిగో నీ వెయ్యిరూపాయలు నాకెందుచేతనో దాని మీద కట్టాలనిపించలేదు." అని అంటూ జేబులోంచి వెయ్యిరూపాయలు తీసి ముత్తుస్వామి కిచ్చాడు. ఈలోగా సర్వర్ కాఫీ పట్టుకొచ్చాడు. సుబ్బారావు కాఫీ ఒక్క గుక్కలో త్రాగి "ఇంక మీద నేను రేస్‌లకి రావడం అరుదోయి. ఇవ్వాళ నాకు చాలా


R.S.
DAYAL
INK REGD.
దయాళ్ ఇంక్
BEST FOR ALL PENS
DAYALBAGH INK FACTORY
KAKINADA





## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవుచున్నదీ, మీ సరియైన వివరములన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామా యున్నూ వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదిలగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మూసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన ఫోకస్టు మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయుండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi ( -13) Jullundur City.





## సుఖజీవిత సేవ

భారత "సిద్ధ వైద్య మహిమ" మన దేశ సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము.

## "మేల్ మాయిల్ మందు"

ప్రపంచములో ప్రఖ్యాతి గాంచిన మేహ, కుష్ఠరోగనివారిణి

భయంకరమైన మేహ వ్యాధివల్ల కష్టపడువారలకు పునర్జన్మమిచ్చు అద్భుత సంజీవి మేహరోగ నివారణ మాత్ర, లేహ్యము.

డా॥ కే. టి. కృష్ణమూర్తి ఆచారి & సన్సు,

# నిదురలో పాప నవ్వింది



రంగనాయకమ్మగారు స్కూళ్ల ఇన్‌స్పెక్ట్రస్‌గా మా వూరు బదిలీఅయి వచ్చిందని తెలియగానే, మా ఇంటికి భోజనానికి పిలిచాను. భోజనాలు అయిపోయాక, తాంబూలాలు నములుతూ అందరం డ్రాయింగ్ రూంలో కూర్చున్నాం, నేనూ, మా ఆయనా, పాపా, రంగనాయకమ్మగారు.

"చంటిదానికి వక్కపొడి యివ్వకండీ" అన్నారు రంగనాయకమ్మగారు.

రంగనాయకమ్మగారికి ఆహార పదార్థాల విషయంలో చాలా పట్టింపు, ఏ పదార్థంలో యేగుణ ముందో, ఏ పదార్థాన్ని, ఎవరు, ఎప్పుడు తినాలో, ఆమెకు యించుమించు కంఠతా వచ్చు. "చెబితే వినదండి" అన్నా.

పాప నన్ను అనుకరిస్తూ, వినదండీ అంది వెక్కిరింపుగా. అంతే. ఆతరువాత మరెవరూ మాట్లాడ్డానికయినా వీలులేకపోయింది. పాపే అందరి తరపునా మాట్లాడేసింది; పాటలుపాడింది. నాట్యం చేసింది; నవ్విందీ ఏడ్చిందీ కూడా—వున్నట్టుండి చటుక్కున నా వొళ్లో నిదురపోయింది. వాన కురిసి వెలిసినట్లయింది. గదంతా నిశ్శబ్దం—సీలింగ్‌ఫాన్ చేస్తున్న బిరు శబ్దం తప్ప.

"ఎంత చక్కని పాప" అన్నారు రంగనాయకమ్మగారు.

పాప నిదురలో నవ్వుకొంది.

మళ్లీ రంగనాయకమ్మగారే అన్నారు "మునుపటికీ ఇప్పటికీ యెంత మార్పు వీలో!"

* * *

రెండేళ్ల క్రిందటి మాట. అప్పుడు పాప కడుపులో వుండేది. రంగనాయకమ్మగారు మా యింట్లోనే రెండో భాగంలో అద్దెకుండేవారు. ఆ రోజుల్లో ఆమె మిడిల్ స్కూలులో టీచరుగా పనిచేస్తుండేది.

ఎంచేతనో ఇపుడు చెప్పలేనుగాని, చదువుకొని ఉద్యోగాలు చేసే ఆడవారంటే, ఆ రోజుల్లో నాకు గిట్టేదికాదు. ఇక రంగనాయకమ్మగారంటే ద్వేషమో ఈర్ష్యో చెప్పలేనుగాని, ఆమెను చూస్తే వికారంగా వుండేది. దానికితోడు ఆమెకు పాఠాలు చెప్పడం ఇష్టమో ఏమిటో ఆ నేర్పంతా నా మీద ప్రయోగిస్తుండేది.

ఒకనాడు స్కూలు నుంచి యింటికి వచ్చి, తన గది తలుపయినా తీయకుండా, నేరుగా నేమన్న గదిలోకి వచ్చి, "బంగాళాదుంపలు అలాగ గుమ్మం ముందు పారేశారేమండి" అంది.

"అంతే కావాలనే నేను అలా చేసేనని దెబ్బలాడడానికి వచ్చారన్న మాట"

"అబ్బే దెబ్బలాడ్డంకోసం రాలేదండీ—ఈ బంగాళాదుంపల తొక్కలున్నాయి చూశారూ. అవి చాలా అమూల్యమయినవి. వాటిలో చాలా సత్తువ వుంది. అలా పారేయకండి" అన్నారు.

నాకు అరికాలిమంట నెత్తికంటింది. "తొక్కలూ తోళ్లూ తినేటందుకు మేమేం అడుక్కొనే వాళ్లం కాదు" అనేశా.

ఇంత విసిపించినా రంగనాయకమ్మగార్కి కోపం రాకపోయే సరికి నాకు ఆశ్చర్యం వేసింది. పైగా కొద్దిగా నవ్వుకొంది. "అరె: అసలు మాట చెప్పడమే మర్చిపోయాను. నాకు ట్రాన్స్ఫరు అయిపోతుంది వచ్చే వారమే క్రొత్తచోట జాయినుకావాలి," అంది.

నా మనసు చివుక్కుమంది. ఆమె ట్రాన్స్ఫరు కావడానికి కారణం నేనే అనిపించింది, నాకెందుకో చెప్పలేనంత పశ్చాత్తాపం కలిగింది. ఇక ఆ వారం రోజులూ మేం అక్క చెల్లెళ్లలాగ గడిపాం. ఒక్క నిమిషం ఒకర్ని విడిచి మరొకరంలేము. అయినా వారం రోజులూ ఎన్ని నాళ్లు వుంటాయి— ఇట్టే అయిపోయాయి.

రంగనాయకమ్మ వెళ్లిపోయే రోజువచ్చింది. జట్కా వచ్చి గుమ్మం ముందు ఆగింది. రంగనాయకమ్మగారు నా గదిలోకి వచ్చింది.

"రాధా... నిన్ను వదిలిపెట్టడం ఇంత కష్టమని తెలిస్తే ఏదో విధంగా ఈ ట్రాన్స్ఫరు నుంచి తప్పించుకొందును. ఏం చేయను యిపుడు లాభం లేదు. మరొక విషయం నా గదిలో కొంత సామాను వుండిపోయింది. దానినంతా పట్టికెళ్లడానికి వీలు లేదు పారెయ్యడానికి మనస్సు ఒప్పడంలా. అదీకాక నీవు నాకు చెల్లెలితో సమానురాలివి. వాటిని స్వీకరిస్తావని ఆశిస్తున్నాను" అంది.

నిజానికి అదేం తక్కువ సామాను కాదు. ఇంచుమించు నెలకు సరిపడే వెచ్చాలన్నీ వున్నాయి. తనకు ట్రాన్స్ఫరు అవుతుందని తెలియకపోవడం మూలంగా, నెలకు సరిపడిన వన్నీ కొనుక్కొంది. ఉప్పు, చింతపండు, ఉల్లిపాయలూ, పోపు సామానులూ, కిరసనాయిలూ అన్నీ వున్నాయి. వాటి మధ్య ఖర్జూరపు చెట్టు గుర్తువున్న ఒక పెద్ద డబ్బా కూడావుంది.

"ఇది 'డాల్డా' డబ్బా. అయిదు పౌనులది చూడూ అంటూ మూత తీసింది. నిజానికి డబ్బా ఇంచుమించు నిండుగానేవుంది.

"అవును సీలు విప్పి నాలుగు రోజులుకూడా కాలేదు" అంది. దానిని తీసుకొనడానికి ఎంచేతనో నాకు సంశయమేసింది.

"నీవు సంశయపడుతున్నట్టున్నావు — ఎంచేత? అంది రంగనాయకమ్మ.

"ఎప్పుడూ 'డాల్డా' వాడలేదు ఏమవుతుందో ఏమిటో?" అన్నా

"నీవు ఆ విధంగా భయపడనక్కర్లా. డాల్డాను పరిశుద్ధమయిన నూనెలతో, అతి పారిశుద్ధ్యంగా తయారుచేస్తారు. విటమిను 'ఎ', విటమిను 'డి' దానికి చేరుస్తారు" అంది.

"విటమినులు అంటే ఏమిటి?" అని నేను అడిగా.

"ఈ విటమినులు అంటే నీకు తెలియదా? అవి మన ఆరోగ్యానికి చాలా ముఖ్యం, 'ఎ' విటమిన్ మనకు జబ్బుల్ని ఎదుర్కొనే శక్తిని యిస్తుంది. అంతేకాక ఇది కళ్లకూ, చర్మానికీ మంచిది. 'డి' విటమిను పండ్లనూ, ఎముకలనూ దృఢం చేయడంలో సహాయపడుతుంది.

"'డాల్డా' నిజంగా అంత మంచిదా?" అన్నా ఆశ్చర్యంతో.

"ఎందుకుకాదు. అనేక సంవత్సరాలుగా నేను 'డాల్డా' ఉపయోగిస్తున్నాను. కావలిస్తే నన్ను చూడు. మరొక మంచి విషయం ఏమిటంటే యిది నీ కెప్పుడూ పరిశుద్ధంగా, తాజాగా దొరుకుతుంది. దానికి కారణం ఏమిటంటే ఇదెప్పుడూ సీలు వేసిన డబ్బాలలోనే అమ్మబడుతుంది. అంచేత— కుళ్లు, మురికీ దీనిని తాకేందుకు అవకాశం లేదు."

బయట నుంచి జట్కావాడు కేకపెట్టాడు.

"ఖర్జూరపు చెట్టు గుర్తుగల ఈ డబ్బా, మన స్నేహానికి చిహ్నంగా నీతోనే వుండిపోతుందని ఆశిస్తున్నాను" అంటూ రంగనాయకమ్మగారు చిరునవ్వు ముఖంతో ఎంతో అప్యాయంగా నా నుంచి శలవుతీసుకొంది. ఆ నవ్వు నా జీవితంలో ఒక పెద్ద మార్పు తీసుకొచ్చింది.

* * *

"అవును రంగనాయకమ్మగారూ నేను మారిన మాట నిజమే. బహుశా మీకు గుర్తుందో లేదో— ఈ మార్పుకు కారణం మీరే" అన్నా.

"అదేంమాట" అన్నారు రంగనాయకమ్మగారు.

"మీరు బదిలీ అయి వెళ్లిపోతూ నాకు చెప్పిన విషయాలు గుర్తు లేదూ. సమగ్ర ఆహారం గురించీ, విటమిను గురించీని. ఆ తరువాత ఎందర్నో అడిగి ఎన్నో విషయాలు తెలుసుకొన్నా. మీరు 'డాల్డా' డబ్బా వదలి వెళ్లారు గుర్తుందా. మళ్లీ నేను 'డాల్డా' వదల్లేదు. ఇప్పుడయినా తెలిసిందా నాలో కనబడుతున్న మార్పుకు మీరేవిధంగా కారణమో?"

అంతవరకూ కదలకుండా కూర్చున్న మా ఆయన అందుకొని "లోగడ మీ గుమ్మం ముందు పారవేసిన బంగాళాదుంపల తొక్కలు యివ్వాళ మీ ప్లేట్లో ప్రత్యక్షమయ్యాయి— గమనించారో లేదోకాని" అన్నారు.

అందరం విరగబడి నవ్వుకొన్నాం. నిదురలో పాప కూడా నవ్వింది.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్, బొంబాయి.



# జోగిపంతులు ఆత్మశాంతికి..

వేదుల కామేశ్వరరావు

మండు వేసవి. మిట్టమధ్యాహ్నం. ఎండ నిప్పులు చెరుగుతోంది. ఆఫీసు గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది. ఆఫీసరు ఉలిక్కిపడి లేచాడు. చుట్టూవున్న వాతావరణాన్ని పరీక్షగా చూశాడు. గుమాస్తాలు తమతమ పనుల్లో నిమగ్నులై వున్నారు. కొందరు ఫైళ్ళల్లో తలలుదూర్చి "నా కింకేమీ పట్టదు" అన్న ధోరణిలో కావలసిన విషయాలకోసం కళ్ళు వొత్తుల్లా చేసుకొని చూస్తున్నారు. కొందరు కొన్ని కాగితాలకు నకళ్ళు తీస్తున్నారు. కొందరు క్రొత్త కాగితాలు టైపు చేస్తున్నారు. చప్రాసీలు హడావిడిగా తిరుగుతున్నారు. ఆ ఆఫీసు చూస్తే మరో ప్రపంచంలా కనబడుతుంది. ఊరికే ఎండలు నిప్పులు చెరుగుతోందని పేపరుల్లో మనవి చేశాను గాని బయట ఎండ కాస్తోందో, వాన కురుస్తోందో, పిడుగులు పడుతున్నాయో ఆఫీసులో వాళ్ళకి తెలియదు.

ఉన్నట్టుండి ఒక్కసారి ఆఫీసరుగారి సింహగర్జన వినిపించేసరికి గుమాస్తాలందరూ పాములవాడి బుట్టల్లోని పాములకి మల్లే పడగలువిప్పి ఆఫీసరుగారిని వినయవిధేయతలతో తదేక దీక్షతో చూశారు.

"జోగిపంతులు ఆఫీసుకు రాలేదా?" ఆఫీసరు గట్టిగా అరిచాడు.

గుమాస్తాలందరూ ఒకళ్ళముఖా లొకరు చూసుకొన్నారు. జోగిపంతులు ఆఫీసుకు రాగానే ఆఫీసరుగారికి సలాం కొట్టనిదే సీటులోకి వెళ్ళడు. అందుచేత జోగిపంతులు ఆఫీసుకు వచ్చిందీ, లేనిదీ ఆఫీసరుగారికే బాగా తెలుస్తుంది. జోగిపంతులు సీటు కిరువైపులా రెండు పెద్ద పెద్ద బీరువాలున్నాయి. ఆ బీరువాలనిండా కావలసిన ముఖ్యమైన రికార్డు వుంటుంది. సీనియరు గుమాస్తా అవటంవల్ల కావలసిన ముఖ్యమైన కాగితాలన్నీ జోగిపంతులు దగ్గరే పెట్టబడ్డాయి. ఆ రెండు బీరువాల టేబిలుకు ముందు జోగిపంతులు సీటూ, వెనుకవైపున రెండు షెల్ఫులూ వుంటాయి. జోగిపంతులు ఈ ఆకీకారణ్యంలో చిక్కుకొంటాడు టంచన్‌గా పదిగం. లకే. అతను తనసీటులో కూర్చుంటే ఇంకెవ్వడికీ కనిపించడు. అందుచేత క్రొత్త గుమాస్తా రామనాథం వెళ్ళి ఆ బీరువాలమధ్యకు తొంగి చూశాడు. అక్కడ సీటులో జోగిపంతులు లేడు! ఆ విషయమే అతడు ఆఫీసరుకు చెప్పాడు.

ఆఫీసరు తల పంకించాడు. రామనాథం తన సీటులో కూర్చున్నాడు. మళ్లీ పాముల వాడు బూరా ఊదటం ఆపగానే పాములు బుట్టల్లోకి జారుకొన్నట్టు గుమాస్తాలు ఫైళ్ళల్లో తలలు దూర్చారు! కొద్ది క్షణాలలోనే సూదిపడితే చప్పుడయ్యేటంత నిశ్శబ్దం ఆ ఆఫీసును ఆవరించింది. గోడ గడియారం టిక్ టిక్ శబ్దం తప్ప ఇంకేమీ వినిపించటం లేదు. ఇంతలో పాములు పడగలువిప్పాయి. ఎవరో అబ్బాయి పరుగెత్తుకొనివచ్చి ఆఫీసరు గుమ్మంలో వగరుస్తూ నిలబడ్డాడు.

"ఎవరబ్బాయివి నువ్వు?" అని ప్రశ్నించాడు ఆఫీసరు.

ఆ అబ్బాయికి పద్దెనిమిది సంవత్సరాలుంటాయి. మైనారిటీ వదిలిన జాడ లెక్కడా కనిపించటం లేదుగాని ముఖంలో ఒక ప్రస్ఫుటమైన అనుభవం కనబడుతోంది. జీవితంలో పడిలేచిన ముసలివాని ముఖంలా వుంది అతని ముఖం. ఈ కొద్దికాలంలోనూ, అనగా అంత చిన్నతనంలోనే ఇంత కష్టసుఖాలతో కాకలుతీరిన అనుభవజ్ఞుడు ఎవరీ అబ్బాయి? అని పాముపడగలు తర్కించుకొన్నాయి.

"నేను జోగిపంతులుగారబ్బాయినండి" అని చెప్పాడు వాడు.

"మీ నాన్న నిన్నమధ్యాహ్నం మనగా వెళ్ళిపోయాడు. అర్జంటుగా కావలసిన రెండుకాగితాలు కావాలని చెప్పాను. 'వెతికిస్తాను సార్!' అన్నాడు. పోవటం శెలవుచీటీ పంపించాడా?" అనడిగాడు ఆఫీసరు.

"శెలవుచీటీ ఏమిటి సార్! నిన్న అసలు మానాన్న ఇంటికిరాలేదు. మా అమ్మ అందుకే నన్నిక్కడికి పంపించింది" అని చెప్పాడు కుర్రాడు.

మధ్యమధ్యన ఫైళ్ళల్లో దూరుతున్న పాముపడగలన్నీ ఒక్కసారిగా పడగలువిప్పి బుసలుకొట్టాయి.

"జోగిపంతులు పరారీ! ఇదే అందరి నోళ్ళ నుండీ వెలువడినమాట.

"పరారీ కాదుసార్! అక్షరాలా మేమనుకొన్నట్టే చేశారు మానాన్న. మొన్న సాయంత్రం ఇంట్లో పెద్దకొట్లాట జరిగిందండి. మా అమ్మ 'ఈ సంసారం ఈదలేనం'దండి. 'తొంభైరూపాయలతో ఎలా చచ్చిపోనూ?' అని ప్రశ్నించిందండి. అప్పులవాళ్ళు రోజూ పీక్కుతింటున్నారండి. నేను హుస్సేన్‌సాగర్‌లో పడిఛస్తానన్నాడండి. ఊరికే అన్నాడనుకొన్నాం... హెంతపని చేశావునాన్నోయ్!" అంటూ ఒరాగంతీసి కుర్రాడు గబగబా ఇంటివైపు పరుగెత్తాడు.

"సార్! ఇందాకా నేను ఆఫీసుకు వస్తుంటే హుస్సేన్‌సాగర్ నుంచి శవాన్ని తీస్తున్నారండి. సరిగ్గా జోగిపంతులులాగే వున్నాడు. బూడిదరంగు కోటే తొడుక్కొన్నాడండి" అని పాతగుమాస్తా హనుమంతయ్య చెప్పాడు.

*　　*　　*

మరుసటి రోజున ఆ ఆఫీసులో జోగిపంతులుగారి ఆత్మశాంతికోసం ఒక సంతాప సభ జరిగింది. ఆఫీసరు సభకు అధ్యక్షత వహించారు. నలుగురైదుగురు గుమాస్తాలూ హాజరయ్యారు. పదినిముషాలు అందరూ విచారంగా నిలబడి నిశ్శబ్దంగా జోగిపంతులుగారి ఆత్మశాంతికోసం దేవుణ్ని ప్రార్థించారు.

ఆఫీసరు ఉపన్యాసం ప్రారంభించాడు. "సోదరులారా! జోగిపంతులువంటి నమ్మకమైన వ్యక్తిని ఇప్పటివరకూ నేనెక్కడా చూడలేదు. ఆయనలో వున్న సహనం నేనెక్కడా ఎవరిలోనూ చూడలేదు. రికార్డు కీపింగులో ఆయనది అందెవేసిన చెయ్యి. ఈ ఆఫీసు రికార్డుల్లో ఎక్కడ ఏది వుందో ఆయనకి తెలుసు. నాకు కూడా తెలియని కొన్ని విషయాలు ఆయన రికార్డు చేసి పెట్టాడు. మొన్న మధ్యాహ్నం ఆయన్ని పిలిచి క్రిందటి సంవత్సరపు పెట్టుబడి ఖాతా కావాలని అడిగాను. అది ఆడిటర్ దగ్గరనుంచి తిరిగివచ్చిందీ లేందీ తనకు తెలియదనీ, అయినా వెతికి చూస్తాననీ చెప్పాడు. కనీసం దాని కాపీ అయినా వెతికి ఇస్తానన్నాడు. కాని ఇంతపని జరుగుతుందనుకో

సాగించాడు.

ఉపన్యాసం ముగిస్తూ "జోగిపంతులుగారి ఆత్మశాంతికోసం దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. వారి సంసారానికి సానుభూతి తెలుపుతున్నాను. దహన సంస్కారాలకోసం ఆఫీసు డబ్బు పాతిక రూపాయలు మంజూరు చేశాను" అని చెప్పాడు ఆఫీసరు.

పాతగుమాస్తా హనుమంతయ్య ఉపన్యాసం ఇవ్వలేదుగాని తను చూసిన విషయాన్ని అందరికీ చెప్పాడు. నిన్న సాయంత్రం కోఠీ దగ్గర జోగిపంతులు కనుపించాడుట. ముఖం వ్రేలాడేసుకొని బూడిదరంగు కోటు తొడుక్కొని విచారంగా నడిచి వెళుతున్నాడుట, ఆ పొడుగూ, బక్కపలచటి శరీరం, అక్కడక్కడ నెరిసిన జుట్టు వెంట్రుకలూ, అతను తప్పకుండా జోగిపంతులేనట. సరే, ప్రొద్దున్న తను ఆఫీసుకు వస్తుంటే హుస్సేన్ సాగర్ లోనుంచి శవాన్ని బయటకు తీస్తున్నారుట. మళ్ళీ అదే బూడిదరంగు కోటు! తన కళ్ళను తానే నమ్మలేక పోయాడుట." కాని మనిషిని పోలిన మనిషి వుంటాడేమో అని ఊరుకొన్నాను సార్! లేకపోతే ప్రొద్దున్నే చెప్పేద్దును అందరికీ" అన్నాడు హనుమంతయ్య ఆఫీసరు నుద్దేశించి.

"పాపం పెద్దబ్రాహ్మడు" అన్నారు కొందరు.

"పోనలుముల్లా మేలనుకోరా రామబ్రహ్మం! ఉండి ఏం సుఖపడి చచ్చాడు లెద్దూ! అనకూడదుగాని అలాంటి వాళ్ళసలు చచ్చి సుఖపడతారు" అన్నాడొక ముసలి జంబుకం.

"కాని...ఏం మనిషి! ఏం మనిషండీ! ఆఫీసుకు టంచన్‌గా పదయ్యేప్పటికే వెళ్ళేవాడు. తను నిజంగా సంసారం ఏమవుతోందో చూశాడా! తన ప్రాణాలను ఆఫీసుకర్పించాడు" అన్నాడొక సానుభూతిపరుడు.

ఇంకా ఎవరెవరే విధాలుగా తమ అభి



స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకు
లోధ్ర
కేసరి కుటీరం
ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14
ఆంధ్రప్రదేశ్ ఏజంట్లు
మెసర్సు సీతారామాంజనేయ స్టోర్సు ఏజెన్సీస్
విజయవాడ, సికిందరాబాదు.



నమ్మకమైన నంజన్‌గూడు
బాలురకు నిత్యావశ్యకములు
కాసిమస్ కస్తూరిమాత్రలు.
జింజిప్ జీర్ణవృద్ధికి, పిత్తశాంతికి
కర్జన్ గోరోజనమాత్రలు.
జ్వరేగ్ సకల జ్వరములకు.
బాలక్స్ విరేచనమాత్రలు
కాలరెక్సు కలరా, అజీర్ణభేదులకు
తదితర మందులకై మాకు వ్రాయండి.
నంజన్‌గూడు-పళ్ళపొడి
బ్రాంచి: విజయవాడ.



అధైర్యపడవద్దు
శాస్త్రీయమైన, నిజమైన SEX— ADVICE పొందవచ్చును. మీకు ఉండుకొన్న లక్షణములు వ్రాయుచూ, యింకా వివరాలకు కవరు పంపేది.
డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904) మలక్‌పేట బిల్డింగ్స్, అజంపూరా మార్కెట్ వద్ద హైదరాబాద్ (దక్కన్) 2. AP.



కుమారి మాత్రలు (Regd)
ఋతుకాలములో అనేక బాధలుపడే స్త్రీలకు అనుకూలమైన ఔషధం సాదా రు. 3. స్పెషల్ రు. 6. ఎక్స్ట్రా స్పెషల్ రు. 8. పెద్ద మందుల షాపులన్నింటిలో దొరుకును.
P. Devee & Co.. (AP) Calcutta 40


# ★ జోగిపంతులు ఆత్మశాంతికి ★

ప్రాయాలను వెలిబుచ్చారో చెప్పి మిమ్మల్ని విసిగించ దలుచుకోలేదు గాని, ఒక్క విషయం మనవిచేసి ఊరుకొంటాను. సానుభూతి చూపించిన వాళ్ళెవ్వరూ జోగి పంతులు దహన సంస్కారానికి దమ్మిడీ సహాయం చెయ్యలేదు. ఆఫీసరు మంజూరుచేసిన 'ముష్టి పాతిక రూపాయలూ' జోగి పంతులుగారి మరణానంతరం మూడురోజుల వరకూ ఆయన కుమారునికి చేరలేదు. జోగి పంతులుగారబ్బాయికి ఆఫీసరు దహన సంస్కారంకోసం ఇచ్చిన పాతిక రూపాయలూ, దారిలో కిరాణాకొట్టు వాడు డబాయించి పుచ్చుకొని, పాత బాకీకోసం జమ కట్టుకోవటం కూడా జోగిపంతులుగారి పరోపకార లక్షణాన్ని దేశానికి విప్పి చెప్పింది.

ఈ విధంగా, జోగి పంతులుగారి చావు ఘట్టం ముగిసింది; దాని తాలూకు సందడి తగ్గింది.

* * *

ఇంకో రెండు రోజులు గడిచాయి. జోగి పంతులు పనిచేసిన ఆఫీసులో క్రొత్త గుమాస్తాను చేర్చుకొన్నారు. క్రొత్త గుమాస్తా సత్యనారాయణ జోగిపంతులుగారి స్థానాన్ని భర్తీచేశాడు. శుభముహూర్తం చూసుకొని అతను ఆఫీసులో అడుగు పెట్టాడు.

సత్యనారాయణను పిలిచి ఆఫీసరు ఇలా చెప్పాడు: "నువ్వు ఆఫీసుకు సరిగా పదిగంటలకు రావాలి. ఆరుగంటలవరకూ సీటులో నుంచి కదలడానికి వీలులేదు. నువ్వెవరి స్థానంలో వచ్చావో తెలుసా? జోగిపంతులు స్థానంలో! జోగిపంతులెవరో తెలుసా? డెబ్భై రూపాయల జీతంలో ఈ ఆఫీసులో 20 సంవత్సరాల క్రితం ప్రవేశించి, సంవత్సరానికి ఒక రూపాయ ఇంక్రిమెంటు చొప్పున ఢాచేసి తొంభై రూపాయల జీతం సంపాదించిన గుమాస్తా. ఎంత పనున్నా అతను విసుక్కోలేదు. జీతం చాలదని ఆఫీసు మానలేదు. మానేస్తానని ఎన్నడూ ఎవరినీ బెదిరించలేదు. ఆయన స్థానంలో నువ్వొచ్చావు. ఆయన గుణాల్ని అలవాటు చేసుకోవాలి. వెళ్ళు. ఆ రికార్డు బీరువాల వెనకాల నీ సీటు వుంటుంది. అందులో కూర్చో," ఇది ఆఫీసరు క్రొత్తగా వచ్చిన గుమాస్తాకు చేసిన హితబోధ.

జోగి పంతులుగార్ని తలుచుకొంటూవెళ్ళి ఆయన సీటులో కూర్చొన్నాడు సత్యనారాయణ. పాత గుమస్తా హనుమంతయ్య తొంగి చూసి, లోపలకొచ్చాడు. 'ఆఁ. వచ్చావూ! నీకో విషయం చెప్పాలనుకొన్నానులే. నేని ఆఫీసుకు సీనియరు గుమాస్తాని. నువ్వు జోగి పంతులుగారి స్థానంలో ఈ ఆఫీసుకు తేబడ్డావు. జోగిపంతులు ఎవరో తెలుసా? గుమాస్తా జాతికి ప్రతినిధి నిష్కల్మషమైన ప్రభుభక్తి పరాయణుడు. ఆఫీసరుగారి మన్ననలను పొందిన అద్వితీయుడు!..," ఇంకా బగువుమాటల కోసం తడుముకొంటూ హనుమంతయ్య బయటకు వెళ్ళాడు.

"జోగిపంతులు పేరు నిలబెట్టాలి సత్యనారాయణా" అని అరిచాడు అతడు ఈ ఆఫీసులో చేరటానికి ఉపకారం చేసిన ఇంకో గుమాస్తా.

"రికార్డు క్లీపింగులో జోగి పంతులుగారి గొప్పతనాన్ని పొందాలి" అన్నాడు ఇంకొడు.

"నేను మొన్న నే వొచ్చినా, జోగి పంతులుగార్ని గురించి అంతా తెలిసిపోయింది. అహాఁ! ఏం మహానుభావుడండి!" అని సూచించాడు రామనాథం.

సత్యనారాయణకు తల తిరిగింది. తను జోగిపంతులులా తయారుకావాలిట. గుమాస్తాలవైపు వెర్రిగా చూసి ఫైళ్లు ఇటూ అటూ సర్దటం నేర్చుకోవడానికి సిద్ధమయ్యాడు అతగాడు. గుమాస్తాలు తమతమ సీట్లలోకి సర్దుకొన్నారు.

ప్యూన్ వచ్చి సత్యనారాయణముందు నిలబడ్డాడు. "ఊఁ. చెప్పు, జోగిపంతులుగార్ని గురించి నువ్వు చెప్పగలవా?" అని ప్రశ్నించాడు. సత్యన్నారాయణ లేని ధైర్యాన్ని తెచ్చుకొని, "అబ్బే, లేదండి! ఆయన కేంటండి మహానుభావుడు! మిమ్మల్ని ఆఫీసరుగారు పిలుస్తున్నారండి" అని చెప్పి ప్రక్కకు తప్పుకొన్నాడు ఫ్రాసీ.

సత్యనారాయణ ఆఫీసరుగారి గదిలో ప్రవేశించాడు. "చూడు సత్యం! నాకు క్రిందటి సంవత్సరపు పెట్టుబడి ఖాతా కావాలి. అది ఆ ఫైళ్ళలో ఎక్కడో వుంటుంది. అది తెమ్మని మొన్న జోగి పంతులుకు చెప్పాను: కాని ఈ అవాంతరం ఊఁ... సరేలే కాని, వెళ్లి ఆ ఖాతా తీసుకురా!" అన్నాడు ఆఫీసరు.

సత్యనారాయణవెళ్ళి సీటులో కూర్చొన్నాడు. పెట్టుబడి ఖాతా కావాలిట. అది ఏమిటో అతనికి తెలియదు. కాని ఈ ఆఫీసర్లు మొండిగా ఆర్డర్లు ఎలా చేస్తారా? అని అతనికి సందేహం కలిగింది. కాని తనలా బాధపడకూడదు. ఇరవై సంవత్సరాల క్రితం జోగిపంతులు ఈ విధంగా బాధపడ్డాడా? పడివుండడు. ఆయన మహానుభావుడు'

సత్యనారాయణకేమీ పాలుపోవటంలేదు

తను ఆ కాగితాన్ని ఆఫీసరుకు ఇవ్వాలి. అంతా వెతికి దాన్ని పట్టుకోవాలి. అతడు కార్యసాధకునిలా లేచాడు. "జై జోగి పంతులూ! ఆవేశించు నాలో" అన్నాడో లేదో కాని "జోగిపంతులు ఇరవై సంవత్సరాల వెనుక ఇలా నే లేచి వుంటాడు కాబోలు," అనుకొన్నాడు.

సత్యనారాయణ ఎగురుగా ఫైళ్ళు మనిషెత్తున పేరుకొని వున్నాయి అతడు ఒక ఫైలును బయటకు తీశాడు. ఇంకో ఫైలుతీశాడు. ఆశ్చర్యం! తననుతనే నమ్మలేక పోయాడు ఫైళ్ళల్లోనుంచి మూలుగు వినబడుతోంది. జోగిపంతులుకు ఈ మూలుగు వినబడేదా? అతడు ఆలోచించాలనుకొన్నాడు. కాని వ్యవధిలేదు. మూలుగు పెద్దదయింది. వణుకుతున్న చేతులతో ఇంకో రెండు ఫైళ్ళు పీకాడు. మనిషి ఆకారంలో ఏదో బయటకు వస్తోంది! "అమ్మబాబో!" అని ఒక్క కేక పెట్టి అందులోంచి బయటపడాడు

గుమాస్తాలందరూ కంగారుపడి ఆఫీసరు గదిలోకి పరుగుతీశారు. మనిషిలాంటి ఆవస్తువు కదిలింది కదిలికదిలి ఆఫీసరుగూమునగుకొంది. అప్పటికే అందరికీ పైప్రాణాలు పైకిపోయాయి, ఒళ్ళలకి మళ్లే గోడని అంటిపెటుకొని వున్నారు.

మనిషిలాంటి వస్తువు జోగిపంతులు పోలికలోవుంది. జోగిపంతులు అస్థిపంజరంలా వుందది. "దొరుకుతుంది సార్! దొరుకుతుంది! ఎక్కడ కెళుతుంది? జోగిపంతుల్ని తప్పించుకొని ఏ కాగితమూ బ్రతకలేదు. అరగంట వ్యవధి కావాలిసార్! మీరేమీ అనుమానపడకండి. కాగితం దొరుకుతుంది!" అస్థిపంజరం గట్టిగా అరిచింది.

చేష్టలుడిగిన గుమాస్తా సోదరులు అస్థిపంజరం కాళ్ళమీద పడ్డారు. ఆఫీసరు కూడా "జోగి పంతులూ!" అని అరిచి అస్థిపంజరం కాళ్ళమీద పడాడు.

కాని "దొరుకుతుంది" అన్న ధ్వని ఆఫీసును మారు మ్రోగిస్తోంది. ఆఖరి సారిగా అస్థి పంజరం "దొరుకుతుంది సార్" అని గట్టిగా అరిచి ఆఫీసరు బల్లమీద కూలబడి పోయింది!

జోగిపంతులు చచ్చి దెయ్యమైవచ్చి ఆఫీసరును భయపెట్టాడో, లేక ఫైళ్ళు వెతుకుతూ వాటిలోపడి, కదలలేక, కాగితం దొరక్కుండా చచ్చిపోవటం ఇష్టంలేక ఈ రకంగా తయారయ్యాడో, లేక కాగితం దొరకలేక చచ్చిపోయి, ఆఫీసర్ల వల్ల గుమాస్తా జాతిపొందుతున్న ఈతి బాధల్ని చెప్పటంకోసం బ్రతికి మళ్ళీ చచ్చాడో చెప్పకుండా ఈ కథ ముగిస్తున్నందుకు క్షమించండి. ఈ వివరాలను నిజస్వరూపంలో బయట పెట్టగలంగులకు ఏ "డిటెక్టివ్"నూ లేగల సామర్థ్యం కూడా నాలోలేదు. కాని ... ఒక్క విషయం మనవిచేస్తా!

కడగండ్ల ననుభవించలేక మొన్న సాయంత్రంనుంచి ఇప్పటివరకూ నరకబాధ ననుభవించిన జోగిపంతులు ప్రాణవాయువు అనంతవాయువులలో కలిసిపోయింది గాని, ఆఫీసరు మంజూరుచేసిన పాతిక రూపాయలతో ఆయన ఆత్మశాంతి జరగటం అసంభవం!



రీటా కురుల్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్ తల వెంట్రుకలు రాలుట. నెరయుట, చుండ్రు బట్టతల, పేనుకొరుకు ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును వేనకు వేలవాడి గుణమును పొందియున్నారు. మీరు కూడ నేటినుండియే రీటా వాడుడు
రీటా హిందూ దేశమంతటా దొరకును
కేశ సంపదకు
రీటా

PAKCO పాకో స్లో-స్పీడ్, కోల్డు స్టార్టింగ్ క్రూడ్ ఆయిల్ ఇంజనులు
—: ప్రత్యేక లక్షణములు :—
* పనిచేయ ప్రారంభించుట తేలిక
* తక్కువ ఇంధన ఖర్చు
* క్రమమైన నడక
* దిట్టమైన నిర్మాణం
* ఎక్కువ మన్నిక
* అద్భుతంగా పనిచేయును
* ఫాస్క ఫ్యూయల్, ఇంజక్షన్ పరికరములు




మద్రాసు ఆంధ్ర, కర్ణాటక, కేరళ రాష్ట్రములకు ఏజెంట్లు.
Grams: "LAMP" K. S. SHIVJI & CO., (Estd 1903)
Phone 3617 పోస్టు బాక్సు నెం. 8, 178 79 బ్రాడ్వే, మద్రాసు-1.

# అన్వేషణ

**పోతుకూచి సాంబశివరావు**

(గతవారం తరువాయి)

తప్పనిసరిగా లక్ష్మిని హోటలుకు తీసుకు వెళ్ళాడు శివరాం భోజనానికి. ఆ నగర వాతావరణమంతా లక్ష్మికి మిరుమిట్లు గొలిపింది. నగర వీధుల్లో వింతిగా అన్నను అనుసరించింది.

తన బాధలు తనకున్నా, శివరాంకు అతని చెల్లెలుకు తాత్కాలికంగా వంట చేసుకు నే వసతులు, అవకాశాలు యివ్వమని తల్లికి పురమాయించేడు కోమటి యజమాని.

తీరుబడి ఉన్నప్పుడు ఊభయ నగరాలు చూపించాడు శివరాం చెల్లెలుకు. నగర కట్టడాలు – వింత సంస్కృతి – పబ్లిక్ గార్డెన్సు – సాలార్ జంగ్ మ్యూజియం – మక్కా మసీదు – చార్ మినార్ – నగర వైభవానికి మూలకందాలుగా ఉన్నాయి. ఆ వింత ప్రదేశమంతా చూడగలిగినందుకు తన్నభినందించుకుంది లక్ష్మి.

పగలు ఆఫీసుకు శివరాం వెళ్ళినప్పుడు, లక్ష్మి కోమటి యజమాని తల్లితో కబుర్లు చెప్పి, కథలు పత్రికలు చదివి కాలం వెళ్ళబుచ్చేది. సాయంత్రం అన్నతో కలిసి ఏదో ప్రాంతానికి షికారుకు వెళ్ళేది.

ఒకరోజు నారాయణ పార్కులో కనిపించాడు శివరాంకు. ప్రక్కనున్న లక్ష్మిని చూసి, "పెళ్ళయిపోయిందేమిటోయ్!" ప్రశ్నించాడు కొంప మునిగిపోయినంత నిరాశా భావంతో.

"మా చెల్లెలు లక్ష్మి!" శివరాం పరిచయం చేశాడు నారాయణకు లక్ష్మిని.

"ఎప్పుడొచ్చావమ్మా!... అదేమిటోయి ...మా యింటికి తీసుకురాలేదే!...అంతా సంతోషించేవాళ్ళం.. రేపు తప్పకుండా రామ్మా!...భోజనానికి కూడాను.. అత్తా రేవూరుకు?" మాటలు శరపరంపరల్లా విసిరాడు నారాయణ:

"ఈమెకు కూడా పెళ్ళి మీరే చెయ్యాలండి!" నవ్వాడు శివరాం.

"ఆ భారం నామీద వదలవోయి...ఒక్కరోజులో సంబంధం తెచ్చి ముడివెయ్యనూ?" పకపక నవ్వాడు నారాయణ.

పురాతన తరాలద్వారా తన తల్లితండ్రులకు బ్రహ్మయ్యగారి వంశానికి ఉన్న సంబంధబాంధవ్యాలు ఏకరువు పెట్టాడు నారాయణ. అతను చెప్పే బాంధవ్యాల మెలికలు అర్థం కాకపోగా వింటున్నట్లు నటిస్తూ రేడియో గీతావళిపై చెవులు ఒగ్గించాడు అన్నా, చెల్లెళ్ళు. రేడియో ఆగిపోయినట్లే నారాయణకూడా తన ఉపన్యాసం ఆపేసి అన్నా చెల్లెళ్ళను మళ్ళీమళ్ళీ తన గృహానికి రమ్మని ఆహ్వానించి వెళ్ళిపోయాడు.

మర్నాడు చెల్లెలు బలవంతంమీద నారాయణ యింటికి వెళ్ళక తప్పలేదు శివరాంకు. ఈసారి వీధి గుమ్మంలోనించే వెళ్ళాడు చెల్లెలుతో. మేడఎక్కి ఎవరూ కనిపించకపోగా తిన్నగా గదిలోకి గనువుగా నడిచాడు శివరాం. ఆ క్రొత్త ప్రదేశంలో జంకుతూ వెనక నిలిచిపోయింది లక్ష్మి. ముందు కదిలిన శివరాం గది ద్వారంవద్ద ఆశ్చర్యంతో ఆగిపోయాడు. సత్తెమ్మ ఎవరో కళ్ళజోడు పెద్దమనిషితో సరసాలాడుతోంది. శివరాంను చూసి ముఖం మార్చుకుని, గబుక్కున నవ్వి చేతిలో కాఫీకప్పు పుచ్చుకుని, "రావోయి!...ఎన్నాళ్ళకు వచ్చావు మా యింటికి!" అంటూ ఆనందం వెలిబుచ్చి శివరాం చెల్లెలును చూసి గబగబ వెళ్ళి ఆలింగనం చేసినంతపని చేసింది సత్తెమ్మ. ఆమె తత్వం శివరాంకు అసహ్యం కలిగించినా వచ్చిన తర్వాత మర్యాదగా మాట్లాడి పోవాలని గదిలో కూర్చున్నాడు. ఆ కళ్ళజోడు పెద్దమనిషి శివరాంను చూసి లేచాడు తన పని పూర్తయినట్లు. "నారాయణ వచ్చాక నేను వచ్చి వెళ్ళానని చెప్పు!" అంటూ సత్తెమ్మవైపు తిరిగి నిష్క్రమించాడు ఆయన.

"మాకు బావగారౌతారు వరుసకు...... ఆయనకు ఆ ప్రమిత్రులు!" పలికింది సత్తెమ్మ ఆ కళ్ళజోడు పెద్దమనిషిని పరిచయం చేస్తూ. లక్ష్మి తనయింటికి రావడంవల్ల ఆ రోజు పండుగ దినంలా భావిస్తున్నానని, తన భర్త తామ వస్తారన్న సంగతి చెప్పారు. యింట్లో నని, అనివార్యమైన అర్జంటు పనివల్ల బయటకు వెళ్ళారని, ఏక్షణంలోనైనా వచ్చేయడం తథ్యమని, ఇంకా యేదో ఉపన్యాసం విసిరింది సత్తెమ్మ. శివరాం ముభావంగా మాట్లాడాడు. లక్ష్మి చలాకీగా మాట్లాడింది దూరపు బంధువురాలు ఒకతె దొరికిందని. తన యింట్లో కొన్నాళ్ళు ఉండి పొమ్మని బలవంతం చేసింది సత్తెమ్మ లక్ష్మిని. అలాగే నని మర్యాదకు ఒప్పుకుని అన్నా చెల్లెళ్ళు ఆమెదగ్గర సెలవు తీసుకొని యింటికి వచ్చేశారు. తాను చూసిన దృశ్యం గురించి చెల్లెలుకు చెప్పలేదు శివరాం.

చెల్లెలును గండిపేట తీసుకువెళ్ళాలని శివరాం రాజారావుతో చెప్పాడు. ఒక స్నేహితుడికారు తీసుకువచ్చాడు రాజారావు. ప్రొద్దున్న పదిగంటలకు బయలుదేరుతున్నారు అన్నా చెల్లెళ్ళు రాజారావుతో. ఎదురుగా నారాయణ, వారియింట్లో చూసిన కళ్ళజోడు పెద్దమనిషి వీధిగుమ్మం ముందు ఎదురయ్యారు. తరువాత మళ్ళీ కలుసుకుంటామని చెప్పి నారాయణను సాగనంపి, కారులో కూర్చున్నాడు శివరాం. నారాయణను కళ్ళకుకట్టాయి మొన్న నగరంలోకివచ్చి తనకంటె ఎక్కువ పలుకుబడిగల స్నేహితులను సంపాదించుకున్నాడని. పరాయి మొగవాడితో తన చెల్లెలును షికారుకు తీసుకువెడుతున్నాడనే విషయం వేలెత్తిచూపించాడు కళ్ళజోడు పెద్దమనిషి నారాయణకు. నారాయణ సన్నటితెరలలో ఏదో పురుగుదొలిచినట్లయింది.

మర్నాడు ప్రొద్దున్నే ఆయిద్దరు శివరాం యింటిముందు వాలారు. శివరాం ముభావంగా మర్యాదగా ఆహ్వానించాడు వారిద్దరినీ. లక్ష్మి ఇంట్లోంచి రెండుకప్పుల కాఫీ తెచ్చింది. కాఫీకప్పు అందుకుంటూ కళ్ళజోడు పెద్దమనిషి లక్ష్మిని తేరిపారి చూశాడు.

"ఏం చదువుకుంటున్నావమ్మా!" నాజూకుగా ప్రశ్నించాడు.

"స్కూలుఫైనలు చదివాను!"

ఆ జవాబుకు కళ్ళజోడు పెద్దమనిషి కనుబొమ్మలు ఎగిరాయి.

ఇద్దరు కాఫీలు చప్పరించి, కప్పులు ఖాళీ చేశారు

"వీరి అబ్బాయి బి. ఏ. చదువుతున్నాడు" కదిపాడు నారాయణ సంభాషణ.

శివరాం అర్థం చేసుకున్నాడు.

"చెల్లెలి పెండ్లిసంగతి మా తాతయ్య చూసుకుంటారు...మన ప్రయత్నం ఆయనకు నచ్చదు!" తెలివిగా ఆ సమస్య

పరిష్కారం తేల్చాడు శివరాం.

కళ్ళజోడులోంచి ఆ పెద్దమనిషి కళ్ళు ఎర్రబడినట్లు కనిపించాయి శివరాంకు.

"ఆ...దానికేంగాని నాది ఒక సలహా. . చిన్నవాడవు, కనుక చెబుతున్నా.. పెళ్ళియీడు పిల్లని యీలా పరాయివాళ్ళతో తిప్పకూడదు!"

ఆ పెద్దమనిషి సలహాకు శివరాంలో కంపరమెత్తింది. కోపం బలవంతాన దిగమ్రింగుతున్నాడు.

పరాయివాళ్లతో తిరిగితే అలాగా అనడం సహజం...మీరిద్దరు ఒంటరిగా నే యిక్కడ ఉండడం...లోకం...హర్షించదు!" నారాయణ మాటలు నమిలాడు.

శివరాంకు కోపోద్రేకం ఆగలేదు. ఒళ్ళు ఉడికిపోయింది. గబుక్కున లేచి నుంచున్నాడు తక్షణం మీరిద్దరూ బయటికి వెళ్ళండి...వెళ్ళండి!" ఇల్లు ప్రతిధ్వనించేలా అరిచాడు శివరాం, అతని భయంకర స్వరూపం చూసి యిద్దరు నిశ్చేష్టులై ఒక క్షణం సర్దుకుని మూతి ముడుచుకుని, విశ్రతింగా నిష్క్రమించారు ఇంట్లోంచి.

శివరాం కేకతో లక్ష్మి, కోమటి యజమాని కంగారుగా మేప్రక్షించను వచ్చారు.

"ఏమీ లేదు...వాళ్ళు అవాకులు పేలేరు నేను అరిచాను...అంతే!" శివరాం కోపం సర్దుకుని నవ్వేశాడు.

ఈ కుత్సిత సమాజపరిసరాల్లో చెల్లెలును తనదగ్గర ఉంచుకోవడం భావ్యంకాదని నిశ్చయించాడు శివరాం. రాజారావు తల్లి మనుమడిని చూడటానికి పిఠాపురం వెడుతుంటే ఆమెకు చెల్లెలును అప్పగించి రాజమండ్రిలో దింపేయమని కోరాడు శివరాం. లక్ష్మి, అన్న విచిత్ర ప్రవర్తన అర్థంకాకపోయినా, నగరంలో చాలా రోజులున్నానని, తిరిగి వెళ్ళడంగూర్చి ఎక్కువ పట్టించుకోలేదు.

ప్రపంచంగురించి ఎక్కువ తెలియకుండా పరిమిత ప్రదేశంలో బ్రతికే ఇంటిదగ్గర మధ్యతరగతి సమాజానికి, ప్రాంతాలు మారి వివిధ సంస్కృతులతో విలసిల్లే నగరంలో బ్రతికే మధ్యతరగతి సమాజానికి నైజగుణం ఒకటే ననిపించింది. స్త్రీ పురుష స్నేహం అవినీతి చిహ్నంగా మాత్రమే భావించే కుత్సితులకు మరో అభిమానం, ప్రేమ అర్థంకాదు. ఈ మధ్యతరగతి సంకుచిత బంధుజన వాతావరణాన్ని అధిగమించి నూతన స్నేహంతో, విశాలదృక్పథంతో బ్రతకడానికి మార్గమన్వేషించడం అత్యవసరమనిపించింది శివరాంకు.

కోమటికోడలు చనిపోవడం మానసికంగా ఏమిటో శివరాంకు చాలా అసంతృప్తి కలిగించింది. ఆమె కనిపించినప్పుడు ఈసడించుకున్న రోజులున్నా, ఆమె మరణానంతరం ఆమెలో కనిపించిన ఆప్యాయత శివరాంను వెన్నంటింది. ఒంటరిగా తన గదిలో ఉన్నప్పుడు ఆమెగురించి భావాలు పరిపరి విధాల పోయేవి. మనశ్శాంతికి, మనస్తత్వంమార్పుకు బసమార్చడం ముఖ్యమని నిర్ణయించేడు శివరాం.

చెల్లెలును రైలులో సాగనంపి, ఆలోచనలతో స్టేషన్ను విడిచి వీధిలో నడవసాగాడు శివరాం. వీధిలో పరుగెత్తే కార్లు యింజనుముందు గాజుదీపాలతో గుడ్లు రిమి చూస్తున్న క్రూరమైన సమాజంలా అగుపడ్డాయి. పరిసరాలలో నడుస్తున్న మనుష్యులమాపుల్లో, నడకలో మాటల్లో వక్రతలు కనుపించాయి. కృత్రిమ విద్యుద్దీపాల కాంతిలో నగర సహజ సౌందర్యం మించినట్లు మిరుమిట్లుగొలుపుతోంది. హోటల్లో భోంచేసి ఇంటికి వచ్చి తనగదిలో దీపం వెలిగించాడు శివరాం

దోమలు తమ రోదన ప్రారంభించిపీకడం మొదలెట్టాయి. దీపం చుట్టూ ఎగిరే పురుగుల కోసం నోరు పెదుపుకుంటూ పొంచి కూర్చుని ఒక్కొక్కటే భక్షిస్తోంది గోడమీద పాతకలా ఎదిగి అంటె ప్రాకుతున్న బల్లి.

## 6

అఫ్జల్ గంజ్ బస్సుస్టాండు వెనకాల పార్కులో జనం గుంపులుగా చెదిరి కూర్చున్నారు. ఆకుపచ్చ మైదానాలు—ఆకాశాన్నంటే పొడుగయిన చెట్లు—మైదానాల మధ్య రాతిహంస—ఆకాశంలో కనిపించే సూర్యుని బాటలా మైదానాలను ఛేదిస్తూ యిరుకోనలు కలుపుతున్న గచ్చుదారి—చింతచెట్టు మొదలులో రాళ్ళగుట్టల మీద విచిత్రంగా అల్లుకున్న లతల సమూహం—ఆ వెనకాల గోరీల దిమ్మల కానుకుని చుట్టుకున్న వివిధ వృక్ష సముదాయం—చుట్టూ ఆవరించుకుని ఆ పార్కును రక్షిస్తున్న కోట బురుజుల్లాంటి గోడలు—అక్కడి దృశ్యాలు చూడడానికి ఏర్పరచబడిన రాతి తిన్నె గోపురం—విపరీతమైన అందాలు వెదజల్లుతూ వాహ్యాళికి వచ్చే జనుల మనస్సులను అలరిస్తోంది. ప్రక్కనే మూసీనదిపై అతికిన వంతెనపైన పాలబుడ్లు, పార్కు ఎదురుగా ఉన్న వీధిలైట్లు—ఆకుపచ్చపార్కును వెలుగు నీడలో ముంచి తేల్చుతున్నాయి. చింతచెట్టు వెనుక వృక్షాలలోంచి రాణీ, రావు వెలికి వచ్చారు. ఫెల్టుహేట్ సినీతారల బుష్కోటు ఊపుకుంటూ సిగరెట్టు ముట్టించాడు రావు ఖులాసాగా.

"సుందరం నడుస్తూంటే ఇది నందన ఉద్యానవనంలా లేదూ?" రావు నవ్వేడు.

"ఆ! సుగంధ పరిమళాలు కూడా వస్తున్నాయి!"

"ఎక్కడనుంచి?...నీరు లేని మూసీనదిలోంచా?" పకపక నవ్వేడు రావు తన తెలివిని తానే మెచ్చుకుంటూ.

"ఊహ్చే...మీరిచ్చిన చీరమీది సెంటు పువ్వుల్లోంచి!"

"ఆ! అలాగా...అందుకే చీరమీది ప్రతీ పువ్వుకు సెంటురాశాను పరిమళించాలనీ...రాణీ...నువ్వు యీ రూపంలో...!" రావు నడుస్తూ ఆగిపోయి ఒక్కసారి తన్మయంగా ఆమెవైపు చూశాడు.

రాణి నవ్వింది.

"రాణి నువ్వు వేధించకూడదు. త్వరలో

"తప్పకుండా...అమ్మనడిగి పెళ్లి చేసుకుందాం!"

"సరే నీయిష్టం...విజయతత్వమే జేరు.!" నీరసిల్లాడు రావు.

"అలాగా!" పకపక నవ్వింది రాణి.

వీధిలోని గుకోణాలపై విద్యుద్దీపాలు వివిధరంగుల్లో హఠాత్తుగా వెలిగి ఆరి బాటసారులను ఆకర్షిస్తున్నాయి. రాణి తెల్లచీర మీది పసుపుపచ్చపూలు మిలమిల మెరుస్తున్నాయి ఆ వెలుగుల్లో.

రావు రాణి రిక్షా ఎక్కారు. కోటీ ప్రక్కని సందులోకి మళ్ళింది రిక్షా. రాణి ఇంటిముందు దిగాడు రావు.

"రాణీ!...యీసారి నా సంగతి తేల్చకపోతే నీముఖం చూడను!" విసవిసనడిచి రిక్షావాడికి డబ్బు చెల్లించి వెళ్ళిపోయాడు రావు

"అంతకోపమా!" రాణి నవ్వి, తనవైపు చూడకపోవడం గమనించి, ముఖం తీవ్రం చేసుకుని తలవంచుకుని రెండు అడుగులు వేసింది.

-కమ్మా!" గట్టిఅరుపు వినిపించింది. ఎవరో మగమనిషి గొంతులా ఉంది. తన పూర్వనామం జ్ఞాపకంవచ్చి, ఒకక్షణంఆగి, కంగారుగా అడుగులు వేసుకుంటూ ఇంట్లో చొరబడింది. రాణి. వీధితలుపులు మూసి కిటికీలోంచి బయటికి తొంగిచూసింది. ఏ మనిషి తన్ను వెన్నంటిన జాడ కనిపించలేదు. కంగారు అణచుకుని యథాస్థితికి వచ్చింది రాణి.

రావుయిచ్చిన పువ్వుల చీర ధరించి ఆఫీసుకు వెళ్ళింది రాణి. అనునయంగా సౌమ్యంగా మాట్లాడే రఘురావుతప్ప తక్కిన వారంతా రాణివైపు ఎగాదిగా చూసి ఏదో మాట్లాడ పురస్కరించుకునేవారు. రాణు


నారసింహ లేహ్యము

బంగారుతో చేరినది. మేహము, పక్షవాత, నిస్సత్తువ వగైరా హరించి బలము రక్తవృద్ధి కల్గించును. 20 రో డబ్బీ రు 1 8 0 పోస్టేజి.1-1-0

షి. వి. ఎ అండ్ కంపెనీ ఆయుర్వేద సమాజం, పెరిడేపి (PO) నెల్లూరుజిల్లా,

# ★ అన్వేషణ ★

నరసు బావమరిది మూర్తి రాణితో ఎక్కువ పరిచయం ఏర్పరచుకోవాలని ప్రయత్నించాడు. తనబావ యీ కంపెనీ యజమాని అన్న సంగతి, తన పలుకుబడి ఆమెకు తెలిసేలా సర్వవిదితం చేశాడు. అయినా అమాయకంగా నిర్లక్ష్యంగా కనిపించిన రాణిని చూస్తున్నకొలదీ మూర్తికి ఉద్రేకాలతో మతి చెడుతోంది. ఎల్లాగైనా రాణిస్నేహం పొందాలని వివిధ ప్రయత్నాలు చెయ్య సాగాడు.

"నమస్కారమండీ!" రాగానే రాణి దగ్గరకు వచ్చి కూర్చున్నాడు మూర్తి.

ప్రతివందనం చేసింది రాణి ముభావంగా.

"మీ పువ్వులచీర చాలాఅందంగావుంది.. ఎవరిచ్చారో!" నవ్వాడు వెటకారంగా మూర్తి.

"స్వంతవిషయాలు మీ కనవసరం!" కటువుగా జవాబిచ్చింది.

నిన్న సాయంత్రం తమరిని పార్కులో చూశాను...ఎవరో ఆ ప్రక్కనున్న అదృష్టవంతుడు!

"మీరు నా జోలికి రావద్దని ఎన్నోసార్లు చెప్పాను!" రాణి గట్టిగా అరచింది.

రాఘవరావు వారి ప్రసంగం రాణి కేక విని ఇద్దరిమధ్య వచ్చి సముదాయించబోయాడు. కంపెనీ యజమాని బావమరిదినన్నట్లు గర్వంగా రాఘవరావువైపు చూచి మూర్తి అప్పటికి ఆమె దగ్గరనుంచి నిష్క్రమించాడు.

మధ్యాహ్నం రాణి రాఘవరావుతో ఫలహారం చేసింది. తన బేగ్‌లోనుంచి మామిడాకు కట్టిన పసుపుత్రాడు బయటికి తీసి రాఘవరావు చేతికి కట్టింది.

"ఇదేమిటి...ఈరోజు రాఖీపౌర్ణమి కాదే!"

"కాకపోవచ్చు...యీఆఫీసు చూస్తోంటే నాకు భయం వేస్తోంది....ఇక్కడ అన్నలా మీరే నన్ను కాపాడాలి!" దిక్కుముఖం పెట్టింది రాణి.

"నేనుండగా నీకేం ఫరవాలేదమ్మా!... నీకేకష్టమొచ్చినా నాతో చెప్పు...నీకు తప్పకుండా సాయంచేస్తా!" రాఘవరావు సహజ ధోరణిలో కళ్ళు చికిలించి, నీరసంగా అన్నాడు.

ఇది గమనించాడు మూర్తి. అవమానమే తనకు జరిగినట్లు భావించాడు. ఆఫీసులో అందరికీ మధ్యాహ్నం రాణి చేసిన పని చెప్పాడు. రాఘవరావు రాణిని మచ్చిక చేస్తున్నాడనే వదంతి లేవదీశాడు. అటువంటి అనాకారి కన్న తీసిపోయారా మీరు అని ఆఫీసుగుమాస్తాలను ఉద్రేక పరిచాడు మూర్తి. తాత్కాలికంగా గుమాస్తాలంతా విడ్డూరంగా రాణిగురించి ప్రసంగించినా, కంపెనీ యజమానికి కూడ ఆప్తురాలు అనే ధోరణిలో ముభావం వహించారు. మూర్తి మనస్సు వక్రగతిలో పయనించింది. రెండుసార్లు ఆమె ప్రక్క కుర్చీనుంచి వేడుతూ కాలితో ఆమెను తన్నాడు. మరోసారి ఆమెచీర కొంగు లాగాడు.

రాణి కోపోద్రేకం అణచుకోలేకపోయింది. బుసకొట్టిన పాములా రివ్వనలేచి విసురుగా నడిచి చెప్పుతీసి మూర్తి దవడ మీద గట్టిగా బాదింది. మౌనంగా పోయి యథాస్థానంలో కూర్చుంది.

మూర్తి నిలువునా ఆ సంఘటనకు మూర్ఛపోయినంతగా బాధపడ్డాడు. తోటి గుమాస్తాలకు తనముఖం చూపలేకపోయాడు. వెళ్ళి రామనరసుకు ఫిర్యాదు చేశాడు. అంతకన్న ఎక్కువ ప్రతీకారం అక్కయ్యద్వారా తీర్చుకోవాలని గృహోన్ముఖుడైయాడు మూర్తి తక్షణం.

రాఘవరావు మందలించాడు రాణిని. జరిగిన సంఘటన ఏ విపరీత పర్యవసానం కలిగిస్తుందో అని భయపడ్డాడు. రామనరసు రాణిని పిలిచి మొదట కూకలేసినా, బావమరిది అసభ్య ప్రవర్తనకు తనే నొచ్చుకున్నాడు. ఆరోజు గుమాస్తాలంతా రాణిని పులిలాచూసి భయపడి పిల్లుల్లా అడుగులు వేసుకుంటూ నిష్క్రమించారు.

మర్నాడు రాణి యథాప్రకారం చిరునవ్వుతో అడుగుపెట్టింది ఆఫీసులో. రామనరసు పిలిచాడు ఆమెను గదిలోకి. చిన్నకొండలా లావుగానున్నగా ఉత్సవవిగ్రహంలాకుర్చీలో కూర్చుంది రామనరసు భార్య కళ్ళలోంచి నిప్పులు కక్కుతూ. ఆప్రక్కనే పళ్ళు కొరుకుతూ రీవిగా నిలుచున్నాడు మూర్తి. మౌనంగా ముభావంగా కాగితం అందించాడు రామనరసు రాణికి. ఉద్యోగం ఆఖరయిందని కాగితం చెప్పింది. రాణి అందరివైపు ఒకసారి చూసి అమాయకంగా పేలవంగా నవ్వి, విధికృతము తప్పింపలేమనే వేదాంతంలో బయటికి వచ్చేసింది. తన వ్యాపారానికి పెట్టుబడి పెట్టినభార్య ఆజ్ఞలను పాలించక తప్పలేదు రామనరసుకు.

రాఘవరావు ఆమెకు సానుభూతి చూపాడు. తిరిగి ఆమెను ఉద్యోగంలో చేర్చేలా తాను సర్వశక్తులా ప్రయత్నిస్తానని వాగ్దానమిచ్చాడు. ఉద్యోగం దొరికేలోగా ధనసహాయం కూడ చేస్తానని మాట యిచ్చాడు రాఘవరావు.

ఆనాటి సంఘటనకు, తన విచిత్ర ప్రవర్తనకు పశ్చాత్తాపంతో, దిగులుతో యింటికి వచ్చేసింది రాణి.

రాత్రి ఎనిమిది గంటలయింది. అయినా మరియమ్మతో జరిగిన సంగతి చెప్పలేదు రాణి. తీవ్రంగా ముందు కార్యక్రమం గురించి తనలోనే ఆలోచించుకో సాగింది.

రామనరసుతిన్నగా ఇంట్లోకి వచ్చేశాడు. ఇదివరకు రామనరసును ఎరుగని మరియమ్మ అతని పెద్ద కారుచూసి ఏ గొప్ప వ్యాపారస్తుడో, ఉద్యోగో రాణి స్నేహం వాంఛించి వచ్చాడని, అతి వినయంతో, తన చీర సర్దుకుంటూ నాజూకు నవ్వులు చిలకరిస్తూ ఆహ్వానించింది. మర్యాదగా లేచి కూర్చోంది రాణి మౌనంగా నమస్కరించి. మధ్య తన ఆకారం ఎందుకని వంటింట్లోకి నిష్క్రమించింది మరియమ్మ.

"రాణీ! నువ్వు ఎంత బాధపడి ఉంటావో నాకు తెల్సు...కాని తప్పనిసరి అయింది... నువ్వు ఉద్యోగం చేసినా చెయ్యకపోయినా వందరూపాయిలు యిచ్చేస్తా...త్వరలో నే మళ్ళీ నిన్ను ఆఫీసులోకి తీసుకుంటా... నువ్వేమీ అనుకోకూడదు!" రామనరసు ఒగరిస్తూ బ్రతిమాలాడు. రాణి సూక్ష్మంగా పసిగట్టింది రామనరసుమనస్సులోని అంతరార్థం. అయినా పరిస్థితులు చూపించిన అగత్యానికి బలిఅయి "అలాగే" అని ఊరుకుంది.

"నీమీది అభిమానం...!" రామనరసు "హిహిహి" అంటూ మాటలు మింగేశాడు.

"అప్పుడప్పుడు కనిపిస్తుండు; నాకు చాల అర్జంటుమీటింగు వుంది!" రామనరసు లేచాడు. నమస్కారంచేసి వీడ్కోలు యిచ్చింది రాణి.

మరియమ్మ ఆవచ్చిన మనిషిగురించి వివరాలు అడిగింది. అందము మనిషిని అంటిపెట్టుకుని చాలాకాలం ఉండదని వయస్సులో ఉన్నప్పుడే ఆడది బాగా ధనం సంపాదించుకుని ముసలితనంలో జీవితాన్ని కాపాడుకోవాలని, అన్నికష్టాలు తప్పించి ఆ ఏసుప్రభువు చల్లగా చూస్తారని మరియమ్మ పదినిమిషాలు తియ్యగా ఉపన్యాసం యిచ్చింది.

"నా ఉద్యోగం ఊడిపోయింది. ఇక్కడినుంచి వెళ్లిపోదామనుకుంటున్నా!" రాణి చల్లగా వదిలింది మాట. దీనివల్ల ఆమెలో వచ్చే పరిణామాలు ఆసక్తిగా పరిశీలించదలిచింది రాణి. తనమీదఆధారపడి బ్రతుకుతున్నా తన జీవితంలోని నిజం యింతవరకు మరుగుపరిచి వంగనాచిలా బ్రతకడంలోని అంతరార్థమేమిటో రాణి ఆరోజు తేల్చదలిచింది. రాణిమాటలకు మరియమ్మ ఒక నిమిషం నోరు ఆవలించి ప్రతిమలాకూర్చుని పోయింది.

"మరి ఆకంపెనీ యజమాని ఎందుకు వచ్చినట్టు!"

"ఇవ్వవలసిన జీతం రేపు అందజేస్తానని మర్యాదగా చెప్పాడు వచ్చి!"

"అనవసరంగా ఎందుకు కొట్టావే ఆ అబ్బాయిని... మచ్చిక చేసుకుంటే...!" సాగదీసుకుంది మరియమ్మ.

"చాల్లే నోర్ముయ్యి ...ఈరోజునుంచి నీదారి నువ్వు చూసుకోవచ్చు!" రాణి కోపం నటించి వదనం తీవ్రం చేసింది.

మరియమ్మ మనస్సు పరిపరివిధాల బాధపడింది. రాణి తన్ను ఒంటరిగా వదిలేస్తే పొట్టగడిచే వీలులేదు. మర్యాదగా మారు రూపంలో ఒక తరగతి మనుష్యుల స్నేహంతో బ్రతుకుతున్న తనకు మరోపని చేసే స్తోమత కాని, చాకచక్యం గాని లేదని గుర్తించుకుంది మరియమ్మ.

"రాణీ! నన్నుయిలా ఒంటరిగా గంగ పాలుచేస్తే ఎలా?...యీ ముసలి దానికి ఎవరో ఒకరు అండగా ఉండకపోతే బ్రతక లేదు...నల్లమంగు ఖర్చుకే...!" మరియమ్మ ఏడ్పు మొదలెట్టింది.

"ఎందుకు దొంగ ఏడ్పులు ... అంతా దొంగజీవితం...విజయ ఏమయింది?...నరసింగం ఎక్కడికి పోయాడు?...నువ్వు విజయ తల్లి వేనా?..." నన్నుకూడ చివరకు వాళ్ళలా నాశనం చేస్తావు!" రాణి ముఖం ముడుచుకుంది.

"రాణీ! నువ్వు ఎలా చెబితే అలా వింటా!" మరియమ్మ రాణి చేతులు పట్టుకుని..."అయితే విజయ సంగతి చెప్పేస్తా!... విజయను ఎవరో చంపేశారు!" రాణి ఆశ్చర్యంతో ఒక్క అరుపు అరిచింది.

ఆ రోజు నువ్వు ఆఫీసుకు వెళ్ళావు... మధ్యాహ్నం పోలీసులు వచ్చారు యింటికి.. నన్ను విజయశవం దగ్గరికి తీసుకువెళ్ళారు... అఫ్జల్ గంజిపార్కు గోడక్రింది మూసీ నది చెట్లతుప్పల్లో పడిఉంది.... అన్నట్టి వస్తువులు ఎవరో చెప్పారట విజయ చిరునామా...నన్నడిగారు శవాన్ని గుర్తుపట్ట గలవా అని...ఆ హత్యలో నన్ను ఇరికిస్తారనే భయం పుట్టింది... తెలియదని బొంకాను...విజయ స్నేహితులతో కలిసి పెళ్ళికి బెజవాడ వెళ్ళిందన్నాను....మరియమ్మ గద్గదస్వరంతో, ఎక్కిళ్ళతో, గొంతు నలుపుకుంటూ ఏడ్చింది.

విజయను ఎవరు చంపారో అనే విషయం మరియమ్మకు గాని రాణికి గాని అర్థం కాలేదు. కోపిష్ఠియైన నరసింగం అంతపని చేస్తాడను కోడానికి ఏ ఋజువు లేదు. పైగా అతను నగరమే విడిచి వెళ్ళిపోవడంతో ఎవరికీ అతనిపై అనుమానమే కలగలేదు.

"ఎవరైనా పాడిచేశారా?" చావురీతి గురించి ప్రశ్నించింది రాణి.

"లేదు. ఎవరో పీకనులిమి చంపేశారుట!" మరియమ్మ శోకం దిగ్లులుగా మారింది.

అయితే ఎప్పుడో నన్ను కూడ యిటువంటి పరిస్థితుల్లో యిరికిస్తావన్న మాట...ఈ రోజు చెబుతున్నా...నీ స్నేహితుల్ని, బంధువుల్ని ఎవరినీ నాకు పరిచయం చెయ్యకు... నేను నీతో ఎక్కడికి రాను... నా మీద ఆధారపడదల్చుకుంటే నే పెట్టింది తిని ఊరుకో!" రాణి తన నియమాలు ఖంజాయింపుగా ముందు పెట్టింది.

"అలాగే!" తల దించుకుంది మరియమ్మ.

"ఈ నరసింగం ఎవరు?" రాణి పరిశోధన మొదలెట్టింది.

"అసలు నిజం చెప్పేస్తా...మేము క్రైస్తవులం కాము...ఒక కలపవ్యాపారి నన్ను నంద్యాలనుంచి లేవదీసుకువచ్చి గుంటూరులో ఉంచాడు. మా యింట ప్రక్కనే రెండు చిన్నగదులుండేవి. నేను అక్కడికి రాకముందే విజయ కాపురముంటూ ఆ వూళ్ళో టీచరుపని చేస్తుండేది ఒక చిన్న స్కూల్లో. రెండేళ్ళ తర్వాత ఆ కలప వ్యాపారి చచ్చిపోయాడు. అంతకుముందే విజయతో నాకు స్నేహం ఏర్పడింది. ఒక రోజు విజయ అడిగింది నన్ను యీ నగరం వచ్చెయ్యమని తనతో...తనకు తల్లిగా ఉండమంది నన్ను...ఒప్పుకున్నా... కొంచెం పెద్దరకం హోదాలో తిరగాలని క్రైస్తవులుగా మారిపోయాం యిక్కడ!" తన కృత్రిమ బ్రతుకుకు పేలవంగా నవ్వింది మరియమ్మ.

ఒరువులోకి జారిపోయిన మనిషిని ఎటు వైపెళ్ళినా నాచు చుట్టుకున్నట్లు, జీవితంలో తప్పుదారి త్రొక్కిన తనచుట్టూ పతితశీలురే చేరతోండడం రాణికి విసుగు కలిగించింది. గౌరవప్రపత్తులతో మసిలే ఉన్నతి వంశీకుల సాంగత్యంకోసం తహతహ లాడింది రాణి. ఏదైనా కళాజీవితంలో అడుగుపెడితే అటువంటి అవకాశాలు వస్తాయేమో అనే ఆలోచన ఆమెను తట్టింది. పదిమంది పెద్దలు వచ్చే ప్రదేశాలు, సభలు, గ్రంథాలయాలు, ఉత్సవాలు సందర్శిస్తుంటే ఎవరితోనైనా స్నేహం కలగ వచ్చనే అభిప్రాయం కలిగింది. ఉద్యోగం లేకుండా ఈ జీతం వస్తున్న ఈ దినాలు ఎలా గడపాలా అనే యోచన చేయసాగింది.

మొజఱంజాహి రోడ్డులోని గ్రంథాలయం వైపు నడిచింది సాయంత్రం. అతి శుభ్రంగా, రకరకాల పుస్తకాలతో అందంగా ఎంతమంది వచ్చి వెడుతున్నా అతి నిశ్శబ్దంగా నాజూకైన పద్ధతిలో ఆకర్షణీయంగా ఉంది గ్రంథాలయం. మేగజైనులు, పుస్తకాలు కొంతసేపు చదివి పట్ట్యారాలిగా చేరి కొన్ని మేగజైనులు చేత్తో పుచ్చుకుని వయ్యారంగా వీధిలోకి నడిచింది రాణి. వీధిలో ఒక గజం నడవగానే ఎదురుగా "కమలా" అంటూ పిలుస్తూ ఇరవైయ్యేళ్ళ యువకుడు నిలుచున్నాడు. వినట్లు రెండడుగులు ముందుకు వేసింది రాణి. "నిన్నే! అంత తమాషాగా ఎగనట్లు పోతున్నావే!" వెంటబడ్డాడు ఆ యువకుడు.

"ఎవరునువ్వు... జాగ్రత్తగా మసులుకో" అరిచింది రాణి.

"అబ్బ! ఇంట్లోంచి పారిపోయి తమాషా చేస్తున్నావే... నిన్ను బలవంతంగా యీ వేళ...!" ఆ యువకుడు ఆమె చెయ్యి పట్టుకోబోయాడు.

"పోలీసులని పిలువనా... ఏమిటా పొగరు?..." రాణిచౌరస్తాలో నిలుచున్న పోలీసును గట్టిగా పిలిచింది. రహదారి కాపాడుతున్న పోలీసు కదలలేక ఒకనిమిషం తటపటాయించాడు. ఇంతలో జనం మూగారు. మూగిన గుంపులోంచి దూసుకు వచ్చాడు రాజారావు.

"రాముడూ!... ఏమిటి యీ అల్లరి నడివీధిలో!" మందలించాడు రాముడిని రాజారావు.

"చూడండి... ఈమె కమలకాదుట!" తన్ను మోసం చేస్తున్న రాణిని చూపించాడు రాముడు.

"నా పేరు... రాణి... కోటీదగ్గర ఉంటాను... ఉద్యోగం చేసుకుంటున్నా.. మనిషిని పోలిన మనుష్యులు ఉండవచ్చు... అందుకు నన్ను నిలదీస్తాడేమిటి మర్యాద లేకుండా!" చీదరించుకుంది రాణి.

రాజారావుకూడ ఆ అమ్మాయిని ఎక్కడో బాగా చూసినట్లు అనుమానపడ్డాడు.

"నన్నెప్పుడైనా చూశావా?" ప్రశ్నించాడు రాజారావు.

"లేదు..." నవ్వింది రాణి.

రాముడిని కూకలేసి పంపించేశాడు రాజారావు. చేసిన సహాయానికి కృతజ్ఞత చూపుతున్నట్లు నమస్కరించింది రాణి. తన చిరునామా యిచ్చి ఎప్పుడైనా అవసరమైతే కబురంపండి అంటూ నవ్వుతూ వెళ్ళిపోయాడు రాజారావు.

తన్ను వేశ్యలకొంపలోంచి తప్పించడానికి ఉద్యుక్తుడైన రాజారావులో మంచితనమున్నా, వేశ్యలకొంపల మధ్య తిరిగే అతనిలో ఏ సీదగుణములున్నాయో అనే శంక రాణిని వేధించింది. అయినా రాజారావు ద్వారా తనకు తెలిసిన నాటకకళతో రంగంలోకి ప్రవేశిస్తే ప్రేక్షకజనంలోని పెద్దల సాంగత్యంలో అభివృద్ధిచెందే అవకాశాలు బాగా లభిస్తాయనే ఆశపడింది రాణి. ★

(ఇంకా వుంది)

★ డిస్మెంసాల్
కుసుమ, బహిష్టు నొప్పులకు
అద్భుతముగా పనిచేయును
వివరములకు — AGENTS
R.K. BROTHERS
4/27. RAJAHMUNDRY









ప్రొఫెసర్ ఇమాం సిద్దికీగారి మాజిక్ ప్రదర్శనము అని ఓ బోర్డు వేసి దానిమీద సన్నగా పొడుగ్గా రివటలా ఉండే నేటి మేటి హాస్యనటుడు రమణారెడ్డి బొమ్మగీసి ఉంటే కెవ్వున కేకవేసి వెనక్కి మూర్ఛపోవలసిన ప్రమాదం ఉండదు. ఎందుకంటే రమణారెడ్డి మాజిక్‌లో మెచ్చదగ్గ ప్రావీణ్యం గడించాడని ఈ రోజున అందరికీ తెలుసు. అయితే హాస్యనటుడిగా ఆయన మీద అభిమానమున్న యావన్మందికీ (ఆంధ్ర సినీ ప్రేక్షకులు యావన్మంది అభిమానం ఉందనడానికి సందేహం లేదు) రమణారెడ్డి రేపట్నించి ప్రొఫెసర్ సిద్దికీ అని పేరెట్టుకు ఇంద్రజాలిగా ఊరేగబోవడం గిట్టదు. సిద్దికీ అనే పేరు ఆంధ్ర ప్రేక్షకులకు గిట్టదనీ, హుసేన్ అంటే నచ్చవచ్చుననీ అనటం లేదు. అసలు రమణారెడ్డి తప్ప మరో పేరూ హాస్యం తప్ప మరో పనీ ఆమోదించరని. ఇంతకీ రమణారెడ్డి, మాజిక్ వాండ్ కోసం సినిమాని కొదనబోయే ప్రమాదం ఏమీ లేదు. ఇంద్రజాలిగా కూడా ప్రశంసించతగ్గ స్థాయిని అందుకొని అద్భుతరసాన్ని కూడా పోషించగల సామర్థ్యం సంపాదించాడు. ప్రపంచ ప్రసిద్ధుడైన అమెరికన్ (ఎస్కేపాలజిస్ట్) ఇంద్రజాలి హారీ హూడినీ, బ్రిటిషు మెజిషియన్ కౌంటర్, భారతీయుడు సార్కార్ వగైరాల పేర్లను రమణారెడ్డికి ఉపమానంగా చెప్పడానికి సదుపాయం అవకాశం సమృద్ధిగా లేనిమాట నిజమే అయినా సినిమాలో హాస్యనటుడుగా పేరు గడించి ఇటు విద్యలో ప్రజ్ఞ కొంత పేరూ గడించినవా అరుదన్నమాట ఒప్పుకోవాలి.

* * *

తెలుగు దేశంలో మాజిక్ విద్య ప్ర ర్శించేవారు తక్కువ. ఉన్నవారికి ప్రోత్సాహమూ బహు తక్కువ.

మాజిక్ అనే మాటకు పూర్వం కొంత వచ్చి అర్థమూ మారిపోయి, ఇప్పుడు వు వినోదప్రదమైన అద్భుతచర్యల ప్రదర్శనంగా ఏర్పాటయింది.

విప్రవినోదులు పూర్వం ఈవిద్యలో హస్తులు. ఈ నాటి మెజీషియన్లకున్న హంగామా ఆర్భాటం లేకుండానే వాళ్ళ ఎన్నో అద్భుతాలు చేశారు.

"అబ్బో, అవన్నీ ఎంతబాగుండేవనీ అంటాడు రమణారెడ్డి కళ్ళు గమ్మత్తుగా తిప్పి

అతనికి మాజిక్ మీద ఆసక్తి కలగడా కారణం విప్రవినోదుల విద్యలే. చిన్నప్పు అందరిపిల్లల్లాగానే అతనికీ మాజిక్ మీ మోజెక్కువగా ఉండేది. అం క ఇంట్లోంచి బియ్యం పప్పు ఉప్పు వ సంభారాలు ఎత్తుకపోయి వారి కర్పించుక అవి నేర్పమని వాళ్ళవెంట తిరిగేవాడు.

"చెప్పేవారు కాదనుకోండి. అది వ కూటివిద్దగదా. నాకు తెలిశే నేనందు చెప్పెయ్యను మరి" అన్నాడు రమణారెడ్డి.

మొత్తానికి అలాగా ఇలాగా తిరుగుతూ పేకముక్కల ట్రిక్కులూ చిక్కులూ నేర్చు కుంటూనే వచ్చాడు నాటికీ నేటికీ.

## బొమ్మల వివరణ

ఎడమవైపునుండి: (1) బుట్టలో చెవుల పిల్లిని తీయడం ఎవరెన్నిమార్లు చేసినా చూసేవారు బుట్టలో పడుతూనే ఉంటారు. (2) చైనీస్ రింగులు అంతమూ ఆటనుముందు చేసితీరే హంగులే. (3) పదిపేకలు, ఓ గజం దారం విడివిడిగా మింగేసి, నోటనే వాటినాదారంతో హారంచేసి తీసిఇస్తాడు. (4) సినీ వేషభావలలోంచి హాస్యాన్ని తీసినంత సులువుగా హాయిగా కాళీబుట్టలోంచి చీరెలూ, రుమాళ్లూ, పెట్టెలూ కళ్ళు. కళ్ళకి వత్తయినగంతలు కట్టుకున్నా బోర్డులో మీరు ఏభావలో ఏ దాన్ని దానిక్రింద తిరిగిరాస్తాడు. తెలుగుల మటుకు ప్రశ్నరాసే జవాబుకూడా ఇ గలడు. (6) మూడురంగుల ఇసుకను బా నీళ్ళలో కలిపేసి, మళ్ళీ పొడి ఇసుకనే విడివిడిగా ఏరంగుకారంగు చూపిసాడ మధ్యబొమ్మ: రమణారెడ్డీ, అతని గురువు మిత్రుడూ అయిన ప్రొ॥ మెస్ర

## ...ంజిక్

ఏడెనిమిదేళ్ళనాడు ప్రఖ్యాత ఇంద్రజాలికుడు ప్రొ॥ సర్కార్ మద్రాసులో కొన్ని ప్రదర్శనాలిచ్చాడు. ఒక స్త్రీని రెండుఖండాలుగా తెగనరకడం అందులో ఒక అంశం.

ఇది ఎలా చేసిఉంటాడా అని ప్రేక్షకుడు రమణారెడ్డికి సందేహం కలిగింది. ఎప్పుడు మాజిక్ ప్రదర్శనం వచ్చినా, అందులో ప్రతి అంశాన్ని అతడు ఏ ఉపాయంతో సాధించి ఉంటాడా అని ఆలోచించి ఊహాసహాయంతో ఒక తీర్మానానికి రావడం అలవాటు. చాలామందికి అంతే కొందరు కొంతదూరం ఊహించి కుదరకపోతే విసుగెత్తి ఎలాగో అలా అఘోరించి ఉంటాడు అని వదిలేస్తారు. కొందరు "ఇందులో ఎక్కడో ట్రిక్కు ఉంది" అంటారు అతి తెలివిగా—ట్రిక్కుతోనే అంతా ఉందన్న సంగతి అంతవరకు ఎవరూ పసిగట్టలేకపోయారన్న దురూహతో.

రమణారెడ్డి, ఆ ట్రిక్కు గురించి ప్రతిరాత్రీ నిద్రపోయే వేళ ఓ అరగంటసేపు ఆలోచించేవాడు. తెలిసినవాళ్ళని అడిగేవాడు. మాజిక్ లో ఒకమ్మత్తు ఉంది. సాధారణంగా అందరూ చేసే కొన్ని విద్యలు మినహా, క్లిష్టమైన అంశాలు సాధారణంగా ఒకరుచేసేవి మరొక ఇంద్రజాలికుడికి తెలీవు. విళ్ళు చెప్పరు; వాళ్ళు అడగరు. ఒకవేళ చెబితే పరటా పద్ధతిమీదనే. ఈయన ఓమంచి మాజిక్ నేర్పితే అందుకుబదులు ఆయన మరోటి చెల్లిస్తాడు. రెండు వారాలక్రితం సేలంలో ఒక మాజిక్ ప్రదర్శనం జరిగినపుడు రమణారెడ్డి అక్కడికి వెళ్ళి చూసి, అతనికి రెండు విద్యలు నేర్పి, అతనిదగ్గర తను రెండు నేర్చుకున్నాడు.

* * *

సర్కార్ ట్రిక్కు గురించి ఇలా చాలాకాలం ఆలోచించి చివరకొగోజున ఆయన ఫలానా విధంగా ఇది చేసిఉండాలి అని స్థూలంగా నిర్ధారణ చేసుకున్నాడు రమణారెడ్డి. ఇది జరిగిన కొన్నాళ్ళకి వరల్డ్ డైజెస్టు అనే పత్రికలో దానిమీద ఒక వ్యాసం పడింది. ఒక బ్రిటిష్ ఆసామి

ప్రత్యేక త్రిగుణ చర్యలతో

గూడియున్న **మెక్లీన్స్**

పెరాక్సయిడ్ టూత్ పేస్టు

**1**

చాలా బాగుగా
✻ శుభ్రపరచును!

ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'లైపాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడుచుండే — మురికిని క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.

**2**

చాలా బాగుగా
✻ తెలుపుజేయును!

మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన దాగులను, గారపట్టిన రంగును తొలగించును — అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా జేయును.

మెక్లీన్స్

**3**

✻
బాగుగా కాపాడును!

మీరు మెక్లీన్స్‌ను స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని ఆస్వాదనమును కనుగొనండి. ఇది పనుచిగుళ్లను ఉత్తేజపరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును

*ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది!*

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంతమైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స్ కొనండి!**

MTY-49

# నక్షత్ర ఫలితాలు

[2-9-59 మొదలు 8-9-59 వరకు]

### గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| శ | | | |
| | సింహ, కన్యా, తులా వృశ్చికము లలో చంద్రుడు. | | |
| | | | ర బు ధు |
| శ | గు | | కు రా |

### *[అశ్విని చూ, చే, చో, లా]*

మీ ఆలోచన ప్రకారము కార్యక్రమాలు నెరవేరడానికి కొందరు అడ్డు వస్తూవుంటారు. కొన్ని సందర్భములలో అశాంతి, బంధు విరోధము వచ్చును. కోర్టుదావాలు అనుకూలముగా తీర్పుఅయినా మరికొన్ని క్రొత్త చిక్కులు కలుగుతవి. కొర్రలు, రాగులవంటి అపరదినుసులు, మినుములు, ఉప్పు, నువ్వులు, నూనె, సంబంధముగు వస్తువులు వర్తకులకు లాభము. అన్యజాతివారివల్ల గౌరవము కలుగుతుంది. రీన భార్యకు అనారోగ్యము- అధిక ఖర్చులు.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము ఎంత ప్రయత్నించినా అనేక అటంకములు కలుగుతవి. సాహసము పట్టుదల కలవారగుటచే నిరాశచెందక ప్రయత్నించి కలిగిన చిక్కులు విప్పకొని మేలు పొందుతారు. సోదరసహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకొంటారు. జాగ్రత్తగా వుండకుంటే అవయవములకు దెబ్బలుతగిలే ప్రమాదము తప్పవచ్చును. గనుల యజమానులకు, భూగర్భశాస్త్రజ్ఞులకులాభం, ఖనిజ వ్యాపారస్తులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు కష్టముతో కూడిన యోగము.

### * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]

మీరు ధైర్యముతో వృత్తిఉద్యోగాలలో ముందంజ వేసి, హోదా ఆదాయము పెంచుకుంటారు. క్రొత్త అనుకూలతలు ఏర్పడుతవి. మీ బుద్ధి కుశలతవల్ల ఉపద్రవాలు సాధించుతారు. మీరు వేసుకున్న పథకము ప్రకారము అన్నివిధాలా డబ్బు చేతికి అందుతుంది. మాట పలుకుబడితో పరిస్థితులలో అనుకూలమైన మార్పులు తెచ్చుకొనగలుగుతారు. ఈశాన్య దిక్కునుండి బంధువుల క్షేమవార్త తెలుస్తుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగ కాలము.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము మీకు యోగప్రదము. అవకుండా నిలిచిపోయిన కార్యములు ఈ వారము సుముఖమవుతాయి. అధికారముతో పాటు ధనాదాయముకూడా పెరుగుతుంది.

## బి. నరసింగరావు

బిరుదులు పొందుట, సన్మానమువంటి శుభయోగములు కలవు. పండితగోష్ఠి, నూతన గ్రంథములు చదువుటచే విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. పిల్లల మేలుకొరకు మీరుకొన్ని యేర్పాట్లు చేస్తారు. వర్తకులకు లాభయోగము. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, పండితులకు మేలుకాలము.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము లౌకిక వ్యవహార రంగములో మీకు చాలా జయప్రదముగా వుంటుంది. ఆదాయము ఎక్కువ అవుతుంది. నీటిమీద ప్రయాణము చేయవలసి వుంటుంది. కవితాగోష్ఠి, గానసభలు మున్నగు వినోదములలో బంధుమిత్రులతో కలిసి శుభకార్యములలో పాల్గొని మృష్టాన్న భోజనము చేస్తారు. బియ్యము, వెండి, నూలు, బట్టలు, వ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. వారమంతా శుభయోగములతో కూడివున్నా మానసిక ఆందోళన కలుగుతూవుంటుంది.

### * ఆర్ద్ర [కూ, ఖ, జ, ఛ]*

ఈ వారము మీకు ఇష్టకార్యసిద్ధి, ధనధాన్యవృద్ధి, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, యత్నకార్యానుకూలత, పరోపకారమువల్ల కీర్తి, వాహనయోగములు కల్గుతాయి విలువగల వస్తువుల క్రయవిక్రయములలోవర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఇంట్లో వారికి అలంకారప్రాప్తి.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ, రాబడితక్కువ. గృహావసరములు తీరక కలతలు, అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనపడగానే వైద్యచికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతిచేయించుట మేలు. ఉద్యోగస్థులకు క్రొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన, రాజకీయవాదులకు అశాంతి త్రిప్పట 4వ పితృవర్గ సహాయము ధన లాభము, ప్రయాణము. రీన అనారోగ్య సూచనలు.

### * పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈవారము మీకు మిశ్రమ యోగము. మొదట్లో మీకు నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన, ఉద్యోగస్థులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్దకము వల్ల చదువు బాగాసాగదు. ఆవుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగము లున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తువుల సంపాదనవంటి మంచియోగములు కూడా వుంటాయి.

### ఈవారము ధరలు:

నూలు, వస్త్రంలు.- నిలకడగా వుండును.
నూనెదినుసులు:- మందగాగా వుండును.
ఆహారధాన్యములు. కొంత హెచ్చును.
బెల్లము, పంచదార, చింతపండు:- నిలకడగా వుండును.
పప్పుదినుసులు :- కొంచము పెరుగును.
వెండి, బంగారము.- స్వల్పముగా తగ్గును.
అతిసువృష్టిగా వుండును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణ అను పేరుననుమృగశిరానక్షత్రమును, స్వామి అను పేరునకు స్వాతియు, శ్రీనివాస అను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడు అను పేరునకు హస్తయును, భీముడు, భరతుడు అనే పేర్లకు పూర్వాషాఢ యోనూ చూచుకొనునది.

### * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము మీరు సహాయము పొందదలచుకున్న వ్యక్తి మూలముగా కార్యహాని పొందుతారు. ధనాభావము కూడా ఎక్కువ. ఇంట్లోవారి ఆరోగ్యము సరిగా వుండనందున చింత కలుగుతుంది. అయినా ఆధ్యాత్మిక భావము గలవారగుటచే దైవముపై భారము వేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి వర్తకులకు నిరాశ విద్యార్థులకు మంచి రోజులు కావు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతా దర్శనము, విచిత్రములను చూచుట, నష్టద్రవ్య లాభము కలుగును. వారమంతా యోగావయోగములు మిశ్రమముగా వుంటవి.

### * మఖ [మా, మీ, మూ, మే.]

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ప్రయత్నించిన కార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తవి. ఇతరులకు చేయదలచుకున్న సహాయము చేయలేకపోవుటచేత నిందలు పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ. తోటివారి సహకారము కలుగుతుంది. వర్తకులకు వారమంతా నిరాశగా వున్నా వారాంతమున మేలు పొందుతారు. విద్యార్థులకు చదువు బాగా సాగదు. గర్భవతులకు అనారోగ్యం కలుగుటచే ఆందోళన.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈ వారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టువిడవకుండా ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. అనుకున్న సొమ్ము సమయానికిరాక అప్పు చేస్తారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనికశాస్త్రజ్ఞులకు లోహ, ఖనిజ వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. గనుల యజమానులకు యంత్రములు నడుపు నిపుణులకు ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు మేలుకాలము. 8న ప్రమాదసూచన.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

గత రెండువారములనుండి కలుగుచుండిన కష్టములు గడిచి అధికారుల సహాయము చేతను, మీ నేర్పరితనము చేతను కార్యసిద్ధి పొందుతారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. వారమంతా యోగప్రదముగా వుంటుంది. ప్రయాణము, అధికారుల ఆదరణ, బంధు సహాయము కలుగుతవి. విద్యార్థులకు మేలుగా ఉంటుంది. డాక్టర్లకు, గణితశాస్త్రజ్ఞులకు కవులకు, చిత్రకారులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 6న అధిక ఖర్చులు.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము అన్ని ఇబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికందుతుంది. కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అవుతవి. పిల్లల మేలుకొరకు కొన్ని ఏర్పాట్లు చేస్తారు. నూతన కార్యారంభము చేస్తారు. ప్రభుత్వ సన్మానము కలుగుతుంది. పండితులతో శాస్త్రగోష్ఠి జరిపి జ్ఞానము వృద్ధిచేసుకుంటారు. విద్యార్థులు శ్రద్ధతో కొత్తవిషయాలు నేర్చుకొంటారు. వారమంతా యోగదాయకముగా వుంటుంది. 3న ఆందోళన కలుగుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మేలుకాలము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీకు యోగదాయకమైనను మానసికాందోళన కలుగుతుంది. నీటిమీద ప్రయాణము చేస్తారు. బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాలలో పాల్గొంటారు. దూరమందున్న ఆప్తుల క్షేమవార్త తెలిసి సంతోషం పొందుతారు. నూలు, బట్టలు, బియ్యము, నెంజి వ్యాపారస్తులకు వారమంతా లాభదాయకముగా ఉంటుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. శుభకార్యములలో పాల్గొంటారు.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

గతవారము పూర్తికాకుండా ఉండిపోయిన పనులు ఈ వారము లాభకరముగా చేయగలుగుతారు. ధనయోగము అనుకున్నదానికన్నా ఎక్కువగా కలుగుతుంది. పుణ్యకార్యాచరణలో పాల్గొంటారు. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికారము పెరుగుతుంది. స్త్రీలతోనూ, బంధువులతోనూ కలిసి విందువినోదములతో ఆనందిస్తారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈ వారము యత్నకార్యములకు ఆటంకములు. కార్యభారము ఎక్కువ. తీరుబడిలేని కార్యక్రమమువల్ల అకాలభోజనము చేయుటచే ఉష్ణాధిక్యము, కడుపునొప్పివంటి అనారోగ్య సూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందుట మేలు. వర్తకులకు శ్రమ ఎక్కువ. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడిచే శెలవు పెట్టవలసి వస్తుంది. రాజకీయవాదులకు మేలుగా ఉంటుంది. పితృవర్గము నుండి సహాయముచే ధనలోపము కొంత తీరుతుంది.


గ్రైపెండ్
బిడ్డల ఆరోగ్యాన్ని క్రమపరచును
అన్ని షాపులలోనూ దొరకును
వ్యాపార వివరములకు వ్రాయండి
విల్‌ఫ్రెడ్ పెరీరా ప్రైవేట్ లి.
మద్రాసు-7
56 TG



## తరచుగా మూత్రవిసర్జన

తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైనదిన్నీ శరీరాన్ని గుల్లచేయునదీ కూడా యీ వ్యాధి. తనబంధంలో చిక్కినవారిని రోజూకారోజూ మృత్యువుకు ఆసన్నం చేయును. ప్రథమదశలో శారీరక మానసిక శ్రమకు యిట్టిగించకుండుట, నరములలో నొప్పి, చూపు మాంద్యము, కీళ్లలో తిమ్మిరి నరముల బలహీనతతో యీ వ్యాధి పొడచూపును. [illegible] లతోకూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో అధికదాహం ఆకలి, గొంతు నోరు ఎండుట, దురదలు కాళ్లలో పగుళ్లు తూకంతగ్గడం శరీరమంతా పోట్లు కీళ్ల నొప్పులు. కంటిపొరలు. శయ్య గడలు రాచపుండ్లు, యిట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు ఎన్నో సంభవింపవచ్చును

"పీనసిధాంమ్" మాత్రలు వాడి అనేక వేలమంది తమబాధల నుండి నివారణపొంది మృత్యుకరాళమునుండి రక్షింపబడిరి "పీనస్ ధాంమ్" శాస్త్రీయ పద్ధతులమీద, ప్రాచీన యూనాని వైద్యవిధానప్రకారం అమూల్య ఓషధుల శాకపదార్థముల, ప్రాకృతిక క్షారముల సారముతో తయారైనవి. "అమిత దాహం తగ్గి... పలుమారు మూత్రవిసర్జనచేయు అవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలాభాగము నివారణగును కొద్ది రోజులలోనే మీకు సగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును "పీనస్ ధాంమ్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును దీనికి ప్రత్యేకపథ్యము లేదు నిరాహారముతో నుండే అవసరంలేదు రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై రోగులు యిదివరకటికంటే యెక్కువరకాల ఆహారపదార్థములు తీసికొనవచ్చును వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినచో ఉచితముగా పంపబడును

ధర: 50 మాత్రల సీసా రు 6-75
ప్యాకింగు పోస్టేజి ఉచితము
లభించు స్థలము:
VenusResearch Laboratory (A PW)
P O Box No 587. Calcutta

 # నక్షత్రఫలితాలు 

*** అనూరాధ [నా, నీ, నూ, నే] ***

ఈ వారము నిరాశగావున్నా మిత్ర సహాయమువల్ల క్రమేణా కార్యలాభము పొందుతారు. రహస్యములను కనిపెట్టుటకు ప్రభుత్వముచే నియోగించబడుతారు. ధనలోపమువల్ల ఆందోళన, ఉద్యోగస్తులకు బదిలీఅయ్యే యోగము లున్నవి. వర్తకులకు మాంద్యము, విద్యార్థులకు శ్రద్ధ తక్కువ, ప్రయాణము, విదేశీయులతో పరిచయము, వింతవస్తువుల సంపాదన, కార్యసిద్ధి కలుగుతాయి. ఇంట్లోవున్న వృద్ధుల ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది.

*** జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,] ***

ఈ వారము మీరు అనుకున్నట్లు పనులు జరుగవు. ధనాభావముచే ఇబ్బంది ఎక్కువ. ఒక వ్యక్తి సహాయమువల్ల పనులు చేకూదలుచుకున్నారో అతనే ఆటంకములను కలుగజేస్తాడు. ఆధ్యాత్మికచింత కలవారగుటచే ఈశ్వర కృపవల్ల కష్టములను గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగించుతుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వ్యాపారస్తులకు నిరాశ కలిగినా నష్ట ద్రవ్యలాభము కలిగిస్తుంది. సాధుసజ్జన సాంగత్యముచే ఆత్మవికాసము కలుగుతుంది.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. రావలసినడబ్బు చేతికందక అశాంతి, బంధువుల రాకపోకవల్ల ఖర్చులు ఎక్కువ. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనకూలిస్తవి. పనులకు చేకూదలచే సహాయము చేసేందుకు అవకాశములేక మాటపడతారు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారముపట్ల పేచీలు. 6వ భార్య అనారోగ్యమువల్ల మనోవ్యథ, విద్యార్థులకు బద్ధకముచే చదువు బాగాసాగదు.

***పూర్వాషాఢ | బూ, ధ, భా, ఢా |***

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు కలిగేఆటంకములకు నిరుత్సాహపడకుండా పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యసిద్ధి పొందుతారు. సమయానికి సొమ్ము అందక అప్పుచేయవలసి వస్తుంది. కాని వారాంతమునకు తీరుస్తారు. 6వ యంత్రములవల్లగాని, అగ్నివల్లగాని ఎత్తయిన స్థలములనుండి పడుటవల్లగాని కలిగేగాయాలు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనికశాస్త్రజ్ఞులకు, లోహపు సామానులు, రంగుల వ్యాపారస్తులకు, గనుల యాజమానులకు కష్టముతో కూడిన యోగము. ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, యంత్రములు నడుపు నిపుణులకు యోగకాలము.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము మీకు ధనయోగము. వ్యవహారాలలో జయము. శుభకార్యాలలో పాల్గొంటారు. బంధుదర్శనము. విద్యాప్రాప్తి. నూతన కార్యలాభము. ఈశాన్య దిక్కునుండి శుభవార్తతో ఉత్తరములు వచ్చుట, జ్ఞానమార్గ ప్రసంగములు, యుక్తిగా ప్రసంగించుట, గణిత జ్యోతిష శాస్త్ర చర్చలు, సుఖభోజనమువంటి మంచిఫలితాలు కలుగుతాయి, ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, ఇత్తడి, కంచు మొదలగు సరుకుల వ్యాపారస్తులకు లాభము. నటీనటులకు మేలు కాలము విద్యార్థులకు చదువు సరిగా సాగుతుంది.

*** శ్రవణము [జూ, జే, జో, ఘా] ***

ఈ వారము శుభకార్యములలో పాల్గొనుట, పుత్రప్రాప్తి సూచనలు, ధనలాభము. భాగ్యవృద్ధి, ఓగుగులు పొందుట, ప్రభుత్వ సన్మానము, ఘనకార్యచరణ, పుణ్యకార్యములు చేయుట, పుణ్యక్షేత్ర సంచారము, వైద్య జ్యోతిష శాస్త్ర ప్రసంగములవంటి మంచియోగములు కలుగును. విద్యార్థులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మంచి కాలము.

*** ధనిష్ఠ | గా, గి, గూ, గే | ***

ఈవారము మీరు వినోదాలలో పాల్గొంటారు. బంధుమిత్రులతో కలిసి వెండి పాత్రలలో దధి, క్షీర మధురపదార్థయుక్త సుఖభోజనము చేస్తారు. నీటిమీద ప్రయాణము, తలపెట్టినకార్యములలో జయము, తెల్లని వస్తువులు కొనుటవంటి మంచి యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, ద్రవపదార్థ జన్యముల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. ఈ వారము మానసికాందోళనవున్నా అలంకారప్రాప్తి, విందువినోదములు కలుగును. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలు కాలము. విద్యార్థులు బాగా చదువుకుంటారు.

***శతభిషం [గో, సా, సి, సూ ***

ఈవారము ధనధాన్యవృద్ధి, పశువృద్ధి కలుగును. కష్టము ఫలించును. వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభం, పరోపకారంవల్ల కీర్తిమొదలగు రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగాసాగుతుంది. వర్తకులకు బంగారము నవరత్నములువంటి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటనటులకు యోగకాలం.

*** పూర్వాభాద్ర | సే, సో, దా, దీ | ***

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. ఆరోగ్యము సరిగా లేని సూచనలు కనపడగానే గ్రహశాంతి చేయుటవల్ల మేలు కలిగించును. ఔషధ చికిత్సకూడా పొందుట మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన, విద్యార్థులకు సరిగా చదువు సాగదు. పితృవర్గమునుండి సహాయము, ప్రయాణము. కార్యభారము కలుగును. 6వ ఆరోగ్యభంగము. రాజకీయ వాదులకు ఆందోళన అధిక ఖర్చులు.

***ఉత్తరాభాద్ర | దూ, శం, ఛా, ధా |***

ఈ వారము అనుకున్న సొమ్ముసకాలములో చేతికిరాదు. కార్యాచరణకు పాలుపోని అనిశ్చితస్థితిలో వుంటారు. చేదామనుకున్న పనులకు ఆటంకములుకలిగినా వారాంతమునకు మిత్రసహాయమువల్ల కార్యలాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు బదిలీఅయ్యే సూచనలున్నవి. ప్రయాణము విదేశీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదన, మిత్రసహాయము కలుగును. 8వ ఆప్తుల ఆరోగ్యముగురించి చింత, విద్యార్థులకు చదువు బాగా సాగదు.

*** రేవతి | దే, దో, చా, చీ | ***

ఈ వారము మీకు మిశ్రమ యోగము. అనుకున్నట్టుగా పనులు జరుగవు. కోరిన సహాయము సకాలమునకు లభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారము వేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలముపొందుతారు. వర్తకులకు చాలా కాలమునుండీ నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. వ్యర్థ ప్రసంగములవల్ల ఉద్యోగస్తులు అధికారుల ఆగ్రహమునకు లోనౌతారు. పుణ్యపురుషుల సాంగత్యము, ఆత్మవికాసము, శాంతి, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, నష్టద్రవ్య లాభము కలుగును. 8వ ఇంట్లోవారి అనారోగ్యముచే చింత. 

---

**కామంచి**

'మా ఆయన నా మాటకు ఎదురు చెప్పరెప్పుడూ.'

'అబ్బ ఎంత మంచివారు?'

"అది మంచితనం కాదు. ఆయన తెలివితేటలు!"

# బ్రూక్ బాండ్ టీ




## ఇతర టీలను మించిన మంచి టీ

BB 329 K

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

# [illegible] శ్రద్ధ!



శ్రీరామకృష్ణ పరమహంసశిష్యుల్లో ముఖ్యుడు వివేకానందుడు. రామకృష్ణ పరమహంస సాంగత్యమూ, శిష్యత్వమూ కలగకముందు వివేకానందుడు పరమనాస్తికుడుగా వుండేవాడు. దేవుని సంగతి ఎవరన్నా అన్నట్టు వినపడిందా వీపుచిట్లగొట్టుతుండేవాడు. అలాటి పరమ నాస్తికుడు కూడా రామకృష్ణ పరమహంస శుశ్రూషలో అత్యుత్తముడైన ఆస్తికుడుగా తయారైనాడంటే అంతకంటే ఆశ్చర్యకరమైన విషయం ఏముంది!

వివేకానందుడు మత సంబంధంగా విదేశాల్లో పర్యటించి వివిధ ప్రాంతాల్లో ఉపన్యాసాలు కూడా యిచ్చాడు. ఆయన పర్యటనలో ఎన్నో విశేషాలు జరిగాయి. అందులో ఒకటి చాల విచిత్రం.

అప్పుడు ఆయన అమెరికాలో పర్యటిస్తూన్నాడు. ఏదో ప్రదేశంలో తన కార్యక్రమం ముగించుకుని ఇంకోచోట మళ్లీ మొదలుపెట్టవలసినందువల్ల ఆయనొక సుదీర్ఘమైన రైలు ప్రయాణం చేయవలసివచ్చింది. ప్రొద్దున ఏడుగంటలకి రైలెక్కాడు. నిర్ణీతమైన కాలంలో రైలు నడిచిందంటే మరు రోజు తెల్లవారేసరికి గాని ఆయన గమ్యస్థానం చేరలేదు. అంతటి సుదీర్ఘమైన ప్రయాణ మది.

రైల్లో ఆయనొక్కమూల కూచున్నాడు. చుట్టుపక్కల ఎంతోమంది ఎన్నోరకాలుగా వుంటూ, ఏవేవో మాట్లాడుకుంటూన్నా ఆయన కనీసం వారివేపైనా చూడటంలేదు. అందరితోటీ ముభావంగా వున్నాడు. అయితే ఆయన భారతదేశంనుంచి వచ్చిన ఒకానొక మహాయోగి అని అక్కడున్నవారికి తెలియదు. ఆయన బాహ్యస్వరూపమే వాళ్లకు తెలియనప్పుడు, ఆయన అంతశ్శక్తి, మహత్తు వారికి తెలియకపోవడం విశేషం కాదు.

బండి పరుగెడుతూనే వుంది. క్రమంగా పొద్దెక్కింది. మధ్యాహ్నం కూడా మీరిపోతూంది. పొద్దుట్నించీ పచ్చి మంచినీళ్లేనా ముట్టలేదు వివేకానందుడు. ఆయనతోపాటు దూర ప్రయాణం చేస్తున్నవాళ్లిది గమనించారు. వాళ్లు భోజనం చేస్తూ ఆయనకు కూడ పెట్టబోయారు. కాని సున్నితంగా చేత్తో వారించాడు వివేకానందుడు. కనీసం రొట్టెముక్కయినా పుచ్చుకోమని బలవంతం చేశారు వాళ్లు. కాని వివేకానందుడు తనకి భోజనం దేవుడు పంపిస్తాడనీ, అది వచ్చేవరకూ ఏదీ ముట్టుకోదలచ లేదనీ వాళ్లకి సమాధానం చెప్పాడు. రెండు మూడు సార్లిలా అనేటప్పటికి ఆయన విషయం తెలుసుకోలేక పిచ్చివాడికింద జమకట్టి తమలో తాము నవ్వుకున్నారు.

పరుగెడుతూన్న బండి ఒక్కసారిగా ఓ కుదుపుతో ఆగింది ఓ స్టేషన్‌లో. ఎక్కేవాళ్లు ఎక్కు

"వేల్పుచర్ల"

బాల సాహితి

# ఆయుర్వేదం - పాండిత్యం

మధుర శ్రీ

మాళవ రాజ్యాధిపతి విక్రమవర్మ ఆస్థానంలో ఒక ఆయుర్వేద వైద్యుడూ ఓ పండితుడూ వుండేవారు. వైద్యుని పేరు నిగమశర్మ. పండితుడి పేరు కేదారశర్మ. ఒక్క క్షణం కూడా యిద్దరికీ పడేది కాదు.

ఇలా వుండగా ఓసారి పండితుడు కేదారశర్మకు వళ్లుసుస్తీ చేసింది. గత్యాంతరం లేక వైద్యుడికి కబురు పంపాడు. కబురు వినగానే వైద్యుడు మండిపడ్డ "అయ్యో! పాపం? రోగి కదా" అన్న అభిప్రాయంతో బయలుదేరి వచ్చాడు.

రాగానే పండితుడి నాడి పరీక్షించి "అబ్బే! మరేం లేదు మామూలు జ్వరం. లంఘనం చేసి కాస్త కంటకారి కషాయం త్రాగితే సరి. రేపీపాటికి తగ్గిపోతుంది" అని చెప్పి వెళ్లాడు.

పండితుడు కేదారశర్మ పాండిత్యంలో ప్రతిభావంతుడే కాని-ఆయుర్వేదంలో యిసుమంతైనా పరిచయం లేనివాడు. అంచేత లంఘనం అంటే ఏమిటో - కంటకారి-అంటే ఏమిటో-అర్థం కాలేదు. ఎవర్నన్నా అడుగుదామంటే నామోషీ. చతుశ్శాస్త్ర పండితుడినైన నేను కేవలం రెండు శబ్దాల అర్థం తెలీక యితరుల నడగటమా అన్న అహంభావం కలవాడు. అందుకని తానే తెగ ఆలోచించి లంఘ్ అన్న శబ్దం మీద నుండే లంఘనం అన్న ధాతువు వస్తుంది. యిహ లంఘ్ అంటే ఎగిరి దూకటమన్న అర్థం తెలుస్తూనే వుంది. అని నిర్ధారణ చేసి కూతురు శాంబరిని పిల్చి నిచ్చెన తెచ్చి గోడకు చేరగిల వేయమన్నాడు.

అక్షరాలా పితృవాక్యపరిపాలకురాలైన శాంబరి అలాగే తెచ్చి వేసింది. పండితపుత్రః పరమ శుంఠః అన్నట్లు శాంబరి లౌకిక జ్ఞానం లేని శుద్ధ చవట. వెంటనే పండితుడు త్రెళ్లుతున్న జ్వరంతో ఎలాగో తంటాలుపడి చివరిదాకా ఎక్కి అక్కడ్నించి "దభీ" మని లంఘించాడు. అంత ఎత్తునుంచి దూకటంతో కాళ్లు రెండూ విరిగాయి మోకాళ్లు మోచేతులూ కొట్టుకుపోయాయి. ఒళ్లంతా హూనం అయింది.

ఇంతలో శాంబరివచ్చి "నాన్నా లంఘనం చేశారా?" అంది.

"చేశానమ్మా! చేశాను! మోకాళ్లు రెండు విరుచుకున్నాను. అయినా లంఘనం యింత ప్రమాదకరమైందని నాకు తెలియదు" అన్నాడు బాధతో.

"అయితే మరి! కషాయం పెట్టాలా!"

"పెట్టమ్మా! పెట్టు! లంఘనం చేసి కషాయం త్రాగకపోతే ఎలా?" అన్నాడు మూల్గుతూ.

---

తూన్నారు. దిగేవాళ్లు దిగుతున్నారు. ఇంతలో ఓ కుర్రాడు ఓ పెద్ద కారియర్ పట్టుకొని స్టేషన్‌లోకి వచ్చాడు. స్టేషన్‌మాస్టర్ని "భారతదేశం నుంచి వస్తూన్న సన్యాసి వుండేదెక్కడ" అని అడిగాడు. ఆయనవల్ల తెలుసుకుని నేరుగా వివేకానందుడున్న పెట్టె దగ్గరికివచ్చి ఆయన్ని సమీపించి నమస్కరించి యిలా అన్నాడు ఇంగ్లీషులో "స్వామీ రాత్రి నాకు ఏసుక్రీస్తు ప్రభువు కలలో కనిపించి మీరు ఈ బండిలో వస్తున్నారనీ, మీకు భోజనం తీసుకు వెళ్లమనీ చెప్పారు. అందుకే తెచ్చాను. ఆరగించండి స్వామీ."

కారియర్ మూత తీసి ప్లేట్లలో వడ్డించాడు ఆ కుర్రాడు. వివేకానందుడు ఏమీ మాట్లాడకుండా ఆప్యాయంగా ఓసారి ఆ కుర్రాడి మొహంలోకి చూచి ఆరగించటం మొదలెట్టాడు.

కుర్రాడు చెప్తూన్న మాటలు విని తెల్లబోయారు. ఆయన్ని పిచ్చివాడనుకున్న ప్రబుద్ధులంతా. ఆయన వైపు చూడ్లేక మొహం తిప్పుకొని పశ్చాత్తప్తులై మనస్సులోనే ఆయనకు నమస్కరించారు.

తన భక్తునికి భోజనసదుపాయాలు కల్పించడంలో భగవంతుడు చూపిన శ్రద్ధ చూస్తే భగవంతునిపై ఆ భక్తుని ప్రభావం ఎలా పనిచేసిందో ఊహించవచ్చు!



# ★ ఆయుర్వేదం-పాండిత్యం ★

"మరి! కంటకారి అంటే ఏమిటో! నాకు తెలియదే?" అయోమయంగా అర్థంకాని ముఖంపెట్టి అడిగింది శాంబరి.

"ఆ! ఏముంటుందమ్మా! కంట కన్యఅరిః-కంటకారి-అవుతుంది.కంట కన్య అంటే ముల్లుకు అరిః అంటే శత్రువు ముల్లుకు శత్రువు చెప్పు కదటమ్మా! మనవుగ్రాణంలో తాతలనాటి పాతజోడు ఒకటి చూరులో దోపివుంటుంది. దాన్ని బాగా శుద్ధిచేసి-చాది కషాయం పెట్టుకురా!" అన్నాడు. అప్పటికే మోకాళ్లు రెండూ రబ్బరు బెలూన్ల మాదిరి వాచి పోయాయి.

అరగంట కల్లా అడిగినప్రకారం కషాయం పెట్టుకొచ్చి తండ్రికిచ్చింది కూతురు. కషాయం కడుపులోకి వెళ్లింది మొదలు కలియతిప్పటం ప్రారంభించింది. ఎడతెరిపి లేకుండా వాంతులు చిమ్మసాగాయి. కక్కలేక కళ్లు తిరిగాయి. స్పృహతప్పిన వాడిలా నీరసంతో పడకపైవాలి పోయాడు.

వైద్యుడు మర్నాడు యథాప్రకారం వచ్చాడు రోగిని చూట్టానికి. రాగానే మోకాళ్లకంతా పట్లతో, పీక్కుపోయిన కళ్లతో పాలిపోయిన ముఖంతో చచ్చేట్టున్న శర్మగార్ని చూసేసరికి గుండె గుభేల్మంది.

"ఏమండీ! అలా నీరసంగా వున్నారు!" వుండబట్టలేక అడిగాడు వైద్యుడు "ఏముంది! నువ్వు చెప్పినట్టే లంఘనం చేయమంటివి! చేశాను. అంత ఎత్తునుంచి దూకటంతో కాళ్లు రెండూ విరిగాయి. కంటకారి కషాయం త్రాగమంటివి. తాతలనాటి పురాతనమైన పాత జోడుతో కషాయం పెట్టించి తాగాను, కక్కలేక చచ్చా!" అన్నాడు మూల్గుతూ.

**చిట్టిబాబు**

చిట్టిబాబూ! జామి
చెట్టునెక్కవురా!
చిగురు కొమ్మలదాక
ఎగబ్రాకబోకు!
నాన్న ఊరికి పోవు
నప్పుడే చెప్పేరు
నీవు చెట్టెక్కితే
నేను తినవలె తిట్లు!
పట్టి సరదాకొరకు
చెట్టులెక్కేవురా!
కాలుజారును రయ్య
నేల కూలేవు!
చక్క చక్కని పళ్లు
చాల తియ్యని పళ్లు
మామయ్య తెస్తాడు
మనకు బోలెడు పళ్లు
అమ్మనుర నామాట
ఆలకించర సుంత
కమ్మనిది తాయిలము
కావలసినది యిత్తు.

వి. నారాయణరావు.

వైద్యుడు పండితుని తెలివితక్కువతనానికి తానే నవ్వుకొని-యింకా పండితుడి గర్వం అణచాలనే వుద్దేశంతో— "మంచిపని చేశారు! మీ శరీరంలో చాలారోజులుగా పేరుకొన్న-పైత్యం-వాతం రెండూ కరిగిపోయాయి. యింకేం ఫర్వాలేదు! బోడితరం లేదూ అది తీసుకొచ్చి యీ చూర్ణం అందులోవేసి కషాయం త్రాగారంటే-రేపీపాటికల్లా మామూలుమనివవుతారు." అన్నారు.

"బోడితరం ఎక్కడుంటుంది?" ముసుగుతీయకుండానే అడిగాడు వైద్యుణ్ణి.

"ఆఁ! ఎక్కడో ఏముంది! కాస్త చల్లగావుంటే నీటి అంచున వుంటుంది! నస్తా! రాజవీధిలో మరో కరియింటికి వెళ్లాలి!" అంటూ వెళ్లి పోయాడు వైద్యుడు.

వైద్యుడు వెళ్లగానే పండితుడు ముసుగుతీసి శిష్యుణ్ణిపిలిచి-

"ఒరేయ్! అబ్బాయ్! వెళ్లి బోడితరం తీసుకురా?" అని ఆజ్ఞాపించాడు.

అందుకు— "బోడితరం! అంటే ఏమిటి స్వామీ!" తెలిక గుడ్లు మిటకరించాడు శిష్యుడు.

'ఆఁ! ఏముందిరా! ఇయం బోడః - ఇయం బోడతరః - ఇయం బోడతమః - ఇహా బోడః - అంటే నున్నగా గుండ్రంగా వుంటుంది. నువ్వు తేవాల్సింది. బోడతరం - ఇది చల్లగా నీటి అంచున మధ్యస్తంగా వుంటుంది-పో!" అన్నాడు.

చెప్పిందే తడవుగా దబదబా పరిగెత్తాడు శిష్యుడు చెరువుగట్టుకు. అప్పుడే సరిగ్గా అదేసమయానికి నున్నగా గుండు చేయించుకొని గొంతులోతు నీళ్లలో మునిగి ముఖాలు అటువేపు సారించి వున్నారు.

శిష్యుడికి వరసగా మూడుగుండ్లు కనిపించగానే-ఇయం బోడః-ఇయం బోడతరః-ఇయం బోడతమః-

గురువుగారు తెమ్మంది బోడతరం. అంటే రెండవది. అనుకుంటూ వెళ్ళి ఒక్కదూకున లటుక్కున పట్టుకున్నాడు గట్టిగా, జారి పారిపోతుందేమోనని.

హఠాత్ సంఘటనకు దిగ్భ్రాంతుడైన సాతాని శిష్యుడి చెంపవాచిపోయేలా సాచి లెంపకాయ అంటించాడు. దాంతో తతిమ్మా యిద్దరు కూడా చేరి శిష్యుడి దేహం హూనం చేసి మరీ వదలిపెట్టారు.

శిష్యుడు ఏడుస్తూ గురువును చేరి- "మీరు సాయించినట్లే చెరువుదగ్గర యియం బోడః-యియం బోడతరః-ఇయంబోడ తమః మూడూ వున్నాయిపోయిబోడతరాన్ని పట్టుకొన్నా. అంతే-సాచి వాచిపోయేలా లెంపకాయయిచ్చింది. అంతటితో ఆగక తతిమ్మా బోడః-బోడతమః-రెండు కూడా చేరి నన్ను చావగొట్టాయి. అంచేత నేను బోడతరం తేలేను! స్వామీ!" అంటూ భోరున ఏడ్చాడు.

మరునాడు యథావిధిగా వైద్యుడు రాగానే "గీ" మంటూ తగులుకున్నాడు పండితుడు కేదారశర్మ- "నీకు వైద్యమూ రాదు! నా శ్రాద్ధమూ రాదు. నువ్వొక శుద్ధ అప్రయోజకుడివి. లేకుంటే లంఘనం అంటూ కాళ్లు చేతులు విరిచావ్! కంటకారి సాకుతో శుద్ధ శ్రోత్రియుడైన నాచేత చెప్పునీళ్లు త్రాగించావ్! అంతటితో ఆగక బోడతరమని నలుగురిలో నా శిష్యుణ్ణి వాళ్లు వాచేలా కొట్టిస్తావా! అసలీ పేర్లు ఆయుర్వేదంలో వున్నాయా! లేక నన్ను శృంగభంగం చేయాలనే యివి కల్పించావా! చెప్పు! రేపు ఆస్థానంలో నీ పరువు పదిమందిలో తీయిస్తాను!" అంటూ హుంకరించాడు.

అందుకు వైద్యుడు పకపక నవ్వి- "శర్మగారూ! మీకు పాండిత్యముంది కాని ఆయుర్వేదం తెలియదు. నాకు ఆయుర్వేదం తెలుసు కాని పాండిత్యంలో పరిచయం లేదు. మీరు అది తెలిసికూడా నిండుసభలో చాలాసార్లు అపశబ్దాలు- అర్థంలేని పదాలు అని అవమానాలపాలు చేసారు. సంస్కృతంలో శబ్దార్థానికీ - ఆయుర్వేదంలో వ్యావహారికపరిభాషలో వున్న అర్థానికి చాలా తేడావుంటుంది. లంఘనం- అంటే తేలికగా ఆహారం పుచ్చుకోమనిగాని గోడలెక్కి దూకమనటం కాదు. కంటకారం అంటే చెప్పులు కావు. దాన్ని వాకుడు చెట్టు అంటారు. మీకు సర్వం తెలుసునన్న అహంభావమే మిమ్మల్నీ గతికి తెచ్చింది. ఒకర్ని అడగటానికి నామోషీ-! బోడతరమంటే ఎవర్నడిగినా చెప్పేవాళ్లే. చల్లటి ప్రాంతంలో అనగానే సాతానుల గుండ్లుపట్టుకొంటే ఎలా! రేపీ విషయం సభలోనే చెప్పండి! నలుగురూ మీ తెలివితేటలకు నవ్విపోతారు. ఇకనైనా బుద్ధి కలిగి వుండటం మంచిది! వస్తా! సెలవ్!" అంటూ చివాలున లేచి నిష్క్రమించాడు వైద్యుడు. తన తెలివితక్కువతనానికి తనలో తానే కుళ్లిపోయాడు పండితుడు-! ★

దొంగ: 'నీ ప్రాణమో - ధనమో తేల్చుకో- ఏదో ఒకటి వదులుకోక తప్పదు.'

ఆసామి: 'తీసుకోవయ్యా వెధవ ప్రాణం- పెత్తనంలో డబ్బులేక ఇబ్బంది పడాల్సొస్తుంది.'

మీకు నమ్మకమైన నీలగిరి తైలం కావాలంటే
కేమిల్ బ్రాండ్ వాడండి



అది కల్తీలేనిది..

# బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

ద్వారంపూడి సత్యనారాయణరెడ్డి (తొస్సిపూడి, తూ. గో. జిల్లా) అరిపిరాల వెంకట చంద్రపాల్ (శికింద్రాబాదు) టి. నారాయణరెడ్డి (కొత్తపల్లి, సేలంజిల్లా) అరిపిరాల వెంకటకృష్ణకుమార్ (శికింద్రాబాగు) కుమారి జాలూరి వెంకటరమణ (విజయవాడ) ఒ. జనార్ధనరావు (హైద్రాబాగు) బచ్చు సూర్యనారాయణమూర్తి (మద్రాసు) సుంకరణం సూర్యనారాయణ (నెల్లూరు) యడ్ల సుదర్శనరావు (చిలువూరు, గుంటూరుజిల్లా) పెదగంటం నారాయణరావు (పెద్దాపురం, తూ. గో. జిల్లా) అయ్యగారి భాస్కరరావు (బిలాసపూర్) కవళి మంజులవాణి (బిర్ సింగ్ పూర్, యస్. ఐ. రైల్వే) శంభంగి సుభాష్చంద్రబోసు (భీమడోలు, ప. గో. జిల్లా) కల్లపరి భాగ్యలక్ష్మి (డోను, కర్నూలుజిల్లా) వై. వి. యల్ నారాయణప్రసాదు (గుంటూరు) వరికూటి మహేశ్వరరావు (చింతలపూడి, ప. గో. జిల్లా) వాసిరెడ్డి రమణకుమారి (పల్లెకోన, గుంటూరుజిల్లా) యిగ్గోని అవనిజ (గుత్తి, అనంతపురంజిల్లా) యస్. సుభాషిణి సరళకుమారి (కొవ్వూరు, ప. గో. జిల్లా) అళిక్కి సీతారత్నం (పెద్దాపురం, తూ. గో. జిల్లా) యల్లాప్రగడ స్వరాజ్యలక్ష్మి (తెనాలి, గుంటూరుజిల్లా) యల్లాప్రగడ వెంకట భాస్కర పుండరీకాక్షుడు (కాకినాడ, తూ. గో. జిల్లా) కూరెళ్ళ కృష్ణమూర్తి (శికింద్రాబాగు) బసవా వేణుగోపాలరావు (అల్లవరం, తూ. గో. జిల్లా) ముక్కు జగదీశ్వరరావు గుప్త (నిజామాబాగు) వి. రామకృష్ణ (వెల్పూర్, నిజామాబాగు జిల్లా) కొంగర మునిరత్నంచౌదరి (కోటాల, చిత్తూరుజిల్లా) వరుకుల సుదర్శన్ (ఖర్గపురం మిడ్నాపూర్ జిల్లా) పంద్రవాడ సీతారామయ్య (కర్నూలు) ముసునూరి శేషశాయి (బళ్లారి) వాజయాజుల వెంకటసత్యనారాయణ (ముద్దనూరు, కడపజిల్లా) ముగుసూరు కళాచంద్రరెడ్డి (డాలవాక్కం, చెంగల్పట్టు జిల్లా) మైలవరపు సత్యబాల భాస్కర కనకదుర్గాప్రసాదు (పాలూరు, శ్రీకాకుళంజిల్లా) మైనగపు సుబ్రహ్మణ్యసత్య వెంకటేశ్వర శివశంభుచంద్రశేఖరరావు (పాలూరు, శ్రీకాకుళంజిల్లా) పెద్దకోట్ల నాగలు సుధాకర్ రెడ్డి (కర్నూలు జిల్లా) టి. కె. సుభాసి (నందికొట్కూరు, కర్నూలుజిల్లా) సన్నిధి బాలకృష్ణారావు (ఏలూరు, ప. గో. జిల్లా) రావు కుంతీదేవి (బొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా) జీడిగుంట హానకొలరావు (తణుకు ప. గో. జిలా) కోట నాగేంద్రప్రసాద్ (మచిలీపట్నం, కృష్ణాజిల్లా)

మల్లెల సుబ్రహ్మణ్యేశ్వర ఛాయామాణిక్య రాజ్యలక్ష్మి (కస్పా పెంటపాడు, ప. గో. జిల్లా) అన్నం మల్లిఖార్జునరావు (తెనాలి, గుంటూరుజిల్లా) అన్నం అరుంధతి (తెనాలి, గుంటూరుజిల్లా) చల్లా సుగుణసుందరి (విజయవాడ) మేడేపల్లి సీతారామాంజనేయ ప్రసాదు (విజయవాడ) జి. శ్రీమన్నారాయణమూర్తి (విజయవాడ) నందిరాజు లీలారాణి (ఏలూరు, ప. గో. జిల్లా) బంధకవి వెంకట కుమారరోహిణిబాబు (రాజమండ్రి, తూ. గో జిల్లా) కొండేపూడి వరలక్ష్మి (ఉంగుటూరు, ప. గో. జిల్లా) కుదరవల్లి వెంకటసుబ్రహ్మణ్యేశ్వరరావు (రేమండ కృష్ణాజిల్లా) సంగెపు సత్యనారాయణ (గుంటూరు) ఈదా జెయిని స్వర్ణలత (విజయవాడ) మాదిన రామకృష్ణయ్య (మనులాలాపేట నెల్లూరు జిల్లా) కె. పద్మనాభరెడ్డి (పుటపల్లి, మహబూబ్ నగర్ జిల్లా) పరచా మురళీ కృష్ణారావు (లింగాల, కృష్ణాజిల్లా, గోరంట్ల రాజేశ్వరి ఉప్పలపాడు (గుంటూరుజిల్లా) జి. పాండురంగయ్య (జడ్చర్ల మహబూబ్ నగర్ జిల్లా) పాలంకి సత్యనారాయణ (హైదరాబాగు) సూరపనేని వీరభద్రరావు (నానపాముల కృష్ణాజిల్లా) కేతిరాజు రాజేశ్వరి (వెలుదుర్తి, గుంటూరుజిల్లా.)

పెంటపల్లి వీరవెంకట సూర్యనారాయణమూర్తి (తుని) పమిడిఘంటం శివప్రసాద్ (మచిలీపట్నం, కృష్ణాజిల్లా) జాలూరి నాగరాజారావు (శికింద్రాబాగు) పోతుగంటి మాబుసాహెబ్ (కమలకుంట్ల, కడపజిల్లా) ఉప్పలూరి నటరాజు (గుడివాడ, కృష్ణాజిల్లా, అయిలవరపు వెంకట శ్రీనివాసం వు (బొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా) వి. బి. రామారావు (హైదరాబాదు) యామిజాల సూర్యకాంతము (నాయకంపల్లి, తూ. గో. జిల్లా) తాడినాడ వెంకట లక్ష్మీనరసింహారామశేష విఠలపాండురంగ కృష్ణమూర్తి (చల్లపల్లి కృష్ణాజిల్లా) నెల్లుట్ల ఈశ్వరచంద్రం వు (హైదరాబాదు) అరిబిండి అరుణకుమారి (పెంచికల్ దిన్నె, నల్లగొండ జిల్లా) ఎరబోలు గజలక్ష్మి (దక్షిణ విజయపురి, గుంటూరుజిల్లా) పసుపులేటి పద్మావతీదేవి (చాగంటిపాడు, కృష్ణాజిల్లా) కన్నెగంటి సాంబశివరావు (పటమట, కృష్ణా జిల్లా) వెలమకన్ని కేసరి భరద్వాజ (సూర్యాపేట, నల్లగొండజిల్లా) నన్నపనేని నాగేశ్వరరావు (నిడుబ్రోలు, గుంటూరుజిల్లా) కోపల్లె శ్యామసుందరమూర్తి (మిర్యాలగూడ, నల్లగొండజిల్లా) మాచర్ల సాంబశివరావు (భట్టిప్రోలు, గుంటూరుజిల్లా) ఆకెళ్ళ వెంకట సుబ్రహ్మణ్య సత్యనారాయణమూర్తి (రాజమండ్రి తూ. గో. జిల్లా) మైనంపాటి కామేశ్వర్ (కర్నూలు)

వి. సాయిలక్ష్మి (ఏలేశ్వరము, తూ. గో. జిల్లా) కందాళం శ్రీధరరావు (గుంటూరు) అయ్యగారి బాపిరాజశర్మ (విజయవాడ) శిష్టా సత్యనారాయణమూర్తి (గుంటూరు) కె. యమ్. యన్. శర్మ (హైదరాబాగు) యస్. మెహతాబ్ బేగం (కోయిటాకు గడ్డ, కర్నూలు జిల్లా) చాగలి చంద్రశేఖరశాస్త్రి (నరసాపురం, ప. గో. జిల్లా) మిరియాల నారాయణ మురళీమోహనరావు (గిరవాడ, తూ. గో జిల్లా) పాలెపు వెంకట మహేశ్వరకృష్ణప్రసాద్ విమల (చేబ్రోలు, గుంటూరుజిల్లా) పజ్జా లీలా మా[illegible]వరావు (ఆచంట, ప. గో. జిల్లా) గుడిపాటి కోటేశ్వరశర్మ (విజయవాడ) వేములరంగ (విజయవాడ) హాస్కునూరి లక్ష్మీకుమారి (విజయనగరం, విశాఖజిల్లా) పంతం కొబ్బాయివి లక్ష్మీసరస్వతీదేవి (గద్దనాపల్లి, తూ. గో. జిల్లా) గట్టినేని సంపూర్ణ సారస్వతేంద్ర వరప్రసాద్ (చినగాదెలవర్రు గుంటూరుజిల్లా) గంటి కృష్ణమోహన్ (కాకినాడ, తూ. గో. జిల్లా) కొడవంటి లక్ష్మీప్రసాద్ (విశాఖపట్నం) యస్. సైనాదేవి (హైదరాబాగు) వగ్యాల రంగనాయకమ్మ (హైదరాబాదు) కొల్లా రంగారావు (వైరా, ఖమ్మం జిల్లా.)

గోళ్ళ రమాకుమారి (హైదరాబాదు) ద్రోణంరాజు సత్య తిరుమలరావు (పెద్దాపురం, తూ. గో జిల్లా) ద్రోణంరాజు వీరరాఘవరావు (పెద్దాపురం, తూ. గో. జిల్లా) ఇటూరి ప్రభావతి (విజయవాడ) అయ్యగారి లింగమూర్తి (నర్సీపట్నం, విశాఖ జిల్లా) ఫార్ధి లక్ష్మీ నరసమ్మ (ఏలూరు, ప. గో. జిల్లా) కె. ముత్యంరెడ్డి (సూర్యాపేట, నల్లగొండజిల్లా) అన్నాప్రగడ కనకలత (కొవ్వూరు, ప. గో. జిల్లా) అక్కినేని జనార్దనరావు (నడకుదురు, కృష్ణాజిల్లా) ఆర్. ధనంజయుడు (నగరి చిత్తూరు జిల్లా) ఆర్. నాగరాజ (నగరి, చిత్తూరు జిల్లా)



* వచ్చే వారం *

## బాలల సంఘం సభ్యులకు ఒక ముఖ్యవార్త!



# కావ్యలోకంలో కన్నీరు పెట్టి కార్యాలు సాధించిన కాంతామణులు

('ముక్కు చివర కోపమూ, పిలిస్తే కన్నీళ్లూ, ఇవి రెండూ ఆడవాళ్లకు పర్యాయ పదాలని పెద్దలు అంటారు. అరున్నొక్క రాగమైనా-'రాళ్లరగించే,' లాగా ఆలపించగల మహిళామణులను చేతనాజగత్తుకు పెట్టని ఆభరణాలు. కేవలం వారు కన్నీరు పెట్టినా ఎంత శోభస్కరంగా, రసాత్మకంగా ఉంటుందో రచయిత్రి ప్రాచీన కావ్యలోకంలో నుంచి కొన్ని మచ్చుతునకలు ఇక్కడ పేర్కొంటున్నారు.)

"వేడి యశ్రులు నిగుడంగ వెక్కివెక్కి
యేడ్వదొడగె లతాంగి పృథ్వీశు మ్రోల
మృగుం పరివేదనాతుగో నిశ్రమధుర
కంఠ కాకు వికార కోకిలిక యలర."

రాయబారిగా వచ్చిన నలుని ముంగు ఏడుస్తోంది దమయంతి. ఊరికే కన్నీరు కారుస్తూ అవనతముఖి అవలేదు. వెక్కి వెక్కి యేడ్చింది. వచ్చిన ప్రియుడు కట్టెదుట కూర్చొని నిలింపులలో ఎవరినైనా వరించమని రాయబారం నడుపుతూ వుంటే మృదులమైన ఆమె మనస్సు క్షుభితమైపోయింది. 'నాను విటబట్టి యే నీకు మాన్య నేని!' అంటూ ఎంత ప్రార్థించినా, పరిదీన మూర్తియై వేడినా, ఆ రాయబారి వినలేదు. యుక్తియుక్తంగా, ప్రియంగా, సౌమ్యంగా చెప్పి చూసినా కఠినమనస్కతే ఎదురయింది. కోయిలను రెట్టిస్తూ వుంటే మరీ కూస్తుంది మనోహరంగా. మాటల్లోకి దింపుతే ఆ తీయని స్వరం యింకా వినవచ్చని నలుని ఉబలాటం. దానికి దారియిదా...! పాపం, చివరకు దమయంతి 'అప్రతి విధానంబయిన ప్రియావాప్తి విఘాతంబున హృదయంబు కలంగిన' వెక్కి వెక్కి యేడ్వటం మొదలిడింది. శ్రీనాథుని లేఖిని ప్రౌఢ సమాసాలతో, మనోజ్ఞాలంకారాలతో చిత్రిస్తోంది అప్పటి దమయంతీ విషాదపూరిత చిత్రాన్ని.

అప్రతిభుడై పోయాడు నలుడు. విభ్రాంతుడయ్యాడు (కలలోకూడా అనుకొని వుండడు ఆమె ఏడుస్తుందని) తనను, తన్ను రాయబారార్థం పంపిన వేల్పుల్నీ విస్మరించాడు అందాకా పరిపోషించుకుంటూ వచ్చిన బింకం, బెట్టూ కాస్తా ఆమె కన్నీళ్ళకు జడిసి అంతా పికారుకు పరుగెత్తాయి. స్వచ్ఛమైన (అను)రాగంతో అంటున్నాడు.

ఏమిటి కేడ్చెద వానన
తామరసం బెత్తి చూడు తరుణీ! నన్నుం
గోమల కటాక్ష వీక్షా
దామక మున వీరసేను తనయుంగా నలునిన్.

కుమారి కె. లక్ష్మి

విచలితుడై తన్నుదాను వెలువరించుకున్నాడు నలుడు. కన్నీటికి కానుక లభించింది. సన్నివేశం సాధురాతి మధురంగా మలుస్తూ శ్రీనాథుడు, చదువుతూ మనమనుభవించినంత ఆనందాన్ని పొంది వుంటాడా అని సందేహం నాకు!

* * *

చక్కని హృదయంగమమైన యీ సన్నివేశంలో దమయంతి విషాద భూమికను గురించి ఆలోచిస్తూంటే, విషాదవీణ వాయించే ప్రబంధనాయికలు స్మృతిపథంలో మెదిలారు. సాహిత్యంలో ఏడుపు దాన్ని గురించిన వర్ణన, అష్టాదశ వర్ణనలతో ఏడుపు పద్యాలు యిందుమించుగా సంపాదించుకున్న స్థానమూ, ఏడుపుకీ స్త్రీలకీ ప్రచారంలోనూ ప్రత్యక్షంగానూ వున్న అవినాభావ సంబంధమూ ..ఆలోచనాపరిధి నాక్రమించుకున్నాయి.

ఏడుపు అనేది ఓ విలాసగుణమా! ప్రక్రియా? గుండె నిండిన వ్యథ, ఉద్వేగాల వల్ల కన్నీరు వెల్లువలవటం ప్రాణులకు సహజమే. దీనిలో తరతమ భేదాలు లేవు. కష్టం కలిగినప్పుడు కార్చిన కన్నీరు వల్ల వర్షానంతరం నీలాకాశంలా మానసం సుప్రసన్న స్థితిని పొంది తేరుకోవడం అనుభవమే.

"కల్లకెగదాని సలిలంబు కలచునప్పుడు
చెరువు రక్షింప గతి తూము తెలియుటొకటె
ఘనవిషాదంబు హృదయంబు గలచునప్పుడు
దానిరక్షింప నేడుపే దగినమందు—"

అనికదా భవభూతి పలుకులు!

విషాదమూ, ఏడుపూ సుఖ సంతోషాల వలెనే అందరిలోనూ ప్రవర్తిల్లుతాయి. కాని స్త్రీలలో ఆవేశాలు ఎక్కువ అని అభిప్రాయం అందరికీ! 'స్త్రీలకు ఏడుపు జన్మతః వచ్చిన డిప్లొమా' అని 'ఆడవాళ్ళ నెత్తిన వుంటుంది నీళ్ళకుండ.' 'ఆడపడి ఆడవాళ్ళకు కన్నీరు చెలిమంటేది.' లాంటి సూక్తులూ, సామెతలూ ఎన్నని! ఎందుకో అలా? పురుషుడు బలవంతుడు కాబట్టి అనాదిగా సమాజంలో స్త్రీకి కన్నీరు బాగా అలవాటయిందేమో! అసలు బేలహృదయం, కరుణా స్వభావం, అందువల్ల యిట్టే కరిగిపోతారు కన్నీళ్ళల్లో. పరిస్థితుల ప్రభావాన్ని బట్టి తరతమ భేదాలతో దుఃఖాన్ని పొందుతూ వుంటారు పురుషులు, స్త్రీలు.

ఎవరో తన పుస్తకం చింపారని తమ్ముడు వెక్కి వెక్కి ఏడుస్తూంటే అన్నయ్య ఓదారుస్తున్నాడు 'ఛీ! ఆడవాళ్లు ఏడ్చినట్టు మగవాళ్లు ఏడుస్తారా! తప్పు కాదూ?' అని. ఆ మాటతో ఆ చిట్టి తండ్రికి పౌరుషం వచ్చేసింది. దుఃఖచ్ఛాయలు తగ్గిపోతున్నాయి. ఏడ్వడం ఆడవాళ్ళ విద్య అయితే పకపకా నవ్వటం మగవారి పనా! ఏమో మరి! తర

# ★ కావ్యలోకంలో.... ★

తరాలుగా పోషించుకుంటూ వస్తున్న అబలాత్వానికి చెరగని చిహ్నమేమో యీ ఏడ్పు అనేది!

నాకనిపిస్తుందీ స్త్రీపురుషుల్లో ఏడ్పులో యింత భేదం ఎందువల్ల వస్తుందీ అని. బాల్యావస్థను దాటే దినాలలో యీమార్పు కొంచెంగా ప్రారంభమవుతుందనుకుంటా. అయితే స్త్రీ బేలగా వుండిపోవటం సహజసిద్ధమైన స్వభావమా! లేక పరిసరపరిస్థితుల ప్రభావమా? లేక సామాజిక పరిస్థితులు దోహదం చేస్తున్నాయా?

ప్రబంధకవీశ్వరుల్ని పలకరించండి. వెక్కి వెక్కి పంజాల సమాసాల్లో ఏడ్చే నాయికలూ, కోయిలగానం వంటి ఏడ్పుతో కొంతుల్ని కరిగించే కలకంఠులూ...ఎందరో దర్శనమిస్తారు. 'ఎవరుగొప్ప? యీ ఏడ్పు కచ్చేరీలో? అని తెల్లబోవలసి వస్తుంది మనం! ఏడ్పుకి వన్నెచిన్నెలు చేర్చి, విలాస వికాసాల్ని సంతరించి వర్ణించి పొగడ్తలందుకున్నారు మరి కవి శిఖామణులు!

'ఎంత సొగసుగా వర్ణించారూ! అనుకుంటాన్నేను. 'ఏడుస్తుంటే ఏమిసొగసులు చూపిస్తారు కవులు! అసలు ఎవరైనా పద్మినీ జాతి స్త్రీ ఏడ్పు కచ్చేరిచేస్తే ఆ అకాల వసంత సృష్టి చూడాలని వుంది.' అంటుంది ఒక మిత్రురాలు. రాళ్లపల్లి వాళ్ళంటారూ 'అదంతా మగవారి దృష్టి. తామూ తప్ప తక్కిన దృష్టి అంతియు తమకొరకై ఏర్పడినదని వారు తలచినట్లున్నది' అని. లలిత సమాసాభరణాలలో పొదిగి ఆ ఏడ్పుని యింకా యింకా వర్ణిద్దామని కవులు సరదా పడినట్లుంది ఆరోజుల్లో. స్త్రీ ఏడుస్తున్నా భయాందోళనలతో పరుగెత్తుకొని వస్తున్నా ఒకటే దృష్టివారికి. అది అప్పటి సామాజిక దృష్టి.

ముద్దు పలుకుల తిమ్మన కవితా లోకంలో ఒక ఏడుపు పద్యం శ్రుతిమధురంగా తీయని సమాసాలతో ప్రభవించింది. శ్రీకృష్ణుని చిన్నారిభార్య సత్యభామాదేవి అకాలవసంత సృష్టిచేస్తూ మధు మధురంగా విషాద వీణ ఆలాపించింది. 'కొసరి వసంత కాలమున కోయిల క్రోల్చిన భంగి' నేడ్చిన శ్రీవాణిని సుశీలకంటె శ్రావ్యంగా ఏడ్చింది. 'బాల పల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనితో, కంఠం విప్పి కన్నీరు కార్చింది.

హృదయంలో యీర్ష్యాసూయలూ, ఒక ప్రక్క కోపోద్రేకం విలయనృత్యం చేస్తున్నాయి. భర్త అనునయింప ప్రయత్నిస్తూంటే బాష్పాలు అనారితంగా క్రమ్ముకొచ్చాయి. పాదప్రహారం పరిహారంగా యిచ్చికూడా కోపవేగం తగ్గక దుఃఖాన్నాశ్రయించిందా దేవి. ఒట్టి కోయిల కంఠం కాదు సుమా!... జూన్ నెలలో కోయిల కూజితం సామాన్యం అయిపోతుంది కదా! వసంతకాల కోయిల కలస్వనాన్ని పుణికి పుచ్చుకుంది. అంగుళాలేమావి చిగుళ్ళు మేసి జీరవారిన కంఠంతో గానంచేసే ఆడుకోయిల అవ్యక్తమాధురీస్వనం. అంత హృద్యంగా గానంచేస్తే శ్రమనిష్ఫలం అవగలదా అని.

పెద్దనగారు యీ అసమానమైన కళలో తిమ్మనగారికన్న కొన్ని 'సమాసాలు' తక్కువ చదివారు. అయితేనేం వారి నాయిక వరూధిని నిర్వహించిన కచ్చేరీ కూడ జయప్రదమయింది. లేదంటే పాపం వారి వరూధిని తక్కిన నాయికలంత అదృష్టవంతులు కాలేకపోయింది. కటిక విరాగి అయిన ప్రవరుని చెంత వరూధిని వేసిన వయ్యారపు పాచికలు, ఆడిన ఆటలు పారలేదు. ఆడవాళ్ళ కన్నీళ్ళకంతా లోకువ అంటారు కాని ప్రవరుడా సూక్తిని జయించాడు. తన దగ్గరవున్న నారాచాలన్నీ వ్యర్థం కాగా కళవళపడి వరూధిని విచారాన్నాశ్రయించింది. ఏదో వంకతో 'కలస్వనం' తో ఏడ్చింది. అతి కరుణంగా ఏడ్చింది. ఎట్టే! మూర్తీభవించిన శిల్పంలా మొండికెత్తిన అతగాణ్ణి చూస్తే ఏడ్పుకూడా నిలవలేదు ఆమెకు. ఆపక తర్కంలోకి దిగింది. ఎన్ని అంటున్నా, ఆశిస్తున్నా వింటున్నాడా ప్రవ

## గృహ రామాయణం

కని పెంచి పెద్దచేసి పిల్లల అభివృద్ధే తమదని భావించే తల్లిదండ్రులకన్న దైవం ఎక్కడున్నాడు? అందుకనే 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్నారు ఋషులవంటి మన పెద్దలు.

ఒకప్పుడు అమ్మ, నాన్న ఒక అబ్బాయిని గట్టిగా మందలించారు. చెప్పినమాట వినక చెడిపోయావని తీవ్రంగా నిరసించారు. కొంత వ్యక్తిత్వం, చేకూర్చుకున్నాననుకున్న అతని అహం దెబ్బతిన్నది. అవమానంగా భావించాడు. గతం విస్మరించాడు.

కోపంతోనే పట్నం తిరిగి వచ్చేశాడు. కాలేజీలో అతడు తెలుగు అధ్యాపకుడు, శ్రీనాథుని గుణనిధి కథ — శివరాత్రి మహాత్మ్య ఘట్టం చెబుతున్నాడు.

గుణనిధి — తల్లిదండ్రులను ధిక్కరించి అధఃకరించి ప్రాపంచికానుభవాలన్నీ పొందాడు. గుండె కరడుగట్టిపోయింది. శిథిల హృదయంతో శివాలయం చేరుకుంటాడు. ఇలా కథ సాగుతోంది. క్లాసులో విద్యార్థులకు ఆశ్చర్యం! మేష్టారు ఇవ్వాళ తాదాత్మ్యం పొంది చెబుతున్నారు. గంట కొట్టారు తెలియలేదు. 'అరుణగభస్తి బింబముదయాద్రి పయిం'అనే పద్యం. 'నిర్భర కరుణాధురీణ యగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే, హర హర యెవ్వరింక కడుపారసి పెట్టెదరీప్సితాన్నముల్' బరువుగా, ఈ మాటలు అన్నాడు. చిన్నప్పటి అమ్మ అరకుడుపులు — గోరుముద్దలు, ఏవో జ్ఞాపకానికి వచ్చినవి.

మరునాడు ఇంటికి బయలుదేరివచ్చాడు. 'అమ్మా నీవు చెప్పిన పిల్లనే తప్పక చేసుకుంటానమ్మా - నా తప్పు క్షమించు. మనస్సునొప్పించాను'అన్నాడు.

కావ్యాలకూ జీవితానికీ గల అవినాభావ సంబంధం చూసి అతడు దాంపత్యం తరువాత తీర్చి దిద్దుకోవాలనుకున్నాడు

# నగలూ, నాణ్యాలూ

(గతవారం తరువాయి)

సిగ చుట్టుకున్నప్పుడు సిగ మధ్య ఈ నాగరం పెట్టుకుంటే, చెవుల దగ్గిరనించి సిగమీదుగా పైకి రుపోయే కొప్పుగోలుసులు వేసుకుంటే చూట్టానికి రెండు కళ్లు చాలవు-కునికిపాట్లుపడే ఏనాయనమ్మ చత్వారపు కళ్లకేనా ఎరుపడగా లనిపిస్తుంది నాగరం బదులు, అక్కడ పొళ్ల తిరుగుడు పువ్వు పెట్టుకున్నా ఇంత పనీ జరుగుతుంది.

ఉత్తమాంగంలో ఉత్తమాంగం ఇంకొక్కటి ఉండిపోయింది. అదే కళ్లకి, పెదిమలకీ, చెంపకీ సరిహద్దులు చెప్పి అందమిచ్చి, అందగించే నాసిక. దీనికి నువ్వు పువ్వులా కనబడే ఎదటివాళ్లని వెర్రెత్తించే గుణం ఉంది. భ్రుకుటినుంచి దిగుతూ దిగుతూ అపాంగి చేరేవరకూ హఠాత్తుగా గర్వం కలిగి పొగరుగా చిట్టచివార కొనదేరిగే సామర్థ్యం ఉంది. ఈ ముక్కుకే దాని ఆకారాహంకారాలనుబట్టి, టెక్కు ముక్కుకి వినయం నేర్పడానికీ, కాస్త మేదకుంలిలో చుగుకుపాలు పెంచడానికీ నగలుచేశారు. ఒంటిపొడి ముక్కుపుడకల జంట ఇలాటిదే. ఈ పెద్ద ఎర్రపొడి పుడకా, ఆ పెద్ద తెల్లపొడి పుడకానూ. ముగ్గురు ముత్యం బాగా నప్పుతుందని, అడ్డబాస పుట్టింది. ముక్కుగోడ మధ్య తీగరింగు, ఆ తీగకి ముత్యం తొడిగే ముందు ఒక ఎర్ర పొడీ, ఆనక చక్కని మెత్తని మంచిముత్యం అది జారకుండా పచ్చని బంగారు పూసాను. బేసరి, చంద్రవంకలా ఒక పక్కన అమరుతుంది. కనిపించే వంకమీద తెల్లరాళ్ళు నాలుగునుంచి ఎనిమిదిదాకా మెరుస్తూ ఉంటాయి. నత్తు (ముక్కెర) కూడా ఈ కోవదే. నాలుగు బిళ్లలు పేర్చి అందంగా తీర్చి దిద్దిన ఈ నగ ముక్కు కుడిపక్కన పెట్టి, ఎడమపక్కన ముక్కు పుడక పెట్టి మధ్య అడ్డబాస పెట్టుకుంటే, వినడానికి ఖంగారుగా ఉండొచ్చుకాని చూట్టానికి బాగా ఉండేది.

అసలు నగలన్నిటినీమించిన నగ ఆడదానికిజుట్టే. నగలగురించి ఎవరెప్పుడు మాటాడుకున్నా ... "తలిదండ్రుడు పెట్టని సొమ్ము పెన్నెరుల్" అనకుండా ఉండరు. కురులు ముడుముకున్నా, ముడుచుకోకపోయినా, జడేసుకున్నా, ఊరికే ముడేసుకున్నా అందంగానే ఉంటుంది. సౌందర్యారాధన 'తెలుగుమీరిన' ఒకానొక దుర్ముహూర్తాన సీమ దొరసానుల మల్లె ఒత్తుజుత్తును కత్తిరించి మెడదాకా ఉంచుకోవాలనే దురభిప్రాయం కొందరికి కలిగింది. అది కొన్నాళ్లు వ్యాపించింది. అయితే సీమ దొరసానులలోకూడా అలా జుట్టు అందరూ కత్తిరించేసుకోరన్న సంగతి చాలామంది గమనించరు.

మనవారిలో పూర్వం 'వేణీసంహారం' ఎంతో విశేషం. ఈ విద్యలో ప్రజ్ఞ గలవాళ్లు కొందరు ఉండేవారు. వాళ్లు ఇంటింటా, ఆడపడుచులకు కమ్మగా కబుర్లు చెప్తూ జడ వేసేవారు. శోభనంరోజున జడ వేస్తూనే, వేసే పెదరాశి పెద్దమ్మ పిల్లదానికి ఎన్నో విషయాలు బోధపరచి ధైర్యం చెప్పేది. మొగుడి దగ్గిర ఎలా నడుచుకోవాలో తెలియజెప్పేది.

జడలు ఎన్నో రకాలు. బంగారుజడ, నక్షత్రాలజడ, మొగలిజడ మొదలైనవి. పై రెండూ విశేషాలకే వేస్తారు. సీమంతానికి పూలుముడిచి వేస్తారు. ఎన్నిపాయలతో జడలల్లాలీ అనే విషయంలోకూడా కొన్నిచోట్ల కులాలనబట్టి ఆచార సంప్రదాయాలనుబట్టి పట్టింపులుండేవి.

## కడియాలు

పూర్వం రవికలు, ఇప్పుడు చోళీలు మల్లె పొట్టిగా ఉండేవి - చివరజరీ అంచుతో. ఆ అంచుకి సమాన 'స్థాయి'లో దండలమీద ధగధగ మెరిసేందుకు దండెతావేగులు కట్టుకునేవారు. పట్టెడ బిళ్లలాటివే పట్టుదారానికి పోసి, సరిగ్గా రవిక చేతిఅంచు అయిపోయేచోట కట్టేవారు. దీనిపైమెట్టు దండకడియం. వీటిమీద చక్కని చెక్కడప్పని ఉండేది. మధ్యగా చక్కని పొళ్ల వరుస, చిన్నదాని పళ్లవరుసలాగే మిలమిలలాడేది. కొన్నిటికి పొళ్ల బదులు, కడియం అడుగున రెండు పేటల ముత్యాల దండ కడియం పెట్టేవారు తెలుపులో బంగారం వెలుగు ప్రతిఫలించడానికి.

వంకీ ఇంకో చిత్రమైన ఆభరణం. ఎటుకు పైటవేసే కుడిదండకీ, దక్షిణాది పైటఅయితే ఎడమదండకీ పెట్టుకుంటారు పైటచాటున మాటుపడకుండా. కొన్ని వంకీలకు కిరీటం మీద పచ్చలాగే ముందర ఒకబిళ్ల, అంగులో పొళ్లూ ఉంటాయి. ఎక్కడెక్కడి కళ్లనూ ఇది అట్టే ఆకట్టి నిలబెడుతుంది. దీనికే కుచ్చుపోసి ముత్యాలుకూడా వ్రేలాడదీస్తారు. దండలకే అలంకరించుకునే మరో నగ బాజబంగులు. రవ్వలమర్చిన ఒక బిళ్లకి పట్టుతాడు పోసి వెనకవేపు కుచ్చుల ముడి వేస్తారు.

కొంచెం క్రిందికిదిగితే ముంజేయి. చేతినిండా గాజులేసుకుంటే, గాజుల మలారం



టీ సెట్

—ఫొటో: ఉమ్మిడిరామయ్యచెట్టి, గురుస్వామిచెట్టి & కంపెనీవారి సౌజన్యంతో.

# ★ నగలూ - నాణ్యాలూ ★

అవి పరాచికాలాడుతారుగాని, నేటికీకొండ ప్రాంతాలలో వారేకాక, పల్లెలలోకూడా చేతినిండా గాజులు వేసుకునేవారున్నారు. ఇవి మంగళచిహ్నాలు. గాజులుకాక, అసలు గాజులకు చోటివ్వనన్ని నగలూ వేసుకునేవారున్నారు. మురుగులూ, మురిడీలూ తోడాలూ మొదలైనవి. ఇవి కొందరు గట్టివి, కొందరు గుల్లవి, కొందరు వెండిమీద బంగారురేకు వేసినవీ తొడుక్కుంటారు. మురుడీలు, ఇప్పటి రిస్ట్‌వాచీ స్ట్రాప్‌లలో ఒక రకంవాటిలా సన్నగా చక్కగా ఎలాపెడితే అలా వంగేవిగా వగులుగా చక్కటిబంగారు తీగతో అల్లినవి. మురుగులలో పలకల మురుగులు చాలా అందంగా ఉంటాయి. పిల్లలూ మొగాళ్ళుకూడా ఇవి వేసుకుంటారు. బంగారుగాజులెన్నిరకాలో లెక్కవేస్తే ప్రాణం ఖంగారుపడిపోతుంది. మిరియం గాజులు, గోధుమగాజులు, నగిషీగాజులూ ఇలా ఎన్నోఉన్నాయి.

చేతిమీదుగా, వేళ్ళ బటువులమీదకి కుళ్ళి వజ్రాలు పొదిగిన గొలుసులు దింపుతారు కొందరు. బటువులు సరేసరి కొన్ని ఉంగరాలలో ఒక్కొక్క రాయి వేలకివేలు చేస్తుంది కొన్నిటిలో తొమ్మిగేసిరాళ్ళుకూడా పొదిగివుంచుతారు. కొందరు మొగాళ్లు నగలవిషయంలో కోరికలన్నిటినీ ఉంగరాలదగ్గిరే సాధించుకుంటారు. వేలి వేలికీ వేలువేలుచేసే ఉంగరాలు రెండేసీ మూడేసీ పెట్టేసుకుని.

అందమైన ఆడదానికి నడుము ఉందా లేదా అన్న విషయమై ప్రబంధకవుల మీమాంస లెలాఉన్నా, ఆడవాళ్లుమటుకు వాటిని పట్టించుకోకుండా కుబ్బురంగా నగలు చేయించుకున్నారు నగ పెట్టడానికి వీలైన చోటు ఉన్నపుడు దానిమీద తక్కువేమిటి అని. కంటిరెప్పలూ, పెదిమలూవంటి కొన్ని అవయవాలు వినా, వనిత తనులతలో నగలూనని చోటేలేదు.

నడుము ధరించే నగ వడ్డాణంలో నాలుగైదు రకాలున్నాయి. ముందు కొక్కాలు ఉండేదా వడ్డాణం, నగిషి చెక్కిన పట్టిక వడ్డాణం, మువ్వలవడ్డాణం, కమల పటా వగైరాలు.

ఇది నడుము జారిపోకుండా నిలుపుటకు కదూ అమ్మమ్మా అని అడిగితే ఆ! పాడూ ఉందని చూసి సంతోషించకా ఇందుకూ అందుకూ అని సవాలక్ష ప్రశ్నలెందుకూ అని ఆవిడ నవ్వేసింది.

సీ దొంగలు ఈ దేశంలో పుడితే ఏంచేసేవారో తెలీదుగాని మన ఆచార సంప్రదాయాలనుబట్టి, మర్యాదలనుబట్టి ఎన్ని నగలున్నా ఒంటినిండా బట్ట కప్పుకోవడం మన పద్ధతి. అంగువల్ల కాళ్ళకు నగలు చీలమండకి కొంచెం పైన ఆరంభమై వేళ్ళదాకా ఉంటాయి. మొలనూళ్లూ అవి రాజకుమారికలూ, ప్రబంధనాయికలూ, అంతఃపురాలలో తిరిగేవాళ్ళూ వేసుకోడం జరిగినట్టు పుస్తకాల్లో చెప్పారు.

కాళ్లకి నగలన్నీ వెండివే. రాజులకాలంలో బంగారు అందెలూ గజ్జెలూ ఉండేవి.

పూర్వం ఏయింటి మాలక్ష్మైనాసరే నటింట తిరుగుతూఉంటే ఈ అందెలూ, కడియాలూ తోడాలూ గొళ్ళెం గొలుసులూ పాంజీపట్టాలూ, వావడా గొలుసులూ, కాటిక్కాయ గొలుసులూ, మట్టెలూ కలిసి ఘల్లు ఘల్లున మోగుతూ ఇంటో, తల్లి నాట్యమాడుతోందనే అనిపించేవి. పురుగూ పుట్రా దారికడ్డంపడి ఊదబోయినా ఈ చప్పుడికి చప్పున తప్పుకునేవని మా అమ్మమ్మ అంటుంది. ఇవన్నీ ఒక్కొక్కటి నూరేసితులాలుండేవి. ఇలా కాలికి నాలుగైదొందలతులాల నగనుమోస్తూ ఇల్లాలు అడుగెత్తి అడుగేసేవరకూ, విగ్రహంలో ఎంతో రాచఠీవి దర్పం ఉట్టిపడేవి.

మట్టెలుకూడా మంగళచిహ్నాలే. ఇల్లాలి కాలిబలాన్నిబట్టి ఒక్కొక్కటి 7 నుండి 12 తులాలు తూగేవి కొందరు అన్నివేళ్లకీ పెట్టుకుంటారు. కొందరు రెండోవేలికీ, చిటికెనవేలుకీ (పిల్లేళ్లు) పెట్టుకుంటారు. మోత భరాయించుకోలేనివారు, నాజూకైన పట్టాలు వేసుకుని, కాలికి లత్తుక పూసుకుని తిరిగేవారు.

* * *

ఈ విధంగా మన నిత్యజీవితంలో పండుగ పబ్బాలలో ఉత్సవాలలో నగలకు విశేష ప్రాముఖ్యంఉంది. చరిత్రలో చరిత్రాత్మకాలయిన నగలున్నాయి. నగలచుట్టూ చరిత్రఉంది. బాంకులూ, భీమాలూ ఎరగని రోజులలో, మనిషి ఆపదలో అడ్డుపడేవి నగలు. నగలను నగదులోకి అనువదించడం బహు సులభం.

డబ్బుని మనం ఒకొక్కసారి ఎంత చిన్నచూపు చూసినా మన ప్రేమాతిశయాన్ని భాషకన్న బాగా వ్యక్తపరచగల వాటిలో నగల కానుకలు ఎన్నతగ్గవి.

మన సౌందర్యాభిరుచుల స్థాయిని ప్రతిబింబించేవి నగలు. మిగతాదేశాల జాతుల మతాలమాట ఎలాఉన్నా మనకి నగలూ అలంకరణా భగవదారాధనలో కూడా కలిసిపోయాయి. ఏ దేవుణ్ణైనా పట్టుమని పది మాటలలో పొగిడేవరకూ ఆయన భూషణాల మాట రాకమానదు.. చేతిలో వెన్నముద్ద చెంగల్వపూదండ బంగరు మొలతాడు పట్టుగట్టి, సందిట తావేగు సరిమువ్వగజ్జలు చిన్నికృష్ణా నిన్ను చేకొలతు అని ఒక నుతి. కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం నాసాగ్రే నవమౌక్తికం...అని ఒక శ్లోకం. సౌందర్యంలో దైవాన్ని చూస్తాం మనం.

మెప్పులకేకాదు; ఆడిపోసుకోడానికీ నగలేవచ్చాయి. బందిఖానలో రామదాసుగారు ప్రాణం విసుగెత్తి—సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము రామచంద్రా, ఆపతకమె చేసెను పదివేల వరహాలు రామచంద్రా అన్నాడు. భరతుడి పచ్చలపతకం, లక్ష్మణుడికి రత్నాలపతకం ఎంతెంతఅయ్యాయో వర్ణించాడు. చివరకి రాముడికే చేయించిన కలికితురాయిమాట ఎత్తి 'అది ఎవడబ్బ సొమ్మని కులుకుచు తిరిగేవు' అన్నాడు. బాధ ఉపశమించాక అబ్బతిట్టితినని ఆయాసపడకయ్యా అని మన్నన చెప్పుకొన్నాడనుకోండి.

బంగారమంటి పిల్లాడు ... మాణిక్యంలా ఉంటుంది పిల్ల, నీయిల్లు బంగారంగానూ... రత్నంలా మెరిసిపోతున్నాడు... మొదలయినవి దైనందినీయంలో వినబడేమాటలు.

ఈనాటి నగలు తేలికగా, నాజూకుగా ఉంటాయి. వ్యక్తిఅందానికి ప్రాధాన్యం ఇచ్చి అక్కడక్కడ సున్నితంగా ఒక ఉపమానం చెప్పడం, తేలిగ్గా మెచ్చుకోడం ఈ నగల శిల్పంలో ప్రాతిపదిక అదైనా ఇదైనా ఆనాడూ ఈనాడూ కూడా సౌందర్యసృష్టి సౌందర్యాభిరుచి ప్రాధాన్యం వహించింది.

రామూ- 'నేను మద్రాసు వచ్చేటప్పుడు మాంఛి వేషంలో వచ్చా తెలుసా"-?

'నేను చొక్కా లాగూ ఆఖరికి చెప్పులుకూడా లేకుండా వచ్చా తెలుసా'...?

రామూ- 'ఎవ్వరూ నవ్వలేదుట్రా.'

'ఓరి చవటా, నేను సరాసరి అమ్మకడుపులోంచే వచ్చారా!'

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## దసరా ప్రత్యేక సంచికలో

## [14 అక్టోబరు, 1959]

## మొదటి బహుమతి: రూ. 50/-

## రెండవ బహుమతి: రూ. 30/-

## "ప్రేమ వివాహాలు"

ప్రేమించి పెళ్ళిచేసుకోవడం ఆనాడూ ఉంది, ఈనాడూ ఉంది. అన్నగార్లకిష్టంలేకపోయినా సుభద్ర అర్జునుణ్ణి, రుక్మిణి శ్రీకృష్ణుణ్ణి ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. దమయంతిని సాక్షాత్తు దిక్పాలకులేవచ్చి మభ్యపెట్టినా నిరాకరించి, నలుణ్ణి పెళ్ళాడింది. ఆయా నాయికలు ఆయా నాయకులను ప్రేమించటానికి బలవత్తరమైన ఆకర్షణలు తోశాయి. ఏడున్నాయి. ప్రేమవివాహాలు ఈనాడూ జరుగుతున్నాయి. తల్లిదండ్రులు యువతీయువకుల ఇష్టానిష్టాలతో ప్రమేయం లేకుండా చేసే పెళ్ళిళ్ళు క్రమంగా తగ్గుతున్నాయి. ముందుముందు ఇంకా తగ్గుతాయేమో! ప్రేమించి పెళ్ళాడే స్త్రీలు పురుషులలో ఏయే గుణగణాలు చూసి ప్రేమిస్తున్నారు? స్త్రీ ప్రేమించడానికి ముఖ్యాకర్షణ అందమా, ధనమా, గొప్ప ఉద్యోగమా, తెలివితేటలా, స్వభావం తనకనుగుణంగా ఉండడమా? ఇంకా ఇతర కారణాలున్నాయా? తీరా ప్రేమించి పెళ్ళాడినా దాంపత్యం సుఖంగా ఉంటుందని హామీ ఏమిటి? మొదలైనవాటిని స్త్రీ దృష్ట్యా చర్చిస్తూ "ప్రేమవివాహాలు" అనే విషయమై వనితాలోకం రచనల పోటీ నిర్వహించనలచాము. ఈ పోటీలో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఫలితాలు దసరా సంచిక (14-10-59) లో ప్రచురిస్తాము.

రచన వార పత్రికలో రెండు పేజీలకు మించకుండా (అంటే సుమారు 4 అరటావులలో - కాగితానికి ఒకవైపే) ఉండాలి. పోటీలో నెగ్గని రచనలను త్రిప్పి పంపగోరేవారు రచనలతోపాటు తగినన్ని స్టాంపులు పంపాలి. రచనపై "వనితాలోకం రచనల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి.

## రచనలు సెప్టెంబరు 21 లోగా మాకు చేరాలి.

నాగరికత పెరిగినకొద్దీ ఆభరణాల నిర్మాణంలో ప్రయోగంలో మార్పులు వచ్చాయి కాని, వచ్చివచ్చి మళ్ళీ పూర్వకాలపు నగల దగ్గరకే వెళ్తూఉంటాం. మళ్ళీ పూర్వకాలపు పద్ధతులకే వెళ్తూఉంటాం. మహాఅయితే చిన్న మెత్తు తేడా ఉండవచ్చు.

మన నాయనమ్మలు వేసుకున్న కంఠపువ్వ పట్టెడలూ, మువ్వలపట్టెడలూ ఇప్పుడు సీమలో 'ఫాషనబుల్' నగలు. అక్కడ ధనికులు నల్లటిగౌను వేసుకున్నపుడు, దంతంలా తెల్లగా, శంఖంలా నాజూగ్గా ఉండే మెడకు పచ్చగా మెరిసిపోయే ఈ పట్టెడ పెట్టుకుంటారు. మనదేశంలో అతి నాగరీకులుకూడా (బొంబాయి, ఢిల్లీలలో) ఈ పట్టెళ్ళను ధరిస్తున్నారు.

కాలంనాడు చెంపసరాలూ, తమ్మెలూ, జూకాలు పెట్టుకున్నారు. ఈనాడు చారెడేసి తమ్మెలు—చెవినికప్పేసేవి పెట్టుకుంటున్నారు. కొన్నాళ్ళకి ముక్కుకి నత్తుఅడ్డబాసా పెట్టుకుంటే మనం ఆశ్చర్యంతో వెనక్కి పడిపోనక్కరలేదు.

చేతినిండా గాజులేసుకుంటే "లంబాడీదానిలా" అని వెక్కిరించినవాళ్ళ పిల్లలు, కేవలం లంబాడీలే వేసుకునే రెండంగుళాల వెడల్పు గాజులు వేసుకున్నారు. చేతికి రెండు గాజులు చాలని, ఆ తరవాత ఒకటే ఎక్కువనీ, ఆ ధరిమేనా అదికూడా అనవసరమనీ ఒక చేతమీదే పతుపాతం చూపించి రెండో దాన్ని బోసిగాను, లేదా రిస్టువాచీ పెట్టించుకున్న వారు మళ్ళీ రెండుచేతుల్లా పుష్కలంగా గాజులు తొడుక్కుంటున్నారు. కంకణాలూ కడియాలూ కూడని బంగారు కడియాలు చేయించి అంగుళంలో మూడోవంతు లాటి చిన్న గడియారాన్ని పొదగిస్తున్నారు.

మన కనుముక్కు తీరునుబట్టి, సౌలభ్యాన్నిబట్టి నిరాడంబరంగా నగలుధరించి అలంకరించుకోవడం మన అభిరుచిని, సంస్కారాన్ని తెలియచేస్తుంది. పూర్వ కాలం వాళ్ళకి సంస్కారం లేదనికాదు. ఆనాడవి వారికి నప్పాయి. అసలు నగలు ఎలాటివి ఎన్నని పెట్టుకున్నామన్నది ప్రశ్న కాదు. పెట్టుకున్నవి మనకి నప్పుతున్నాయా మనవల్ల వాటికీ వాటివల్ల మనకీ అందంవస్తోందా అన్నదే ముఖ్యం. 

---

గత వారం నగల ఫొటోలు "ఉమ్మిడి బంగారుచెట్టి & సన్స్ వారి సౌజన్యంతో" అని పొరపాటున ప్రచురింపబడింది. "ఉమ్మిడి

# ★ ఉత్తరాలు ★

(2-వ పేజీ తరువాయి)

గుణాన్ని, మానవప్రవృత్తితో సరిపోల్చుతూ రసవత్తరంగా 'రంగుటద్దాలు' వ్రాసిన ప్రముఖ సినీనటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావులో ఒక గొప్ప 'తత్వం' ఇమిడి వున్నట్లు నాకనిపిస్తుంది. ఇప్పటి యువకులలో చాలామందికి 'సినీ, నాగేశ్వరరావు అయినట్లయితే' ఎంతహాయి జీవితం అనే తలంపు వున్నమాట నిజం. అయితే నాగేశ్వరరావు ఎన్ని తుఫాన్లను ఎదుర్కొని గమ్యానికిచేరిన ఓ తత్వాన్ని సృష్టించుకో గలిగాడో 'రంగుటద్దాలు' చదువుతుంటే దానిలో తెలుస్తోంది.

తిరువీధుల కనకం. (మంగళగిరి)

* * *

చదువుతూన్నంతసేపు ఏదో స్వప్నావస్థలో ఉన్నట్లనిపించింది. ప్రకృతి సౌందర్యంతో మానవ సౌందర్యాన్ని, మానవ మనస్తత్వాలలోని నిమ్నోన్నతలను ప్రకృతిలోని విభిన్న నిమ్నోన్నత విశేషాలతో ఎంతో చక్కగా పోల్చి చెప్పారు. వారి రచనలో హృదయాన్ని కదిలించే సౌకుమార్యం కనుపించింది. ముఖ్యంగా యూకలిప్టస్ చెట్ల ప్రణయసందేశాన్ని ప్రకృతి ప్రళయాన్ని తలచుకొన్నప్పుడు మనస్సు వికలమైపోయింది.

"భరణి" న్యూఢిల్లీ.

"రంగుటద్దాలు" చాలా బాగున్నది. వారి రచన నాకు బాగా నచ్చింది.

జె. రామచందర్ (హైదరాబాద్)

* * *

వారి ప్రకృతి సౌందర్యవిమర్శన అమోఘమైనది. సినిమా అనుభవమే గాక యింత చిన్న వయస్సులో యింత లోకానుభవము అలవడుట పూర్వజన్మసుకృతమే గాని వేరు గాదు. సర్వజ్ఞానిలా వున్నారు. నా ధన్యవాదాలు.

కె. మీనాక్షీ దేవి (ముప్పాళ్ళ)

* * *

చాలా బాగుంది.

జి. అన్నపూర్ణ

'రంగుటద్దాలు' అను వ్యాసము చాలా బాగుందనడం అతిశయోక్తి కాదు. మంచి నటనాశక్తి ఉన్నంత మాత్రాన మంచి రచనాశక్తి కల్గియుండడం అరుదు.

యస్. రాజయ్య (లక్షెట్టిపేట).

* * *

మనసులో వొకటి అనుకొని, పైకి వొకటి రాసినట్లున్నారు, నాగేశ్వరరావు. గారు. అనుకున్నట్లుగా, నాగేశ్వరరావుగారి 'రంగుటద్దాల' వ్యాసం లేదు.

"శంకరం"-(మదరాసు).

* * *

నాగేశ్వరరావుగారు బోధించినది అందరు ఆచరించితే సమాజం బాగుంటుంది.

యస్. యన్. చౌదరి (కొండపాటూరు)

* * *

రంగుటద్దాలు వ్యాసానికి నాలుగుపేజీలూ దండుగ అనిపించింది.

కె. హేమాద్రి, గొల్లప్రోలు.

## స్వరలహరి

ఈశీర్షిక చాలాశ్లాఘనీయంగా ఉంటోంది! ...కాని నన్నెవరయినా నీకునచ్చిన ముగ్గురు సినిమా సంగీత దర్శకులను పేర్కొనమంటే ఈ క్రింది వారి నిపేర్కొంటాను: 1. ఎస్. డి. బర్మన్, 2. ఎస్. డి. బర్మన్, 3 ఎస్. డి. బర్మన్. ఈ ముగ్గురినిగురించి "స్వరలహరి"లో ఎప్పుడు వ్రాస్తారు?

బి. రామనాథం, విజయవాడ.

* * *

నౌషద్ గాని, రామచంద్ర చితల్కర్ గాని, ఉత్తమశ్రేణికి చెందిన సంగీతాన్ని ప్రజలకు అందజేయవచ్చు అంతమాత్రంచేత వారి హిందీ సినిమా సంగీత సామ్రాజ్యానికి మకుటంలేని రాజులనటం నిజంగా అతిశయోక్తి. వాస్తవానికి నేటి సంగీత దర్శకులు, ముఖ్యంగా హిందీ చిత్ర సంగీతదర్శకులు ఒకరికొకరు తీసిపోరు. ఒకరు మిగతా వారికన్న గొప్పవారని చెప్పడానికి ఒక నిర్దుష్టమైన ప్రమాణం ఏమీ లేదు. ఈ సందర్భంలో టి. వి. రావు (బొంబాయి) గారు వ్రాసినట్లు "ఎందరో మహానుభావులు, అందరికి వందనములు అనడమే సమంజసము.

గో. జగన్నాథం (యలమంచలి)

* * *

"నేను 8 ఏళ్లబట్టి ఆంధ్రపత్రిక చదువుతున్నాను. స్వరలహరి, రాజధానికబుర్లు, అనుశీర్షికలు కల్గించు ఉల్లాసం, నాకు మరెప్పుడూ కలగలేదు. సి. రామచంద్ర గురించి వ్రాస్తున్నది చదువుతున్నంతసేపు, పరవశుడనయ్యాను. చితల్కర్ పాటలలోని విశిష్టతను చక్కగా చూపగల్గారు. నిజంగా, "బర్సాత్ మొహబ్బత్కి"పాట వినేవారికే తెలియాలి ఆహాయి ఏమిటో!

ఎం. ఆర్. నాగరాజ్ (మద్రాసు)

# ★ కావ్యలోకంలో.... ★

(42 వ పేజీ తరువాయి)

దనుకు? 'ఎలా వెళ్ళాలి యింటికి' అన్న ధ్యాస అతనికి!

పోతే భట్టుమూర్తిగారి ముద్దుల నాయిక గిరికాదేవి విషాదపర్వం విలక్షణమైనది. ఈ కన్య అతి సొగసుగా, సంగీత శాస్త్రాన్ని కాచివడబోసి, లలితగతుల్ని కుప్పపోసి, అనన్నొక్క రాగమాలాపిస్తుంది. సంగీత కళానిధి మరి! తల్లి సాహిత్య ప్రవీణురాలిగా చేయిస్తే, తండ్రి కళానిధిగా రూపొందించాడు పుత్రిని సంగీతంలో. ఇక ఆమె ఏడిస్తే ఎంత మనోహరంగా వుంటుందో చెప్పటంకన్న వూహించుకోవటమే వుత్తమం. వెన్నెలఘాటికి, వేడికి వసివాడిపోయింది గిరిక. విషాద వీణాశ్రుతులు సరిచేసింది.

దీనతను ప్రస్ఫుటితం చేస్తుంది కాంభోజి రాగం. ఆరాగాన్ని కిన్నర స్త్రీలు కమలాల వంటి హస్తాలతో వీణలపై వినిపిస్తుంటే వెల్వడే మంజులారవంలా భాసించిందట గిరిక ఎలుగెత్తి ఏడుస్తుంటే. ఆ వీణాస్వన మధురిమల్లాగే యీమె ఏడ్పు అనే అమృత ప్రవాహం కూడా దిశలు విస్తరించి పోయిన

అంటే సంగీతంలో సిద్ధహస్తులైన వారు రాగయుక్తంగానే ఏడుస్తారన్నమాట శోకరసంకూడా.

స్త్రీలు ఏడుస్తుంటే కవులు ఉపమించే విషయాలు గమ్మత్తుగా, అందంగా కూడా వుంటాయి. కన్నులు పద్మాలయితే కన్నీరు బిససూత్రాలు. నేత్రాలు మేఘాలయితే కన్నీరు వర్షధార. ఇలా ఎన్నో! ఏడుస్తూ వచ్చిన మనోరమకు 'మెయిగల విలాస విభ్రమ లక్ష్మిల్ దక్కుట' కూడా ఒక అందంగానే భాసించినదట పెద్దనగారికి.

'స్త్రీలకు ఏడ్పు వూరికే ఏంరాదు. పురుషులకంటె ఈగుణం పెద్ద ఎక్కువేమీ కాదు స్త్రీలకి అని సిద్ధాంతీకరించుదామని ఇదంతా వ్రాస్తున్నాననుకునేరు. ఆనాటి విషాద పథాల్లో వారు సృష్టించిన సొగసులు, అవి అతిశయోక్తులు కానీ, కాస్త చెప్పుకుందామనే వ్రాశాను. ఏడ్పు అనేది కొన్ని సమయాలలో అనివార్యం కావచ్చు. మరికొన్ని సమయాలలో అందం కావచ్చు. తత్వాలు పూర్తిగా మారకపోయినా, మారిన కాలపు మహత్తును బట్టి స్త్రీ తన అబలాత్వాన్నీ, వేలత్వాన్నీ విజ్ఞానవీచికల విసురులలో ముంచివేసి ముందుకు వస్తేనే అందం నేడు.

## క్రీడారంగం:

# డేవిస్‌కప్పు టెన్నిస్‌పోటీలు

గత కొన్ని సంవత్సరాల నుంచి డేవిస్ కప్పు లాన్ టెన్నిస్ అంతర మండలం పోటీల ఫైనల్సులో అమెరికా ఆస్ట్రేలియా దేశాలే పోటీలు చేస్తున్నాయి. అయితే ఈ ఏడాది ఇతర దేశాలలో ఆటస్థాయి అభివృద్ధి అవటంచేత ఆస్ట్రేలియా కాక యితర దేశమేదైనా అంతర మండలం ఫైనల్సులో నెగ్గి క్రిందటిసారి కప్పు విజేతలైన అమెరికాతో పోటీచేయడానికి అర్హత సంపాదిస్తుందేమోనని ఆశించారు. కాని అవి ఆశలుగానే మిగిలిపోయాయి. అంతర మండల పోటీల సెమిఫైనల్సులో ఆస్ట్రేలియా ఇటలీని ఓడించారు.

ఆస్ట్రేలియా ప్రతినిధులుగా పాల్గొంటున్న వారిలో ముఖ్యులు నీల్ ఫ్రేజర్, రాడ్ లేవర్. రాడ్ లేవర్ పోటీలలో పాల్గొంటున్న మొదటి ఎనిమిదిమంది ఆటగాళ్ళలో ఒకడుగా కూడ పరిగణింపబడక పోయినా, వింబుల్డన్ పోటీలలో విశేషమైన పట్టుదలను, ప్రతిభను కనబరచి ఫైనల్సుకు వచ్చాడు. ఫైనల్సులో ఆల్మెడోతో ఓడిపోయాడు. ఈ ఏడాది జరిగిన పోటీలలో భారతదేశ ఆటగాడైన ఆర్. కృష్ణన్ కొన్నింటిలో చాలబాగా ఆడేరు. ప్రఖ్యాతి గాంచిన అనేకమంది ఆటగాళ్ళనేగాక వింబుల్డన్ ఛాంపియన్ అయిన అలెక్స్ ఆల్మెడోనుకూడ ఓడించారు. అయితే కృష్ణన్ పాల్గొన్న అన్ని పోటీలలో సమాన ప్రతిభను కనబరచలేకపోయారు. ఏ ఆటలోనైనా, ప్రపంచ మంతటికీ ఇంతవరకు ఆడిన ఆటగాళ్ళలో ఎవరుగొప్పవాడు అన్న ప్రశ్న వస్తే, భిన్నాభిప్రాయాలు వస్తాయి కాని టెన్నిసులో మాత్రము ఏకగ్రీవంగా అందరూ అమెరికా ఆటగాడైన జేక్ క్రామర్ అని తప్పక ఒప్పుకుంటారు. ఈయన 1947 వింబుల్డన్ ఛాంపియన్ షిప్‌ను గెలిచారు. దీని అనంతరం వీరు ప్రొఫెషనల్ గా మారి ఆటను ప్రదర్శించటానికి ఒక జట్టును తయారుచేశారు. వింబుల్డన్ పోటీలను గెలిచినవారికి విశేషమైన ధనమును యిచ్చి ఈ జట్టులో తీసుకున్నారు. భారతదేశపు ఆటగాడైన కృష్ణన్ ఆటను చూసి మెచ్చుకొని అతనిని తన జట్టులో తీసుకునేందుకు అభ్యంతరము లేదని చెప్పారు. వింబుల్డన్ పోటీలలో కూడ మనదేశ ప్రతినిధిగా, అనేక సంవత్సరాలుగా ఆడుతున్న నరేశ్ కుమార్ తండ్రి అస్వస్థత మూలంగా పాల్గొనలేకపోయారు. నరేశ్ కుమార్ డేవిస్‌కప్పు పోటీలలో పాల్గొనడం అనుమానంగా ఉన్నప్పటికీ, మనదేశంలో మూడవ ఆటగాడుగా పరిగణింపబడిన ప్రేమజిత్ లాల్, కృష్ణన్‌తో జతులుగా ఆడుటకు అలవాటుపడటానికి ముందుగా పంపబడలేదు. డేవిస్‌కప్ పోటీలలో కూడ నరేశ్ కుమార్ పాల్గొనలేకపోయారు.



ఫ్రేజర్

డేవిస్‌కప్పు అంతర మండల ఫైనల్సు ఆగస్టు 14 వ తారీఖున ప్రారంభమయ్యాయి. మొదటి మాచ్‌లో రామనాథన్ కృష్ణన్ నాలుగు సెట్లలో రాడ్ లేవర్‌ను అవలీలగా ఓడించారు. స్కోరు: 6-1, 6-4, 8-10, 6-4. కృష్ణన్ ఈ మాచ్‌లో చూపిన కౌశలమును చూపిస్తే, ఏ దేశ ప్రతినిధినైనా సునాయాసముగా ఓడిస్తారు,' అని మాచ్‌ని చూసిన కొందరు విదేశీ విలేఖరులు అన్నారు. రెండవ మాచ్‌లో ఫ్రేజర్ లాల్‌ను 10-8, 6-4, 6-1 స్కోరుతో ఓడించారు. డబుల్సులో ఆస్ట్రేలియా ఆటగాళ్ళయిన ఫ్రేజర్ ఎమర్సన్‌లు, కృష్ణన్, ప్రేమజిత్ లాల్‌లను 6-8, 7-5, 6-2 స్కోరుతో ఓడించారు.

మూడవ మాచ్‌లో ఫ్రేజర్, కృష్ణన్‌ను మూడు సెట్లలో గెలిచారు. స్కోరు 6-2, 6-3, 6-4 కృష్ణన్ మొదటి రోజున చూపించిన నైపుణ్యమును ప్రదర్శించలేకపోయారు. ఆఖరి మాచ్‌లో రాడ్ లేవర్ లాల్‌ను 6-2, 10-8, 6-4 స్కోరుతో ఓడించారు. ఈ మాచ్‌లో లాల్ చూడ ముచ్చటగా ఆడి ప్రేక్షకుల మన్ననలను అందుకొన్నారు.

కృష్ణన్ ఆస్ట్రేలియాలో జరగబోయే కొన్ని పోటీలలో పాల్గొనుటకు వీలుకాదని తెలియజేశారు. ఆ స్థానంలో ప్రేమజిత్ లాల్‌ను పిలవాలని కొందరు ఆస్ట్రేలియా విలేఖరులు తమ అభిప్రాయమును వెల్లడించేరు. ప్రేమజిత్ లాల్ వయస్సు 18 సం. ఈయన ఆటలో యింకా పైకి రాగల సూచనలు కనబడుతున్నాయి.

ఇప్పుడు జరిగే టెన్నిసు పోటీలన్నిటిలో భారతదేశ జయాపజయాలు కృష్ణన్ మీదనే ఆధారపడ్డాయి మనదేశంలో ఇతర టెన్నిసు ఆటగాళ్ళకి ప్రఖ్యాతి గాంచిన యితర దేశ ఆటగాళ్ళను ఓడించే సామర్థ్యము లేదు. అయితే ఈ పోటీలలో సంపాదించిన అనుభవం మూలంగా లాల్ మనదేశ ప్రతినిధిగా కృష్ణన్‌కు అండగా నిలబడగలరని ఆశించవచ్చు.

—రావు.

---

## వనితాలోకం

శ్రావణిగారు వ్రాసిన వ్యాసం యీకాలం వారికి సంబంధించినటుల లేదు. వారు రాసినది పాతిక ఏండ్ల క్రితం జరిగిన విషయాలు. యీకాలములో అట్లు ఆడువారికి అన్యాయం జరగడం చాలా అరుదు.

ఎం. రాధ. (నెల్లూరు.)

చెప్పలేనంత బాగుంది. ఆ వ్యాసాన్ని నేను నాలుగుసార్లు చదివాను.

మారిశెట్టి అప్పారావ్ నాయుడు.
ఫోర్ డీ (బీహార్)

* * *

యాంత్రిక: "పై చేసిన ఊహాగానాన్ని చదివా. పట్టులేని కేసును తీసుకొని వాదించుచున్న ప్లీడరు గారి వాగాడంబరం గుర్తుకువచ్చింది.

కనకమేడల శారదాబాయి.
(రాజకోట, సౌరాష్ట్ర)

స్త్రీని అణేపనిగా నిందించడానికి వ్రాసినట్లుంది. వ్యాసంలో పెద్దపెద్ద పదాలు వాడారు ఒక్క సుందర కైకేయి, క్లియోపాత్రలాంటి స్త్రీలనే ప్రస్తావించారు కాని సావిత్రి సీత, అనసూయలాంటి సాధ్వీమణుల విషయం ఏమిటి?

డి. సరోజమ్మ, పులివెందుల.

బి. ప్రేమలీలగారు వ్రాసిన "చదువుకొంటున్న పిల్లలు" అన్న వ్యాసం చాలా బావుంది. ఒకే ఊరిలో ఉన్నాగాని నేను వారికి అపరిచితురాలను. వనిత వారపత్రిక ద్వారా వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

బచ్చు జయలక్ష్మి, (పెద్దాపు

'చదువుకొంటున్న పిల్లలు' చదువుటకే చాల బాగుంది. వ్యాసంలో తల్లిదండ్రుల, ఉ[illegible] బాధ్యతలు ఆచరణలో పెటదగి మున్నది.

రాజు

# ★ రాజధాని కబుర్లు ★

(5-వ పేజీ తరువాయి)

**శ్రీకృష్ణ జన్మస్థానం చెప్పిన కథలు**

"కంతం ఐ. సి. ఎస్. ఆఫీసర్‌ది. ఆకారం మాత్రం అతన్ని క్రింద నైబిస్టుది. ఈ రెండింటి సమ్మేళనం పేరు ఆల్బర్ట్ అలెగ్జాండర్. అతని కథ విను" అంది శ్రీకృష్ణజన్మస్థానం. నృసింహ జన్మస్థానం ఏదో అనబోయింది కాని శ్రీకృ. జ. స్థా. మాటాడ నివ్వలేదు.

"గత జూలై 24 వ తేదీని [illegible]పల్లిలో నివసించే సి. డబ్ల్యు. కాంట్రాక్టర్ శ్రీ జై నారాయణ్ వ్యాస్ రు 280 ల చెక్కుపై సంతకం పెట్టాడు. అంతకు ముందు సికిందరాబాద్ నగర పాలక సంఘం కమీషనర్ శ్రీ డి. ఆర్. మధూర్ నుంచి అతనికి టెలిఫోన్ వచ్చింది. పాల్‌దాస్ మెమోరియల్ ప్రసూతి ఆసుపత్రికి విరాళం ఇమ్మనమని ఆ టెలిఫోన్ సందేశం. ఒక ఉద్యోగి వచ్చి ఆ చెక్కు తీసుకు ఆంధ్ర బేంకుకి వెళ్ళాడు. మూడు గంటలైపోయింది కాబట్టి ఉదయం ఇమ్మన్నారు బేంకు వాళ్ళు.

"చెక్కు పంపిన శ్రీ వ్యాస్ శ్రీ మధూర్‌కి పంపించిన సంగతి టెలిఫోన్‌పై అందచేశారు. 'ఏం చెక్కు? ఏం విరాళం? నేనడిగే పంపలేదే' అన్నారు శ్రీ మధూర్. సొమ్ము సంగ్రహించి, బేంకు వాళ్ళకి చెక్కు మార్చనీయవలదని శ్రీ వ్యాస్ కబురంపారు. మరునాటి ఉదయం చెక్కు మార్చుకొనడానికి ఆంధ్ర బేంకుకి వచ్చిన వ్యక్తి చేతులకి బేడీలు తగిలించారు పోలీసు వాళ్ళు. అతని పేరు ఆల్బర్టు అలెగ్జాండర్, సెంట్రల్ రైల్వే ఉద్యోగి.



ఆల్బర్ట్ అలెగ్జాండర్.

"అంతకుముందు జూన్ 12 వ తేదీన జరిగిన విషయం. జండా తిలిపాక్త్ కార్యాలయానికి హైదరాబాద్ నగరపాలక సంఘ కార్యాలయం నుంచి టెలిఫోన్ వచ్చింది. టెలిఫోన్‌లో కమీషనర్ శ్రీ సి. ఎస్. శాస్త్రి కంఠంవంటి కంఠం వినిపించి, ప్రసూతి ఆసుపత్రిలో పడకలకి, పిల్లల ఊయలలకి విరాళం కావాలని కోరింది. టైపిస్టు 'వి. ఆర్. చారి'ని పంపిస్తున్నామని చెప్పింది.

"టైపిస్టు 'వి. ఆర్. చారి' వెళ్ళినప్పుడు జండా తిలిపాక్త్ కార్ఖానావాళ్ళు వంద రూపాయలిచ్చారు. వంద తీసుకొని, రసీదిచ్చి, వెళ్ళిపోయాడు చారి. మళ్ళీ 16 వ తేదీవాడు నగర పాలక సంఘం లెటర్ హెడ్‌పై శ్రీ సి. ఎస్. శాస్త్రి సంతకంలో ఒక ఉత్తరం తెచ్చాడు: విరాళం సరిపోదని, ఇంకా రు. 280 లైనా కావాలని. 'మేం జవాబు రాస్తాంలే!' అన్నారు కార్ఖానావాళ్ళు. 'ఆ జవాబు నాచేతికే ఇవ్వండి. నేనే పట్టుకెడతా!' అన్నాడు చారి. వాళ్ళివ్వక, 25 వ తేదీన జాబు వ్రాశారు. ఆ జాబు నగర పాలక సంఘంలో గందరగోళం లేవదీసింది. వి. ఆర్. చారి పేర తిరిగే టైపిస్టు అక్కడ లేడు. శ్రీ శాస్త్రి విరాళంకోసం టెలిఫోన్ చేయలేదు. పోలీసులకు ఫిర్యాదు అందచేయబడింది. ఇన్స్పెక్టర్ శ్రీ వెంకటరమణారావు దర్యాప్తు ప్రారంభించారు.

"జూలై 25 వ తేదీన సికిందరాబాదులో చేతికి బేడీలు తగిలించుకున్న ఆల్బర్ట్ అలెగ్జాండరే ఈ వి. ఆర్. చారి. నాలుగు నెలలు మనదగ్గర గడిపి కఠినశిక్ష అనుభవించమన్నారు మేజస్ట్రేటు."

"ఇది సరే! పునర్ పునర్ పునర్వివాహితుడి సంగతి చెప్పు" అంది నృ. జ. స్థా. 'హుఁ!' అంటూ హుంకరించింది శ్రీకృ. జ. స్థా. ★

# ★ న్యూఢిల్లీ లేఖ ★

(10-వ పేజీ తరువాయి)

కూడా వినియోగించబడుతున్నాయి. అవి కేవలం యుద్ధానికే సిద్ధం అని చెప్పలేదు—

ఇండియన్ ఎయిర్ లైన్స్ కార్పొరేషన్ వారికి లుప్తమైన డకోటా విమాన భాగాలు కూడా కావాలి దీనికి చాలా 'కాలం' పడుతుంది. వీరు కోరుకున్న AVRO రకం విమానాలు 1961 సంవత్సరం తర్వాత గాని తయారై చేతికిరావట! అయితే 1961 వరకు ఇండియన్ ఎయిర్ లైన్స్ కార్పొరేషన్ వారు ఆగుతారా లేక ఆగగలరా—???

'ఆగలేము-ఆగము' అంటారు శ్రీ ఎస్. కె. పాటిల్. ఇటీవలి ఎయిర్ లైన్స్ బోర్డు మీటింగులో రెండవ ప్రణాళిక క్రింద అయిదు 'ఫోకర్ ఫ్రెండ్‌షిప్' విమానాలూ, వాటితో పైగొంట్లూ, మూడవ ప్రణాళికలో మరో అయిదు 'ఫోకర్ ఫ్రెండ్‌షిప్' విమానాలు ఖరీదు చేయాలని నిర్ణయించబడింది. చిత్రం! ఇదే ఇంకో విధంగా చెప్పాలంటే— ఇక వేరే AVRO విమానాలు కొనడం ఎందుకు? బహుశః ఆ ప్రయత్నం విరమించబడిందేమోనని అభిజ్ఞుల యోచన. నిజమే అయి వుండాలి. AVRO విమానాలకన్నా [illegible] ద్వితీయ ప్రణాళికా కాలంలో మళ్ళీ కొనుగోలుకు ఇదికాకపోతే మరి కారణమేమిటి? భారతదేశంలో ఫోకర్ ఫ్రెండ్‌షిప్ విమానాల తయారీకి కూడా రాయబారాలు జరుగుతున్నాయట.

ముసుగులో గుద్దులాటలూ, లోపల గుంజాటనలూ — బయటికి ప్రకటనలూ, తలోరీతిగా ఉంటూన్న నేటి పరిస్థితులలో ప్రజాస్వామ్య వ్యవస్థ పడుతున్న అవస్థలు వర్ణనాతీతం! ★

---

'నేను చాలా దురదృష్టవంతుణ్ణి - దౌర్భాగ్యుణ్ణి.'

'ఏం అలా అంటున్నారు?'

'ఏం లేదు. మా ప్రొప్రయిటర్‌లాగా సంతకం చేయడం ప్రాక్టీసు చేశా మూడు నెలలు. తీరా అది కుదిరే సరికి ఆయన దివాలా తీశాడు. చాలదూ.'

# ఛాంపియన్ చాకచక్యం

ఈ సంవత్సరం జరిగిన ఆంధ్రా ఛాంపియన్ షిప్ పోటీలలో వర్ధిష్ణువు, యువకుడు డి. రంగారావు గెలుపొందారు. మొహరాలస్థానబలిమిని పురస్కరించుకొని చాకచక్యంగా దాడి చేయడం ఎరచూపే ఎత్తులు వేయడం మొదలైనవి రసవంతమైన ఆటకి ముఖ్యం. శ్రీ రంగారావు ఈ ప్రజ్ఞని సాధిస్తున్నారు. గడితేరినబంటుని మంత్రిని చేసుకోవడం చాలా కష్టమైన పని. దీనిని ఈ సంవత్సరపు ఛాంపియన్ ఎలా సాధించింది ఈ క్రింది ఆట వివరిస్తుంది.

### బర్డ్స్ ఓపెనింగ్

తెలుపు ఆర్. సుబ్రహ్మణ్యం,
నలుపు డి. వి. రంగారావు

1. బ-రాశ 4, బ-మ 4; 2. బ-మశ 4, గు-రాశ 3;3. గు-రాశ 3, బ-మశ 4;4. బ×బ, గు×బ; 5. గు-మశ 3, గు-మశ 3;6. బ-రాగు 3, బ-రాగు3;7. శ-గు 2, శ-గు 2; 8. కోట గు×గు; 9. గుబ×గు, కోట; 10 ఏ-గు1,ము-శ 2; 11 మ-శ 2, బ-మగు 3; 12. బ-మ 4, శ-గు 2; 13. బ×బ, బ×బ; 14.గు-రా 5, ఏ-గు 1;15. ఏ×శ 2,ఏ×ఏ; 16. శ×గు,

రెండు జంతువులకు ఏనుగుని బలిచేయడం సాధారణంగా లాభసాటే; గాని తెలుపు తన నల్లశకటుని ఆటలోనికి తెచ్చాక ఇది చెస్తే బాగుండేది. ఇప్పుడు గు-ని లు వు వరస నలుపుకి ధారపోయాల్సొచ్చింది.

16. ......, ఏ-గు 3; 17 శ-రాగు2,
తెలుపు ఒక ఎత్తు వెనుకపడక తప్పదు.
17 ......, బ-రా 3; బలహీనమైన ఈ ఒక్కబంటుని సురక్షితం చేస్తే నలుపుకి ఇంకే ఇబ్బంది ఉండదు.

18. బ-రా 4, బ-శ 5; 19. మ-రా 2, ఏ-మశ 1; 20. శ-రా 3, ఏ-ఏ 3; 21. ఏ-మ 1, మ-ఏ 4; 22. శ-మ 4?

ఒకబంటుని శకటుతో కాస్తే రెండోది పోతుంది. ఇంతకంటే 22. మ-గు 2 నుంచి ఎత్తనిపిస్తుంది. అప్పుడు నలుపు తన గు 2 కాపుకోవాలి.

22......, మ×బ; 23 ఏ-మ 2, మ-గు 8 షా; 24. శ-శ 1, ఏ-ఏ 8; 25. ఏ-గు 2, మ-శ 8; 26 ఏ-శ 2, మ-గు 8; 27. రా-శ 2, బ-మ ఏ 4; 28 బ-రా గు 4, బ-ఏ 5; 29. బ-శ 5, బ-ఏ 6; 30. శ-గు 2? బ-ఏ 7!; 31. బ×రా బ, బ×బ; 32 ఏ-గు 2, మ-గు 8 షా; 33. రా-గు 3, శ×గు షా!; 34. శ×శ, ఏ-రా 8; 35. మ-మ 2, బ-ఏ 8=మ.



నలుపు 35 వ ఎత్తు తరువాత.

ఇప్పుడు బల్లమీద మూడు మంత్రులున్నాయి.!!

36. మ-మ 7, మ-రా 6 షా; 37. రా-ఏ 4, మ-ఏ 8 షా; 38 రా-గు 3, ఏ-రా 6 షా; 39. రాజీనామా.
లేకపోతే రెండవ నల్లమంత్రితో షా చెప్పి ఆటకట్టిపోతుంది. తెలుపు తన 36 వ ఎత్తు శ-శ 4 వేస్తే ఆటని కాయడానికి అవకాశం ఉన్నట్టు కనబడుతుందిగాని అది కూడా లాభంలేదు. తెలుపు ఒక ఎత్తు వెనుకబడ్డం చేత 36. మ-మ 7 వల్ల ఆటకట్టు బెదిరించగలిగాడేగాని ఫలందక్కలేదు.

### వార్తలు

అఖిల భారత చతురంగ సమాఖ్య ఆధ్వర్యాన జాతీయ ఛాంపియన్‌షిప్ పోటీలు ఈ సంవత్సరం డిసెంబర్ నెల పదహారవ తేదీ నుంచి ముప్ఫయ్యో తేదీవరకు డిల్లీ సెంట్ కొలంబో స్కూలులో జరుగుతాయి.

5 వ ఆంధ్రరాష్ట్ర పోటీలు జనవరి (1960) 5 వ తేదీనుంచి 12 వ తేదీవరకు అనంతపురంలో జరుపడానికి ఆంధ్రరాష్ట్ర చతురంగ పరిషత్ నిర్ణయించింది.

### 3 వ సమస్య పరిష్కారం

చాలా ఉత్సాహంగా అనేకులు 3 వ సమస్యకి పరిష్కారం వ్రాసి పంపారు. కీలకం ఎత్తుని సరిగ్గానే ఊహించారు, గాని ఈ కీలకంలో మరొక చిన్న కీలకం ఉంది, దానిని ఊహించినవాళ్ళు కొద్దిమందే. ఒకటవ అడ్డవరసలో ఒకగడి 1<sup></sup>కి తప్పించి మరొక్కడికైన ఏనుగుని కీలకం ఎత్తులో నడపాలి. కీలకంలో కీలకాన్ని (కిక్కిలకం అందాం) సరిగా ఊహించినవారు (1) అ. ప్రసాదరావు, రాజమండ్రి, (2) వి. కె. వి. ప్రసాదరావు-సికింద్రాబాదు. (3) ఎ. ప్రభాకరరామ-వైజాగ్, (4) కె. టి. రావు-నాగపూర్, (5) కిక్కిలకం పూర్తిగా కాకపోయినా కొంతవరకు ఊహించినవారు ఎస్. వీరభద్రరావు, ఖరగ్‌పూర్.

సరియైన పరిష్కారం పంపినవారు: (1) శ్రీమతి వి కమలాపట్నాయక్, చింతలపూడి (2) రాబర్ట్ జయకుమార్-ఏలూరు, (3) ఎన మంద్ర బాలకృష్ణ-సికింద్రాబాదు, (4) డి. మల్లికార్జునరావు-హైదరాబాదు, (5) పి. ఎస్. ఆర్. శేషయ్య-హైదరాబాదు, (6) వై వెంకటేశ్వరరావు-పెదన, (7) బి. వి. శ్రీనివాసాచార్యులు వైజాగ్, (8) బి ప్రభాకరరావు-బాత్తెరు, (9) టి. వి. కృష్ణారావు-పెదన, (10) ఎ.ఎస్.ఆర్. మూర్తి-రాజాం, (11) టి. వి. వి ఎస్. రావు-కొవ్వూరు, (12) ఎస్. కె వి. రామానుజాచార్య-తిరుమల.

### సమస్య-5

రచన: పి. టెన్ మెన్

నఏ తెఏ 6/నరా తెశ 6/నఏ తెఏ 3 నబ 2/8/1 తెబనబ 5/1 న శ 5 తెరా/నగు తెబ 6/నమ తెమ 6/ రెండెత్తులు.
నలుపు 8



తెలుపు 7

తెలుపుఆడి రెండెత్తులలో కట్టాలి. ★

### పప్పులో కాలు

'మీకెన్నేళ్ళుంటాయి'
అన్నాడు ఒక నారీమణిని జనాభా లెక్కల వ్యక్తి.
'ఇరవై ఆరు. ఏం?' అన్నదామె.
'మీ చెల్లెలి వయస్సెంత' తిరిగి అతడు ప్రశ్నించాడు.
'దానికి లేకేం-ముప్ఫయేడుకు తక్కువలేవు' అన్నది ఆమె యథాలాపంగా.

# సినిమా

## వార్తావరణం

**సం**గీతా (ఇంటిగుట్టు) ప్రొడక్షన్స్ వారు హాస్యరస ప్రధానమైన కథతో, రేలంగి ముఖ్యపాత్రధారిగా 'మా [illegible] అల్లుడు' అనే చిత్రం తీస్తున్నారు. హాస్యనటుడు హీరోగాగల చిత్రాలు మనకు అరుదు. 'పక్కయింటి అమ్మాయి' తరువాత మళ్ళీ ఇదే. ఇందులో ఎస్. వి. రంగారావు, సి. ఎస్. ఆర్., చలం, బాలకృష్ణ, నాయికగా సావిత్రి నటిస్తున్నారు. కథ, మాటలు సదాశివబ్రహ్మం వ్రాస్తున్నారు. సంగీతం ఎం. ఎస్. ప్రకాష్. నిర్మాత ఆకెళ్ళ శాస్త్రి. ఈ చిత్రాన్ని తమిళంలోను హిందీలోను కూడా తీస్తున్నారు. దర్శకుడు వేదాంతం రాఘవయ్య.

నల్లపరెడ్డి బ్రదర్స్ వారి "పెద్దకోడలు" చిత్రంలో ప్రమీల.



### బాలనాగమ్మ

శ్రీ వెంకటరమణా ఫిలింస్ వారు అగ్రశ్రేణి తారాగణంతో తీస్తున్న జానపదం 'బాలనాగమ్మ' అక్టోబరు 10న విడుదల చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. నిర్మాణం దాదాపు మూడేళ్ళు సాగిన ఈ చిత్రంలో అంజలీదేవి, రామారావు, రంగారావు, రేలంగి, రాజసులోచన నటిస్తున్నారు. దర్శకుడు రాఘవయ్య. సంగీతం టి. వి. రాజు.

### నమ్మినబంటు

దాదాపు ఇంత కాలమూ నిర్మాణంలో ఉన్న మరొక పెద్ద చిత్రం శంభూఫిలింస్ వారి 'నమ్మినబంటు'. నాగేశ్వరరావు, సావిత్రి, గిరిజ, రంగారావు, గుమ్మడి, రేలంగి ప్రభృతులంతా పాల్గొన్న చిత్రానికి ఆదుర్తి (మాంగల్యబలం) సుబ్బారావు దర్శకత్వం నిర్వహించారు. మాటలు గుంకర, తాపీ ధర్మారావు, పాటలు కొసరాజు వ్రాశారు. సంగీతం రాజేశ్వరరావు, వేణు సమకూర్చారు. నిర్మాత యార్లగడ్డ వెంకన్న చౌదరి. ఈ చిత్రం పైనెల విడుదల కాగలదనుకొంటున్నారు.

### భట్టి విక్రమార్క

పి. వి. వి. ఎస్. ఎం. ప్రొడక్షన్స్ వారి జానపదం "భట్టి విక్రమార్క" కూడా పూర్తి కావచ్చింది. ఇదీ అక్టోబరులో వస్తుంది. రామారావు, అంజలీదేవి, రంగారావు, రేలంగి పాల్గొన్నారు. రచన తాపీ ధర్మారావు, అనిసెట్టి. సంగీతం పెండ్యాల. దర్శకుడు జంపన.

### పెళ్ళికానుక

వీనస్ పిక్చర్స్ వారి 'పెళ్ళి కానుక' నిర్మాణం గతివారం వాహినీలో ఆరంభమైంది. [illegible]

ఏర్పాటుచేస్తోంది. అందులో జెమినీగణేశన్, బి. సరోజాదేవి, అతిథిగా నాగేశ్వరరావు నటించారు. ఇప్పుడు తెలుగు చిత్రంలో నాగేశ్వరరావు, కృష్ణకుమారి, బి. సరోజాదేవి, రేలంగి నటిస్తున్నారు. జగ్గయ్య, సుమ్కడి, మాలతి అతిథులుగా పాల్గొంటారు. మాటలు పాటలు ఆత్రేయ వ్రాస్తున్నారు. దర్శకుడు శ్రీధర్. తమిళ చిత్రానికి ఎ. ఎం. రాజా కూర్చిన సంగీతం విశేష ప్రజాదరణ పొందింది. ఆయనే దీనికీ పాటలు చేస్తున్నారు.

*    *    *

పదిహేనేళ్ళుగా తెలుగు సినిమా పరిశ్రమలో స్టిల్ ఫోటోగ్రాఫరుగా వుంటున్న తిం. సత్యం (జైహింద్ స్టుడియో), విజయరాఘవాచారి రోడ్‌లో నిర్మించుకున్న "విజయసారథి" భవనంలో ఆగస్టు 28న గృహప్రవేశం జరుపుకొన్నారు. ఫిలిమ్ దర్శకులూ, నిర్మాతలూ, నటులూ వచ్చి సత్యాన్ని అభినందించారు.

## సంగీత వార్తలు

చారిత్రక చారిత్రిక చిత్రం 'మొగలే ఆజామ్'లో 'బాక్సాఫీసు నటులూ' సెట్‌లూ వగైరాలన్నిటికీ సరితూగేందుకు నౌషద్ సంగీతంలో ఖాన్ సాహెబ్ బడేగులామలీఖాం గానసభ చిన్నదొకటి (బహుశా అక్బరు సభలో) ఏర్పాటుచేశారు. గతవారం దానికై ఆయన పాటలు రెండు రికార్డు చేశారు.

*    *    *

ఇటీవల మంచిపాటలుచేస్తున్నా డనిపించుకున్న సంగీత దర్శకుడు కల్యాణ్ జీవీర్ జీ, తనసోదరుడు ఆనంద్ జీని భాగస్వామిగా ఎంచుకొని కల్యాణ్ జీ ఆనంద్ జీ పేరిట పనిచేయ నిశ్చయించాడు.

*    *    *

చేతనావారి "గుళ్ళోపెళ్ళి" చిత్రానికి సంగీతదర్శకుడు రమేష్‌నాయుడు రేవతి స్టుడియోలో రెండు చక్కని పాటలను రికార్డుచేశారు. ఒకటి మధురగాయని సుశీల పాడింది. రెండోది శ్రీనివాయస్‌కు ఆలంబనం. కొమ్మిరు పళ్ళెరాలమీద నగిషీలలా సన్నటి రాగలతలతో పాటను అలంకరించి తీర్చడంలో ప్రవీణుడైన రమేష్ అప్పటికప్పుడు మార్పులూ, చేర్పులూ, చేస్తూవుంటే చూస్తూవుండడమే ఒక ఆనందం అనిపించింది. "ఇల్లలో నాకథ కన్నీరేనా" అనే పాట సుశీల, 'చింతతో నే చితికిపోయిన చెల్లి కేమని చెప్పగలవూ'...అనే అంతరాత్మ ఘోషను శ్రీనివాస్ పాడారు. అనిసెట్టి ఈపాటలు వ్రాశారు.



చేతనావారి 'గుళ్ళో పెళ్ళి' చిత్రంలో

# చిత్ర సమీక్ష

## కృష్ణలీలలు



'కృష్ణలీలలు' చిత్రంలో
యశోదా కృష్ణులు.

కృష్ణుడు చాలా అల్లరి పిల్లవాడు. చూట్టానికి అలా వుంటాడు గాని చాలా గట్టివాడని, దేవుడే అలా మారువేషంలో వచ్చాడనీ, అతడు అల్లరి చేస్తున్న రోజుల్లోనే కొందరికి తెలుసు. తెలుసుకున్న వాళ్ళల్లో కూడా కొందరికి తెలిసినట్లే కనిపించి తెలీకుండా తప్పించుకు పోతూ వచ్చాడు. కొందరికి అసలతని సంగతి బోధపడిందికాదు. దానాదీనా నాటికీ నేటికీ ఈ విషయం 'శుద్ధీ మొదలూ' పసిగట్టాని చాలామంది తిప్పలుపడుతూనే ఉన్నారు — ఆ రెండూ ఉండేవని తెలిసే. ఏమాట కామాటే చెప్పుకో వాలి: ఋషుల తరవాత, ఈ విషయమై గట్టిగా ప్రయత్నం చేసింది సినిమావాళ్ళే. ఏదో ఒఘట్టంలోనో, మొత్తం సినిమా అంతటి మీదనో నాటకంలోనో కృష్ణుడిని బిగించి నిలబెట్టాలని అన్ని ప్రాంతాలవారూ ప్రయత్నిస్తూనే వచ్చారు. సినిమావారికి మటుకు విశ్వరూప సాక్షాత్కారం బాక్సాఫీసువసూళ్ళలో కనబడాలి. అదే దాఖలా. సి. పుల్లయ్యగారు కొలంవాడు తీసిన కృష్ణలీల ఈ దాఖలా చూపించింది. మళ్ళీ ఇప్పుడు రాజ్యం పిక్చర్సువారి చిత్రానికి ఆయనే దాదాపు అదే సినీకథను వ్రాసిపెట్టారు. దేవకీ వసుదేవుల పెళ్ళితో ఆరంభమయ్యే కథాప్రకారం పాత సినీకథాప్రకారంగానే ఉన్నా— రాజ్యం పిక్చర్సువారి ఈ కొత్త "కృష్ణలీలలు" చిత్రంలో కొన్ని కొత్త అంశాలూ వున్నాయి. సాంకేతికంగా సాధించిన ప్రకృతి 'ఛాయ'లూ, సినీమాయలూ, ఇ. వి. సరోజ, సాయి సుబ్బులక్ష్మి మొదలగువారి నాట్యాలూ, 'ధిక్కారము సైతునా' అనేపాట పల్లవికి 'ధిక్కారమును చేయుడీ' అనే మార్పూ మొదలగునవి. పాతే కథను కొత్తగా చెప్పడం, కృష్ణుని మోహనరూపాన్ని ఆవిష్కరించడం వంటి విషయాలలో— అతి మహా మహో మహుల్కే ఒపట్టాన పద్ధరని వ్యవహారం అని, దర్శక రచయితలు ఏమంత పట్టింపులు పెట్టుకోకుండా సూటిగా సాక్షిగా చిత్రించారు. నటులు లక్ష్మీరాజ్యం శ్రీరంజని, కుమ్మడి, రేలంగి, పద్మనాభం, మాడిబాబు (అక్రూరుడు) మొదలగువారంతా సినీకథోచితంగా వ్యవహరించారు. కృష్ణుడు వేసిన అమ్మాయి హాయిగ ఆడుకుంది. చూడ ముచ్చటగా వుంది.

చిత్రం అంతటిమీదా, విశ్వరూపం ధరించిన (విశ్వరూపంఅంతే ఖాళుగా ఎత్తుగా కనబడడం) కృష్ణుడిలా ఎత్తుగా నిలబడినవాడు నటుడు రంగారావు. కృష్ణుడు మధురానగరికి వచ్చేసరికే కంసుడు మృత్యుప్రాయుడై పోయే సన్నివేశాన్ని రంగారావు చాలా సమర్థంగా ఆవిష్కరించాడు. ఒకటి రెండు చిన్న దృశ్యాలలో ఆయనకు చేసిన మేకప్—ముఖ్యంగా గుబురుమీసం ఏర్పాటు, నటనకు ఆటంకం కలిగించింది. ఆయనమీద విశేషమైన గౌరవాభిమానాలూ, కృష్ణుడిమీద భక్తిప్రపత్తులూ ఉన్నవాడికి కూడా కంసుడు హోరుగాలితో అల్లకల్లోలంగా ఉన్న రాజమందిరంలో మరణవేదన పడుతున్నాడా, గాలి బాగా లేక జలుబుచేసి, తుమ్ములు నిభాయించుకుంటున్నాడా అనే భీ శంకరమైన, తుమించరాని ఆలోచన కలుగుతుంది... ఈ రెండూ ఇలా చిన్న కళంకాలలా మిగిలినా, మొత్తం మీద కంసుడు, రంగారావు ప్రశంసనీయంగా నడిపిన పాత్రలలో ఒకటి అవడానికి సందేహం లేదు. సందేహం లేకుండా ఉత్సాహంగా చెప్పుకు మెచ్చుకోవలసినవాటిలో కృష్ణుని జతగాళ్ళుగా బాలకృష్ణ నల్లరామూర్తి చేసిన హాస్యం ముఖ్యం. ఇంత చక్కని, ముద్దొచ్చే హాస్యాన్ని ఈ మధ్య తెలుగు సినిమాలో చూసి ఉండము.

సంగీతం పూర్తిగా కథోచితం కాకపోయినా యథోచితంగా ఉంది. దక్షిణామూర్తిగారు రెండుమూడు చక్కనిపాటలు చేశారు. ఎం. ఎల్. వసంతకుమారి పాడిన జావళి ఒకటి, సుశీలపాడిన 'అందాలగని బృందావని' (ఆరుద్ర) చాలా హాయిగా ఉన్నాయి. దానికి రూపకల్పన మైసూరు బృందావన్ గార్డెన్స్‌కు తీసుకొచ్చెయ్యడం అద్భుతం అనిపించదు. అలాగే మాయా ఛాయాగ్రహణం ఇంతగా అభివృద్ధి పొందిన ఈనాడు, యమునానది వసుదేవుడికి దారి ఇచ్చిన సన్నివేశాన్ని చాలా బాగా సహజంగా (నది అడుగున ఉంటూయని తో చేవన్నీ చూపించారు.) తీసిన ఈ చిత్రంలో మన్నుతిన్న కృష్ణుడి నోట్లో యశోదకి, మనకీ మళ్ళీ "భూగోళం మాగ్య నశ్యం" మాత్ర్య భూగోళమే కనిపించడం, (అసలిది ఛాయామాయావి బాబు భాయ్ మిస్త్రీ పెటెంటువ) అసలైన అద్భుతం. అదో కృష్ణలీల.

మొత్తంమీద మిగతాలీలలూ ఆటపాటలు హాయిగానే ఉన్నాయి కొబట్టి పిల్లలతో ఓసారి వెళ్ళి చూడవచ్చు. అప్పుడేనా కృష్ణుడి నోట్లో భూగోళం (ఆస్ట్రేలియా ఇంతేసి వగైరా మ్యాపులతో ఉండును) కనబడే దృశ్యం వచ్చినప్పుడు పిల్లల దృష్టి ఆకర్షించి మళ్ళించడం మంచిది.

## మాస్కో ఉత్సవంలో జల్సాఘర్‌కు బహుమతి

మాస్కో అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో సత్యజిత్ రాయ్ చిత్రం 'జల్సాఘర్' ఒక రజితపతాకాన్ని అందుకొంది. ఉత్సవంలో ప్రథమ బహుమతి, 'ది ఫేట్ ఆఫ్ మాన్' అనే సోవియట్ చిత్రానికి లభించింది. పశ్చిమజర్మనీకి చెందిన "వుయ్ మిరకిల్ చిల్డ్రన్"కు ప్రథమ సువర్ణ పతకం, 'ది డేవిల్ కమ్' అనే పాకిస్తానీ చిత్రానికి "ఫ్లయిట్ ఫ్రమ్ ఎ షాడో" అనే చెక్ చిత్రానికి రెండవ సువర్ణపతక గౌరవం లభించాయి.

* * *

సంగీత దర్శకుడు చిత్రగుప్త, గతవారం మద్రాసువచ్చి ఎ. వి. ఎం. కొత్త హిందీ చిత్రానికి ఏక బిగిన ఏడురోజులలో పది పాటలు రికార్డుచేశారు. వరసలు అంతకుపూర్వమే కల్పించి ఉంటాడనడానికి సందేహంలేదు. రచయిత రాజేంద్ర కిషన్ కూడా పాటలు పదిరోజుల క్రితమే (గతవారం బొంబాయి లేఖలో కథప్రకారం) వ్రాశాడు.



అయితే అంతకుముందు హాస్యకల్పనలో ఉన్న ప్రమాణం ఇప్పుడు తగ్గిందా అని కూడా అనిపిస్తుంది. దానికి స్టార్ సిస్టం కొంతవరకు కారణం. రేలంగి ప్రజ్ఞావంతుడని పేరు వచ్చిన తరవాత, పేరుమోటుకు వాడుకునే ధోరణి ప్రబలింది. ఒక రేలంగి అనేకాదు. అందరి విషయమూ ఇంతే. తెలుగు హాస్యనటులలో — ఎవరికి తీసిపోని ప్రజ్ఞావంతులు అనేకులున్నారు. వారిలో కొందరు కొన్ని ప్రత్యేక విద్యలలో ప్రజ్ఞ గలవారు. తెలుగు సంప్రదాయంలో పుట్టి పెరిగి, దాన్ని తత్వాన్ని వంటబట్టించుకుని అందులో హాస్యరసాన్ని అందంగా చెప్పగలవారు. అయినా వారిలో చాలామందికి అటువంటి అవకాశాలు లభించటమే లేదు.

తెలుగులో నాటికీ నేటికీకూడా గొప్ప హాస్యచిత్రాలు అని చెప్పుకోతగ్గవి అనాడే తయారయ్యాయి. పదిహేనేళ్ళనాడు డైరక్టర్ జగన్నాథ్ రెండు స్వచ్ఛమయిన కామెడీలుతీశాడు-భలే పెళ్ళి, తారుమారూను. ఈ రెంటిలోనూ కథా కమామీషే కాక, చిత్రశిల్పం కూడా 1959 నాటికి పాతబడనిదిగా, నేటికీ అనుకరణయోగ్య మవతగ్గదిగా ఉండంటే ఆశ్చర్యపడితే పడ్డారు గాని ఆముక్క నిజం. భలే పెళ్ళి మోలియర్ నాటకానికి అనుకరణ. అందులో డాక్టర్ శివరామకృష్ణయ్య (మొన్నటి చక్రపాణిలో తాతగారు) హీరో వల్లభరాయుడు వేషం వేశారు. ఇంటి కెవరొచ్చినా, జలగలవైద్యం కోసమే వస్తారని త్రికరణశుద్ధిగా నమ్మి, అందరికీ ఆ వైద్యంచేసి వదలిపెట్టే జలగల డాక్టరువేషాన్ని, కొన్నాళ్ళక్రితం ముసలి తండ్రి వేషాలు వేస్తూవచ్చిన రంగస్వామి అయ్యంగారు నిర్వహించారు. సురభి కంపెనీకి చెందిన శాంత (సురభి బాలసరస్వతి పిన తల్లి), నాగరత్నబాయి, జయంతి గంగన్న వంతులు కూడాపాల్గొన్నారు.

తారుమారు అతి విచిత్రమైన కథ. ఫెయిరీ టేల్ లాటిది. తార్న్ స్మిత్ వ్రాసిన టర్న్ ఎ బౌట్ అనే నవలను పట్టుకుని కొడవటిగంటికుటుంబరావు గారుదీనికి సినిమా కథా మాటలు వ్రాశారు.

పాటలు ఆకాలంలో బాక్సాఫీసు సూత్రాలలో చేరలేదు. అందులో ఒకే ఒక పాట పెట్టారు. ఒక మొగుడూ పెళ్ళాం వశీకరణ విద్య తెలిసిన ఒక బైరాగి దగ్గర చెరో తావీదూ తెచ్చుకుంటారు సట్టుగా. ఆయన్ని లోబరచుకోడానికి ఆవిడా, ఆవిడని అకట్టి ఉంచుకోడానికి ఆయనాను. ఒక శుభగ్రహ ముహూర్తాన తాకీదులో తారుమారై పోవడంతో ఆలుమగలిద్దరూకూడా తారుమారై పోతారు. శాలీలు సూటులుగా ఉన్నా బుద్ధులు మారిపోతా యన్నమాట. పొద్దస్తే లేస్తూనే, అలవాటైన వాడిలా అతను వంట పనులు చూసుకుంటాడు - ఆవిడా పంచుంఫుల్ల పట్టుకు వీధరుగుమీద మగరాయుడిలా నిల్చుని వచ్చేపోయే వాళ్ళని హాసలగొడుతుంది మొగకబుర్లతో కంఠస్వరాలు కూడా మారిపోతాయి- ఇటీవల మాయాబజార్ లో ఘటోత్కచ శశిరేఖలకంఠాలలా. ఆమెకంఠం, మాట తీరూ భర్త తరహాలోనూ, అతనిది ఆమెతీరు లోనూ వస్తాయి. దాదాపు రెండు రీళ్లు ఇలా ట్రాక్ మార్చి పొట్టచెక్కలయేలా నవ్వించారు. ఇందులో ఆలుమగల పాత్రలను కీ. శే. డి. హేమలత, (మంత్ర దండం) వేమూరి పరబ్రహ్మశాస్త్రి నిర్వహించారు. పరబ్రహ్మశాస్త్రి నటన స్థాయీ, సౌలభ్యం ఈ నాటికీ ఉత్తమ శ్రేణివనిపించాయి; నాలుగేళ్ళ క్రితం ఈ చిత్రం చూసినప్పుడు ఇందులో కొడవటిగంటి కుటుంబరావుకూడా ఒక వేషం వేశారు. దర్శకుడు జగన్నాథ్ ఈ రెండిటినీ చిన్న చిత్రాలుగా తీసి కలిపి విడుదల చేశారు.

ఇంత అద్భుతమైన శిల్పం చేతులోఉండి, గొప్ప గొప్ప కామెడీల స్థాయిలో చిత్రాలు తీయగలిగిన జగన్నాథ్ అనేక కారణాల వల్ల ఈ ఉద్యమాన్ని సాగించలేరు. ఐదారేళ్ళ క్రితం ఈయన తీసిన తమిళ హాస్య చిత్రం 'వైరమాల' సగ్వాల ప్రశంసలూ, బాక్సాఫీసు జోహార్లుకూడా అందుకుంది.

(మిగతా పైవారం)

# ★ బుకానందలహరి ★

(12-వ పేజీ తరువాయి)

వరండాలో రాజా పోతూంటే కిటికీలోంచి అడిగాను. మారు మాటాడకుండా ఇచ్చాడు. ఎలాగైనా చాలా పెద్దమనిషనుకో. నువ్వు వెయ్యి చెప్పు...చీ ఛీ అదేమిట్రా హీరోయినూలా అలా...తప్పు. సిల్లీ. ఏమిటి సంగతి. వాట్ ఈజ్ రాంగ్?...అరె!

గుర్నాధం కళ్లు వత్తుకున్నాడు. మా నాన్న మనియార్డరు పంపగానే నీకు పది రూపాయలు ఇచ్చేస్తాగాని, రేపటి సమస్య చూడరా. ఈ పెళ్ళి జరిగితే, నేచచ్చిపోతాను. జరక్కపోతే మా నాన్న చంపేస్తాడు...ఎలాగ.

అప్పారావు జాలిపడాడు...పుట్టుట గిట్టుట కొరకే అనుకోవడనుకో యిప్పుడు. అయినా....అంత భయమేమిటి. రామయ్యగారు కళ్ళనిన్ను చూడగానే ఫ్లాట్ అనేస్తాడే అనుకుందాం. ఆయన అభిరుచిమీద నాకు గురిలేదు. అప్పాలు బాగాఇచ్చిన సరే...కోసు. ఆ అమ్మాయి అన్నపూర్ణ ఒప్పుకోదమ్మా...కోడి లా చూపులూ, బోడి పోకూ వీడూ నాకేం బావులేడునాన్నా అంటేనే? అన్నాడు.

అలా అనదయ్యా. నన్ను చేసుకోపోతే ఇంచుమించు చచ్చిపోతాన్నట్టే మాటాడిందట అమ్మాయి.

ఇద్దరూ మాటాడలేదు.

పోనీ ఓపనిచేస్తే...అన్నాడు గుర్నాధం. ఈయన కాళ్ళ మీద ఎలాగా పడదామనుకున్నాం కాబట్టి రేపొద్దున్న రాగానే ఆ పని చేసి అయ్యా! ఇలా నేను ఫలానా పిల్లని చేసుకోవాలనుకుంటున్నానూ నామీద దయయుంచి మీ అమ్మాయి పెళ్ళి తప్పించుకు మీరే ట్రిక్కు చెబుదురూ అని రహస్యంగా అడిగితే?

అప్పారావు జాలిగా నవ్వాడు. ఆయనకి నువ్వు చెబుతున్న ఫలానా అమ్మాయి భానుమతి మీద ఏమాత్రం మంచి అభిప్రాయం ఉన్నట్టులేదు. నవ్వేస్తాడు; తాడెక్కి నవ్వేశాడు కూడా అన్నాడు అప్పారావు.

గుర్నాధం ఉలిక్కి పడ్డాడు అదేమిటి భానుమతి ఆయనకి తెలుసా? అన్నాడు.

భానుమతిని, అప్పారావే ఆయనకు పరిచయం చేశాడు.

ఏం చెయ్యను. ఇందాక హోటలు దగ్గర నువ్వు పారిపోగానే ఆయన నన్ను పిచ్చివాడని పోలీసుకి ఒప్పచెప్పబోయి, నా యింగ్లీషూ అదీ వినిపించగా, నాలిక్కరచుకున్నాడు. సారీ అన్నాడు. తరవాత కాఫీతాగాం. తరవాత నా సంగతి అడిగి నీపేరు తీ నీ ఎడ్రసు అడిగాడు. నువ్వు తెలుసని చెప్పొద్దంగు కని అనగడం మర్చిపోయి మనకథ చెప్పాను.

భానుమతి ముక్కా కొంతదూరంవచ్చేసరికి బుర్ర పైకి తిరుగుతుం దన్నాను. నవ్వాడు...వాళ్ళింట్లో వాళ్ళు భానుమతి ఉందిగదా అని ఇంటికి దీపాలుపెట్టించుకో లేకున్నాను...నవ్వాడు...భానుమతికి వడుకు ఉందని కొందరూ లేదని కొందరూ పందాలు వేసుకున్నారనీ, ఉందన్నవాళ్లు ఓడిపోయారనీ చెప్పాను. అబ్బా అన్నాడు...నవ్వి నువ్వు నవల్సులు రాయకూడదోయ్ అవునుగాని, గుర్నాధం ఎడ్రెసేమిటి టన్నావు. బుద్ధిమంతుడేనా, అతి మంచివాడని హోటల్లో దీపాలు మా నేశారా, ఇలా మాపిల్ల నిద్రపోను కుంటున్నాం, పిల్ల చిదిమిదీపం పెట్టినట్టుంది రేపొద్దున్నొచ్చి అమ్మాయిని చూసి అతను ఓ నంటే - ఈపాటికి మా పూర్ణమ్మఫోటో అందేఉండాలి—ఊరికెళ్తూనే తాంబూలాలిచ్చుకోడమేనూ అన్నాడు—అన్నాడు అప్పారావు.

గుర్నాథం దిగాలుపడిపోయాడు. ఏదారి? అన్నాడు. (మిగతా పైవారం)

# 16.



## ఆధారాలు

**అడ్డం**

1 ముఖ్యమంత్రి మొదటిరంగు.
3 ఇంకొకరి ధర పలుకుబడి.
6 మాట్లాడవే! అదే బంగారం.
8 వందలో ఎన్నెని వరుసలు!
9 కంకరుడిలో అనుమానం కలుగుతుంది.
11 నడిచే నాలుగోవంతు.
12 వదనము మార్చితే తలలో పెట్టుకోవచ్చు.
15 నానితో పాటు ఇది మరచిపోము.
18 దీని వానకి ముత్యపుచిప్ప ఎదురుచూస్తుంది.
19 ఇది తిరగే స్తేచాలు.
21 పదహారు నిలువుకి పాత్రమేగాని ఇది పనికిరాదు.
23 వానరుల తరువాత పుట్టిన మనుష్యులు.
25 తందనా-తందనా-తందనా......ఇవే.
26 తి సేవి కలుపు.

**నిలువు**

1 లేనిపోనివాడు మొదట నీలా ఉంటుంది.
2 కుట్టేది మునగడా! అలాగే ధ్వనిస్తుంది.
4 సిరిచేసారా.
5 పాడ్యమి, విదియ, తదియ...పౌర్ణమి, అమావాస్య.
6 పడమరమూసిన కండు.
7 కంకే తిరగబడితే శిరోజం.
10 పర్వతమార్గం వీక్షించుము!
11 వానకాలం వరదప్రవాహంలో నీటి మార్గం.
13 సమితి ఏర్పాటుచేసే బస.
14 పరిపూర్ణం కాదు, భాగాలు.
16 ముద్దలతో మొర పెట్టుకోనేది; దంచేది కాదు.
17 ఆరు నిలువు పండితే ఏమౌతాడు?
18 మొదటి మర్యాద చివర పూర్వకాలముంది.
20 మంచానపడ్డ స్త్రీ.
22 కేము తల కొరకేదా?
24 రుక్మిణి అన్నగారు ఆమెముందే పుట్టాడు.

[సవరణ: 15వ నుడికట్టు (గతవారం) అడ్డం ఆధారాలలో 19 బదులు 21 అని గమనించ ప్రార్థన.] ★

## 15-వ నుడికట్టుకు జవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ప్ర | వే | శ | రు | సు | ము | ■ | చే | ■ |
| ■ | గు | ■ | చి | ■ | ని | న | ద | ము |
| కం | చు | న | గా | రా | ■ | ల్ల | ■ | ఖా |
| ■ | క్క | ■ | ■ | క్ష | య | రో | గ | ము |
| స్తృ | ■ | మో | ■ | స | ■ | జా | ■ | ఖే |
| వెం | క | జ | నా | భా | ■ | ■ | అ | ■ |
| చ | ■ | వ | ■ | ష్టి | రా | మా | ము | తే |
| ము | సి | ము | స్రీ | ■ | స | ■ | ల్యా | ■ |
| ■ | ర | ■ | గ | ణ | భం | గ | ము | లు |

## ★ పాతబస్సు ★

( 8 వ పేజీ తరువాయి)

పాతబస్సు వంతెనను ముందుదాటితే? అసలు మలుపు తిరిగి వస్తే!' ఈ వేగంలో ఏమవుతుందో ఊహించలేకుండా వున్నాము. సబ్ ఇన్స్పెక్టర్ లేచి ముందుని ప్రయాణీకులను అదుపులో ఉంచడానికి ప్రయత్నిస్తున్నాడు.

హారన్ మళ్ళీ వినిపించింది. సుబ్బయ్య హారన్ నొక్కబట్టాడు. ఒకటి రెండు క్షణాలు మోగి ఆగిపోయింది. అదికూడ చెడిపోయింది. సుబ్బయ్యకు రోడ్డును చూడడంతో సరిపోతోంది. బయట నుంచున్న డ్రైవర్ ఏలాగో పట్టుకుని వేళ్లాడుతున్నాడు ఒకచేత్తో రబ్బరు హారన్‌ను నొక్కబోయాడు. బస్సుకుదుపులో అది ఊడివచ్చి అతని కాలు బోర్డుమీదనుంచి జారిపోయింది కాని తలుపును పట్టుకొని ఉండడంవల్ల వేళ్లాడుతూ వుండిపోయాడు. నేనూ, ఇంకొక మనిషీ బయటికి చేయిపోనిచ్చి ఎలాగో అతన్ని పైకి లేవదీశాము.

ఒక ప్రయాణీకుడు—ఇందాక అరిచిన అతను—లేచి పిచ్చిగా కేకలు వేయడం మొదలుపెట్టాడు. ప్రసాద్ అతన్ని బలంకొద్దీ ఒకదెబ్బకొట్టి కూర్చోబెట్టాడు. ఆ దెబ్బకి ఆ ప్రయాణీకుడి పన్ను ఊడి నోట్లో నుంచి నెత్తురు రావటం చూశాను.

"ఎవరైనా సరే! గొడవ పెట్టారంటే...సు!" అనిభయపెట్టారు. సబ్ ఇన్స్పెక్టరుగారు.

మాకూ వంతెనకూ అరమైలుకంటే లేదు. మేమందరం ఊపిరి బిగబట్టుకుని కూర్చున్నాం. ఇక తరవాలేదేమో ననుకుంటూ ఉంటే ఒక బస్సు మలుపుతిరిగి అటునుంచి రావడం మాకు కనుపించింది సరిగ్గా అక్కడ నుంచి రోడ్డు దట్టమయిన చెట్ల పక్కనుంచి వెళ్లడంచేత మాకేమీ కనిపించలేదు. బస్సు హారన్ మళ్ళీ మోగింది.

సుబ్బయ్య 'స్పీడ్' మరింత ఎక్కువ చేశాడు. స్పీడ్ మీటర్ ముల్లు ఏభైమైళ్ళను దాటడం నాకు కనిపించింది.

వంతెన బాగా దగ్గరకు వచ్చేసింది. అవతలిబస్సు దానికి వంద అడుగులుకూడా లేదు. అప్పుడు నాకళ్ళు మమ్మల్ని చూసినట్లుంది. వెంటనే బ్రేక్ వేశాడు కాని ఆగలేదు. పది పదిహేను అడుగులుండనగా మేము వంతెనను దాటేశాము. ఒకవైపు రాసుకుంటూపోయి ఆ బస్సువైపు జరిగిపోయింది మా బస్సు. మా కళ్లముందు ఆ బస్సు భూతంలాగ పెద్దదయి పోయినట్లనిపించింది. సుబ్బయ్య స్టీరింగ్‌ని తిప్పాడు. అడ్డంగా తిరిగి వెంట్రుకవాసిలో తప్పి ఒక చుట్టుచుట్టి కొంతదూరం వెళ్ళి ఆగాము. సరిగా వంతెన మీదకు వెళ్లి ఆగింది రెండో బస్సు.

* * *

వారం రోజుల తర్వాత నేనూ, సుబ్రహ్మణ్యమూ తిరిగి వస్తూవుంటే రామలింగం చెప్పాడు, సుబ్బయ్య మళ్ళీ డ్రైవర్ కాబోతున్నాడనీ, సబ్ ఇన్స్పెక్టర్ గారు అతనికి అన్నివిధాలా సహాయం చేస్తున్నారనీ.





# పుస్తక సమీక్ష

## పౌరుడు—రాజ్యాంగము

(ఇంగ్లీషులో) రచన: ప్రొఫెసర్ ఎమ్. రత్నస్వామి అనువాదం: ఎమ్. ఎస్. ప్రకాశరావు. దక్షిణ భాషా పుస్తక సంస్థ సహకారమున - త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణంవారిచే ప్రచురింపబడినది.

వెల రు. 1-00; పేజీలు 114

"ప్రతి పౌరుడు — తనకు శాసనసభలతో గాని, ఇతర ప్రజాసంస్థలతో గాని ప్రత్యక్ష సంబంధం ఉన్నా లేకపోయినా దేశ వ్యవహారాలు ఎలా నిర్వహింపబడుతున్నదీ తెలుసుకోవాలి. వ్యక్తి హక్కులేవో తెలుసుకోవాలి. నిజానికి మన రాజ్యాంగంలోని ముఖ్య విషయాలను ప్రతి పౌరుడు తెలుసుకోవాలి," అని శ్రీ కె. పి. కేశవ మీనన్ గారు తొలిపలుకులో ఉద్ఘాటించారు. మనకు స్వతంత్రం వచ్చింది, అన్నారు— అంటే ఏమిటో తెలియదు; కాని బ్రిటిషు వారు తొలగిపోయారు, మన చిక్కులు వదిలిపోయినవి, మనం సుఖపడతాము అని వుద్దేశ్యం. 1921–1935 లో ఇండియా చట్టాలు ఇంగ్లండులో వ్రాసయినవి. సామాన్య పౌరుడు వీటికి ప్రాముఖ్యత ఇవ్వలేదు. ఇప్పుడో! స్వతంత్రం అంటే ఏమిటి? మనకు ఆ స్వతంత్ర రాజ్యాంగానికి సంబంధం ఏమిటి? మనమే రాజ్యాంగం రాజ్యాంగమే మనం అని అంటారు చాలామంది — అంటే? ఆ పరస్పరసంబంధం తెలుసుకోవాలె. ఈ పుస్తకం అందుకు సంబంధించిన విషయాలు విశదంగా, వివరంగా తెలియచేస్తుంది. రాజ్యాంగచట్టం ఏ విధంగా శాసనమయింది అధికారాలు ఎవరికి ఎంతవరకు పంచిపెట్టబడినవి మనం తెలుసుకోవాలె. వోట్లు ఇస్తాము. ఎందుకు, ఎవరికి ఎట్లా ఇవన్నీ తెలుసుకోనేందుకు ఉపకరిస్తుంది. మనుజులు కాని, సంస్థలు కాని ప్రతి యొక్కరికిని వారెంతవరకు తమ స్వేచ్ఛను అనుభవించవచ్చునో తెలియచేస్తుంది.

తరువాతి ఈ పుస్తకం జనసామాన్యానికి చదువుకొని అర్థం చేసుకోవడంలో ఎంత వరకు సహాయపడుతుంది? అనేది ప్రశ్న. పుస్తకంలోని విషయం అవసరమైనది కాని తేలికగా బోధపడాలెగా? ఇంగ్లీషులోని సాంకేతిక పదాలను మక్కికి మక్కిగా తర్జుమా చేసినట్లు కన్పిస్తున్నది. అలా చేయకపోతే అర్థం సరిగా రాకపోవచ్చు-నిజమే. కాని చదివే సమయంలో ఆ పదాలను అర్థం చేసుకోనేందుకు డిక్షనరీలకోసం తిరిగి వెతగాలె. మచ్చుకు చూడండి "నియంత్రిక మహాలేఖాపరీక్షకుని నియుక్తియును, ఉద్యోగపు అవధి షరతులును ఉచ్చతమ న్యాయాలయపు న్యాయాధీశుని సందర్భపు పదతులమీదనే ఏర్పాటైనవి." (పేజి 82) ఈ మాటలు గందరగోళంగా వున్నవి. ఫైనాన్సు కమీషన్ అంటే విత్త ఆయోగమన్నారు. ఫైనాన్సుబిల్లు అంటే ధనవిధేయక రూపము - అన్నారు. ఒక్క ఫైనాన్సుకు రెండు రకములైన తర్జుమాలు. కొన్ని సందర్భాల్లో చేసిన తర్జుమాలు ఇంపుగా సొంపుగా కుదిరిపోయినవి. ఉపక్రమణ (ఇనీషియేషన్) ప్రస్తావన (ప్రియాంబుల్) ఇటువంటివి వేలెత్తి చూపించలేము. సర్వీసు కమీషన్ సేవాయోగమన్నారు. ఇటువంటి పదాలను మార్చకుండా అలాగే వుపయోగిస్తే బాగుండేదేమో. ఇంగ్లీషు పదం వుపయోగించకూడదనే వుద్దేశ్యంతో పూనుకొన్నారా అనే ఒక ఊహ కలుగుతుంది. ఈ తర్జుమా చేయబడిన తెలుగు పదాలకు అర్థంకొరకు చాలా ఇబ్బందిపడాలె — జనసామాన్యం. పరిపాటి అయిన పదాలయితే సాగిపోతుంది. చాలా మటుకు ఇది వరకు వినిపడాలే. ఇప్పటికీ అవి వుపయోగింపబడుటలేదు. పత్రికలవారు గాని, సభల్లో గాని, వుపన్యాస ధోరణుల్లో గాని కొన్ని పదాలకు అలవాటయిపోయాం — అంటే సభ్యులు, లోక్ సభ, సర్వీసుకమీషన్ ప్రొసీజరు అన్నట్లుగా Duties అంటే శుల్కమన్నారు. ఒకచోట Custom Duties అంటే సీమాసుంకమన్నారు.

ఇంగ్లీషు పదాలకు పుస్తకం చివర గ్లాసరీగా తెలుగుపదాలు క్రోడీకరించి ఇవ్వాలిసింది. చాలా వుపయోగపడుతుంది చదువరులకు. రెండవ ప్రతిలోనైనా తప్పకుండా చేర్చాలె. అనువాదకులు చక్కటి పాండిత్యంతో ఈ అనువాదం చేశారు. అసలు ఇంగ్లీషులో రాసిన శ్రీ ప్రొఫెసర్ రత్నస్వామి రాజకీయ సంస్థలను గూర్చి నిష్పాక్షికంగా విమర్శన చేశారు అవసరమైన చోట్ల.

మన రాజ్యాంగాన్ని, మన పౌరులను తెలుసుకోవలెనన్న ప్రతి వ్యక్తి ఈ గ్రంథాన్ని తప్పక ప్రేమించి చదివితీరుతాడు.

"రా. మూ."

"శ్రీమతి"—రచన. గోటేటి శ్రీరామారావు, ప్రకాశకులు: శ్రీ కమల్ ప్రచురణలు, C/o మధురవాణి, మదరాసు 15. పాకెట్ సైజు, 68 పేజీలు, వెల 50 న. పై.

కనిపించిన ప్రతీ వస్తువూ కథకు పనికొస్తుందా అని కొందరడుగుతారు. 'ఎందుకు పనికిరాదూ?' అని మరికొందరు ఎదురు ప్రశ్న వేస్తారు. 'నిత్య జీవితంలో జరుగుతున్న సంఘటనలన్నీ కథలే' అనేవాళ్ళూ వున్నారు. 'శ్రీమతి' అనే పేరుతో నాయకిని ఏర్పరుచుకుని శ్రీ గోటేటి శ్రీరామారావు రాసిన కొన్ని "కథ"ల గుచ్ఛం—ఈ "శ్రీమతి". పెళ్లాం గాజులు వేయించమంటే కథ, కొత్తచీర కొనుక్కుంటే కథ, ఏడుస్తే కథ, నవ్వితే కథ, ఏమీ చెయ్యకపోయినాకూడా ఒక కథ! ఇవీ ఈ కథల యొక్క కథావస్తువులు! 'శ్రీమతి' నాయకిగా లేకుండాకూడా కొన్ని కథలున్నై. ఇందులో మచ్చుకు 'అపరిచిత స్త్రీ' అనే ఒకకథ చూదాం: ఒకతను బెంగుళూరు వెళ్ళాట్ట— మొట్టమొదటిసారి. రాత్రి సినిమా నుంచి వస్తాడు—బస్సుల్లేవు. రిక్షాలో ఎక్కబోతూవుంటే ,ఓకామె వచ్చి 'నేను ఎక్కుతాను'అని ఎక్కుతుందట. దార్లో ఇద్దరూ మీరెవరంటే మీరెవరని మాట్లాడుకుంటారు. ఒకచోట రిక్షా కుదుపుకు ఒకరిమీద ఒకరు పడిపోతారట. అధరాలు కలుసుకుంటాయట. దార్లో రిక్షా వదలకపోగా ఆమె అతన్ని తన ఇంటికి తీసుకుపోతుందట. ఆ రాత్రి కమ్మని భోజనం పెడుతుందట. ఇతనికి వేరే పాన్పు ఏర్పాటు చేస్తుందట. ఇతనికి నిద్రపట్టదుట. ఆమె వచ్చి ఇతని సరసన కూర్చుని ఇతనిలో 'నిద్రిస్తున్న వాంఛల్ని రేకెత్తిస్తుందట! తర్వాత అతని 'ముంగురులను సవరించటమూ,' పెదవులను చుంబించాలని శిరము వంచటమూ, 'వీధి మధ్య నేనెంచుకున్నట్లు విద్యుద్దీపము ఆరిపోవటమూ' జరిగిపోతాయట! ఆ తర్వాత రచయిత రాసిన వాక్యం—"అబ్బ ఇక తర్వాత చెప్పలేను". తెల్లారిలేచి అక్కర్రాడు తనదారిన తానుపోతాడు. ఆమె 'అప్పుడు అప్పుడూ వస్తూవుండండి' అనికూడా అంటుంది. "ఆమె పేరు తెలుసుకోడం మరిచిపోయాను కాని, ఆమె నా మనస్సు దోచుకుందనిమాత్రం గట్టిగా చెప్పగలను" అంటాడు రచయిత చివరన. కొన్ని చోట్ల కొన్ని మాటలకు మనకు అర్థాలు తెలియక పోతాయని బ్రాకెట్లలో అర్థాలుకూడా పొందుపరిచి మనకు శ్రమలేకుండా చేశారు. ఉదాహరణ: కల్ల (అబద్ధము) కోష్టు (తీరానికి, సమీపానికి) వసర్ (అధికారం) సాంబారుసాదం (సాంబారుఅన్నం) మొదలైనవి.

—సుకుమార్.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd by S. Radha Krishna at




'చీటికిమాటికి చిట్టెమ్మంటే
చీపురుదెబ్బలు తింటవురో - రయ్యో కొయ్యోడ'

ఆంధ్ర ప్రదేశ్ అంతటా విజయవంతముగా నడుచుచున్న

4 వ. వారం






